# కృతజ్ఞతాభివందనములు

ఈ గ్రంథమును ముద్రించుకాలమున గ్రంథకర్తకు బహువిధముల సాయపడి, యీ గ్రంథమునకు ప్రకాశకులైన శ్రీ రామానంద గౌడీయమఠాధికారులును, పరమభాగవతోత్తములునగు పండిత శ్రీపాద నరసింహ బ్రహ్మచారిగారికిని, కృష్ణసేవానైష్ఠిక శ్రీపాద ఆనందబ్రహ్మచారిగారికినీ నేనెంతయు కృతజ్ఞుడనై యున్నాను. శ్రీవారి పాదపద్మములకు నానిరంతర భక్తిపూర్వక కృతజ్ఞతాభివందనము లర్పింపఁబడుగాక !

ఇట్లు,

విన్నవించు విధేయు[illegible]

గ్రంథక[illegible]

# నివేదనము

ఆంధ్రభాషాప్రియ సోదర సోదరీ బృందమునకు వందనములు. "దేశభాషలందు తెనుఁగులెస్స" యనుట జగద్విదితము. రామాయణ మాదికు మహాకావ్యము. అమృతసముద్రము. శ్రీరాముఁడు మహాపురుషుఁడు. అవతారపురుషుఁడు. మాయామానుష విగ్రహుఁడు. ఆదిదేవుఁడు. శ్రీహరి. ఆ మహానుభావుని చరిత్రము నెన్నిసారులు విన్నను వ్రాసినను నిత్యనూతనమే. పలువురు పలురీతుల నా మహాచిత్ర చరితామృతమును గోలిరి, గోలుచున్నారు; తనియకున్నారు. అనేక జన్మాంతర సుకృతఫలముగా లభించిన యీ మానవజన్మము దుర్లభము. ఈజన్మనుండియే మానవు డుత్తమగతి నందవలెను. అట్టియుత్తమగతి నొందవలెనన్న గతజన్మపాపసంక్షయముగావలెను. మఱియు నీజన్మమునందలి తాపత్రయ మడఁగి ప్రశాంత జీవనము లభింపవలెను. ఇందులకుఁ దగినమార్గము తారకనాముండగు శ్రీరాముని దివ్యచరిత్ర పఠనమేయని తలఁచి నంతను, ఎల్లరు సులభముగ స్వల్పకాలములో పఠించి తరింపఁవలెనని యుద్దేశించి దానిని సులభముగఁ జదువననువగు కందపద్యములలో సవిధముగ శ్రీ సీతారాము యనుగ్రహమున రచింపఁగల్గితిని.

ఈ గ్రంథమును శ్రీరామచంద్రుఁడే ప్రేరేపించి వ్రాయించెను. అదెట్లన 1931వ సం॥రపు వేసవియందు నేను ప॥ గో॥ మండలము నందలి బొట్టంపాలె మను గ్రామమున నుండగా నా యూరి కోదండరామస్వామి యాలయముననున్న దేవుఁడొకనాఁడు మధ్యాహ్నసమయమున నన్ను ప్రేరేపించి తన యాలయమునకు గొంపోయెను. నేనంతట తద్దేవాలయ బహిర్ద్వారజీర్ణకవాట బృహద్రంధ్రంబులనుండియే లోపలఁదెఱచియున్న గుడిలోని శ్రీ సీతారామ లక్ష్మణ సమేత శ్రీ కోదండరామస్వామి విగ్రహంబును గాంచఁగల్గితిని. శ్రీ[illegible]నే యా దేవునిపై కందములలో నొకశతకము

ప్రాయుడనని మ్రొక్కుకొంటిని. ఇంటికిఁబోవుసరికి మనసుమారినది. శ్రీరామచరిత్రమంతయు నొకశతకమున నిముడ్చుట కష్టమని యా చరిత్రనంతను నా "బుద్ధిఁదోచినంత, బుధులచేవిన్నంత, తెలియవచ్చినంతగ" తేటపఱుపఁగోరి, యేతద్రచనమునకుంబూనితిని. ఎన్ని యంతరాయములు గలిగినను గణింపక శ్రీరామచంద్రుని యడుగడుగునకుం దలంచుచుఁ బిలచుచు నాకరుణామయు ననుగ్రహముచే నీగ్రంథము నిట్లు ముగించి యాంధ్రభాషాప్రియులకును ముఖ్యముగా రామభక్తులకును సమర్పించుకొనుచున్నాను.

ఇది భాషాపాటవమునకై తగినంతకృషి సల్పుటకుఁ వీలులేని బాల్యంబున కేవల భగవద్భక్తి భాషాసక్తుల ప్రేరణంబున నాచే రచింపఁబడిన కారణమునఁ మిక్కిలిగ దోషభూయిష్ఠముగనే యుండవచ్చును. పెద్దలు పెక్కుడు సంస్కరించిరి. ఇంకను గననగు దోషములు సహృదయులుఁ దెలిపిన పునర్ముద్రణమున సవరించుకొందును. ఇందలి రచనాదులంగూర్చి పెద్దలగు కొందరు విద్వద్వరేణ్యులిచ్చిన యభిప్రాయములనిందు పొందుపఱచుచున్నాను. పాఠకమహాశయులందలి భావములను తమపఠనానుభవముతోఁ బోల్చుకొందురుగాక ! యని కోరుచున్నాను. ఈ సందర్భమున మహాభక్తుఁడు మహాకవియునగు పోతన చెప్పిన రెండువాక్యముల నుదాహరించుట సమంజసమని తలంతును.

"అపశబ్దంబులఁ గూడియున్ హరిచరిత్రాలాపముల్ సర్వపాప పరిత్యాగము సేయుగావున"

"హరినామ స్తుతిలేని కావ్యము విచిత్రార్థాన్వితంబయ్యు శ్రీకరమై యుండదు..."

కావున నిట్లు శ్రీహరి యవతారమగు శ్రీరాముని చరిత్రను కేవల భక్తిమాత్రమ్మునను శ్రీరామప్రేరణ వలనను వ్రాసితినని మనవి చేయుచున్నాను.

ఆదిలో యీ గ్రంథ రచనాకాలమున బాలకాండముతోనే విరమింపనున్న నన్ను ప్రోత్సాహపఱచి తమయాశీర్వచన బలముచే నాయీ గ్రంథపరిపూర్ణ రచనకు దోహదమిచ్చినట్టియు, యిప్పుడును బహుకార్య నిమగ్నులయ్యు, బహుళవయోవృద్ధులయ్యు నీ వేసవిదినములలో నాకావ్యమును పరిశీలించి కొంతవరకు సంస్కరించిన కవిలోక పితామహులు, కవిసార్వభౌమాది బహుబిరుదాంకితులు బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారికినీ, ఈ గ్రంథమును సమగ్రముగా విని తమ యమూల్య సంస్కరణల నొసంగిన సాత్త్విక స్వభావులు బ్రహ్మశ్రీ మంచాసక్థుల సీతారామశాస్త్రిగారికినీ, బ్రహ్మశ్రీ వారణాసి గంగాధరశాస్త్రిగారికినీ, బ్రహ్మశ్రీ కప్పగంతుల సుబ్రహ్మణ్యశాస్త్రి గారికినీ, నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనములు. మఱియు నా యీ గ్రంథముద్రణాకార్యమునందేమి గ్రంథసమగ్ర సంస్కరణా కార్యమునందేమి చాలకాలమునుండి యపార నిర్హేతుక కరుణా హృదయముతో తమకార్యంబుల పరిత్యజించియు తొల్లి నారాయణ భట్టు నన్నయకుంబలె నేడు నాకు సర్వవిధముల తోడ్పడిన నా చిర కాల మిత్రులు·విద్వత్కవివరేణ్యులు, నిగర్వశిఖామణి, పరోపకార దీక్షాదక్షులునగు బ్రహ్మశ్రీ పప్పు కన్నారావుగారికిని నా యనవరత కృతజ్ఞతాపూర్వక నమోవాకములు.

మఱియు నా యీ గ్రంథమును కొంతయును, సమగ్రముగను జూచి దయతో తమ యమూల్యాభిప్రాయముల నొసంగిన శ్రేయోభిలాషు లగు, విద్వత్కవివరేణ్యులకెల్లరకును నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనము లర్పించుచున్నాను.

ఇట్లు విన్నవించు,

సుజన విధేయుడు,

గ్రంథకర్త

కొవ్వూరు,
15–6–1954.

ప్రాయుడనని మొక్కుకొంటిని. ఇంటికిఁబోవునరికి మనసుమారినది. శ్రీరామచరిత్రమంతయు నొకశతకమున నిముడ్చుట కష్టమని యా చరిత్రనంతను నా "బుద్ధిఁదోచినంత, బుధులచేవిన్నంత, తెలియవచ్చినంతగ" తేటపఱుపంగోరి, యేతద్రచనమునకుంబూనితిని. ఎన్ని యంతరాయములు గలిగినను గణింపక శ్రీరామచంద్రుని యడుగడుగునకుం దలంచుచుఁ బిలచుచు నాకరుణామయు ననుగ్రహముచే నీగ్రంథము నిట్లు ముగించి యాంధ్రభాషాప్రియులకును ముఖ్యముగా రామభక్తులకును సమర్పించుకొనుచున్నాను.

ఇది భాషాపాటవమునకై తగినంతకృషి సల్పుటకుఁ వీలులేని బాల్యంబున కేవల భగవద్భక్తి భాషాసక్తుల ప్రేరణంబున నాచే రచింపఁబడిన కారణమునఁ మిక్కిలిగ దోషభూయిష్ఠముగనే యుండవచ్చును. పెద్దలు పెక్కురు సంస్కరించిరి. ఇంకను గననగు దోషములు సహృదయులుఁ దెలిపిన పునర్ముద్రణమున సవరించుకొందును. ఇందలి రచనాదులంగూర్చి పెద్దలగు కొందరు విద్వద్వరేణ్యులిచ్చిన యభిప్రాయములనిందు పొందుపఱచుచున్నాను. పాఠకమహాశయులందలి భావములను తమపఠనానుభవముతోఁ బోల్చుకొందురుగాక! యని కోరుచున్నాను. ఈ సందర్భమున మహాభక్తుఁడు మహాకవియు నగు పోతన చెప్పిన రెండువాక్యముల నుదాహరించుట సమంజసమని తలంతును.

"అపశబ్దంబులఁ గూడియున్ హరిచరిత్రాలాపముల్ సర్వపాప పరిత్యాగము సేయుగావున"

"హరినామ స్తుతిలేని కావ్యము విచిత్రార్థాన్వితంబయ్యు శ్రీకరమై యుండదు..."

కావున నిట్లు శ్రీహరి యవతారమగు శ్రీరాముని చరిత్రను కేవల భక్తిమాత్రమ్మునను శ్రీరామప్రేరణ వలనను వ్రాసితినని మనవి చేయుచున్నాను.

ఆదిలో యీ గ్రంథ రచనాకాలమున బాలకాండముతోనే విరమింపనున్న నన్ను ప్రోత్సాహపఱచి తమయాశీర్వచన బలముచే నాయీ గ్రంథపరిపూర్ణ రచనకు దోహదమిచ్చినట్టియు, యిప్పుడును బహుకార్య నిమగ్నులయ్యు, బహుళవయోవృద్ధులయ్యు నీ వేసవిదినములలో నా కావ్యమును పరిశీలించి కొంతవరకు సంస్కరించిన కవిలోక పితామహులు, కవిసార్వభౌమాది బహుబిరుదాంకితులు బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారికినీ, ఈ గ్రంథమును సమగ్రముగా విని తమ యమూల్య సంస్కరణల నొసంగిన సాత్త్విక స్వభావులు బ్రహ్మశ్రీ మంచాసర్ఘుల సీతారామశాస్త్రిగారికినీ, బ్రహ్మశ్రీ వారణాసి గంగాధరశాస్త్రిగారికినీ, బ్రహ్మశ్రీ కప్పగంతుల సుబ్రహ్మణ్యశాస్త్రి గారికినీ, నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనములు. మఱియు నా యీ గ్రంథముద్రణాకార్యమునందేమి గ్రంథసమగ్ర సంస్కరణా కార్యమునందేమి చాలకాలమునుండి యపార నిర్హేతుక కరుణా హృదయముతో తమకార్యంబుల పరిత్యజించియు తొల్లి నారాయణ భట్టు నన్నయకుంబలె నేడు నాకు సర్వవిధముల తోడ్పడిన నా చిర కాల మిత్రులు విద్వత్కవివరేణ్యులు, నిగర్వశిఖామణి, పరోపకార దీక్షాదక్షులునగు బ్రహ్మశ్రీ పప్పు కన్నారావుగారికిని నా యనవరత కృతజ్ఞతాపూర్వక నమోవాకములు.

మఱియు నా యీ గ్రంథమును కొంతయును, సమగ్రముగను జూచి దయతో తమ యమూల్యాభిప్రాయముల నొసంగిన శ్రీయుతు లగు, విద్వత్కవివరేణ్యులకెల్లరకును నా హృదయపూర్వక కృత జ్ఞతాభివందనము లర్పించుచున్నాను.

ఇట్లు విన్నవించు,
సుజన విధేయుడు,
గ్రంథకర్త

కొవ్వూరు,
15—6—1954.

# అభిప్రాయములు

శ్రీ వీరభద్ర కవిగారు తాము రచించిన శ్రీమత్కంద రామాయణమును దయతో నొసంగఁగాఁ బఠించి యమితానందము నందితిని. వీరు దీనిని శ్రీరామచంద్రుని ప్రేరణచేఁ దమ పదునాఱవయేటనే ప్రారంభించి నాలుగేండ్లలో ముగించిరట! బమ్మెరపోతనవలె నా బాల్య భగవద్భక్తులగు వీరికిది యసాధ్యముకాదు. వీరికవితాశైలియుఁ జాలవఱకుఁ బోతన శైలి ననుకరించును. ఇద్దఱును "బలికించెడివాఁడు రామభద్రుం"డని ప్రారంభించిన వారేకదా!

భారతదేశమున శ్రీమద్రామాయణమునకున్నంత ప్రచారమింకొక గ్రంథమునకు లేదనుట సర్వజన విదితము. దీనికి హేతువు పరమ కల్యాణకరమగు శ్రీరామచంద్రుని చరిత్రము వాల్మీకి మహర్షి మృదుమధుర కవితాసౌరభముచే సంవాసితమగుటయే. రామాయణమున కిప్పటికెన్నో యనువాదములు బయలుదేఱినవి; బయలుదేఱుచున్నవి. "రాఘవేశ్వరుచారిత్రము నెందఱెన్ని గతులన్ వర్ణించినన్ గ్రాలదే" అన్నాడు కంకంటి పాపరాజు. "యదిక్షుణ్ణం పూర్వైరితి జహాతి రామస్యచరితం, గుణైరేతావద్భిః జగతిపునరన్యోజయతి కః" అన్నాడు మురారి కవి. కావున దీనికిఁ బునరుక్తి దోషములేదు. అంతియె కాక వీరు దీని నాంధ్రుల జాతీయచ్ఛందమగు కందములలో రచియించుటయు, రామాయణ మహాకావ్యమును యథాతథముగా గాక యందలి సారతర భాగములను మాత్రమే గ్రహించి పాఠకులకు విసుగుపుట్టకుండునట్లు సంగ్రహపఱచి, నడుమ నడుమ నలఁతి యలఁతి వచనములఁగూడ గూర్చి యమర్చుటయు నీకావ్యమునకొక ప్రత్యేక విశిష్టత నాపాదించుచున్నవి. ఈఫక్కివలన నీగ్రంథము పండితులకే కాక సామాన్యులకును రామకథా సుధారసము నాస్వాదించు నవకాశముగల్గించి కవి యుద్దేశమును సఫలమొనర్చుకొన్నది.

తెలుఁగున "కందము వ్రాసినవాఁడే కవి" యని యొకసామెత కలదు. యతిప్రాస నియమము, గణనియమము, విషమపాదతగల యీచిన్నపద్దెమును వ్యర్థపదములు లేకుండ ధారావాహికగా రచించుట దుస్సాధ్యము. శ్రీ వీరభద్ర కవిగారి కందములు రసవన్మాకంద

ములై చదువరులకు ప్రసన్న కథా కలితార్థయుక్తితో పాటు అక్షర రమ్యతనుగూడ ప్రసాదించుచున్నవి. స్వభావోక్తి, జాతీయ పద ప్రయోగములు సప్రయత్నముగా నిందలి పద్యముల దొరలినట్లు గాన్పించుచు, గవిభావనా బలమును నిరూపించుచున్నవి. ఉదాహరణమునకు దశరథుడు పుత్రులులేని గృహమును నిందించుచుఁ జెప్పిన యీ క్రింది పద్యము గమనింపదగును.

చిడిముడి యడుగుల నిడుచును,
బడిబడి నోడువుచును నగుచు ♦ పడి మగుడ వడిఁ
బుడిబుడి నడకల నడచెడి,
బుడుతలు గలయదియె యిల్లు ♦ పుడమిని నెందున్.

ఇది చదువునప్పుడు చిన్నపిల్లలు తప్పటడుగు లిడుచు మన యెదుట నడచుచున్నట్లే కాన్పించును.

శ్రీ వీరభద్ర కవిగారి భక్తహృదయమునుండి యింకను నిట్టి సరసకావ్యములు బయల్వెడలి ఆంధ్రావళి నానందపఱుపగలవని యాశించుచున్నాను.

విద్వాన్ శ్రీ కేశిరాజు వెంకట నృసింహ అప్పారావు, ఎమ్. ఎ.
ప్రధానాచార్యులు -- శ్రీ ఆంధ్ర గీర్వాణ విద్యాపీఠం, కొవ్వూరు.

---

శ్రీ లింగం వీరభద్రరాయ కృతమగు శ్రీ మత్కంద రామాయణమును స్థాలీపులాకన్యాయమున మాత్రమే చదువ గలిగినందులకు విచారమగుచున్నది. ఆమూలాగ్రముగఁ చదువు భాగ్యంబు గ్రంథ ముద్రణమయిన తర్వాతగాని లభించనట్లున్నది. వీరి శైలి మృదుమధురమై, పెక్కుచోట్ల శ్రీ బమ్మెరపోతన శైలిని దలపించుచున్నది. వీరభద్రరావుగారా బాల్య భక్తులు. శుద్ధ సాత్త్వికులు, సుగుణ సముద్రులు. వీరి గుణములన్నియును వీరి కావ్యమునఁ బ్రత్యక్షరమందును బ్రతిఫలించుచున్నవి. ఈకావ్య మాచంద్రార్క మాంధ్రావని నలరుచు భక్తిశూన్యుల హృదయములలో భక్తి బీజముల నాటునని నాయాశయము, నాశీస్సులుగూడ.

కొవ్వూరు
గోదావరీ తీరము

ఇట్లు,
నాదెళ్ళ వెంకట్రావు, బి.ఏ., బి.యల్.

నాకు మిత్రులు సహోధ్యాపకులునగు శ్రీ ఎల్. పి. వీరభద్ర
రావుగారు సుమారు నాలుగు సంవత్సరములకుఁ బూర్వమే తమ
కందరామాయణమందలి కొన్ని కాండములను నాకుఁ జూపించిరి.
మఱియు నీ గ్రంథము నచ్చువేయించు నుద్దేశమున్నది కాన నిందు
నచ్చటచ్చటఁ బొసఁగినదొసఁగుల సవరింపుడనియుఁగూడ నుత్సా
హముతో నన్నడిగియుండిరి. నాయందట్టి యర్హతలేకున్నను, వారి
కోర్కె నొక యాదేశముగ భావించు నర్హతమాత్రమే కలవాడనగుట
నందులకుఁ బూనుకొని నాచేనైనంతవరకు నాపని నెఱవేర్చితిని. ఈ
విధముగ నాకు, గడచిన మే నెలలో నీ సద్గ్రంథమామూలాగ్రముగ
పఠించు సదవకాశము లభించినది.

గ్రంథముపై నా యభిప్రాయముందెల్పుటకు ముందుగ నీ
గ్రంథకర్తమగూర్చి సుంతయైనఁ జెప్పకుండుటకు నాస్వాంతమంగీక
రింపకున్నది. గుణగణములు శ్రీ వీరభద్రరావుగారి నెంత వరించి
యున్నవో నిజముగ నిప్పుడు చెప్పందొరకొనినచో శ్రీరామచరిత్ర
వలెనే వీరిదిగూడ నొక పెద్ద సచ్చరిత్ర కాగలదు. వీరు నిరంతర దైవ
భక్తిపరులు. మృత్స్నవర్ణ సమబుద్ధులు, లౌకిక వ్యవహారావృత
మనస్కులయ్యు నంతర్ముఖులై సదా భగవన్నామజప పరాయణులు,
సుఖదుఃఖములు దైవదత్తములనియెంచి వానికింబొంగుక్రుంగు లెఱుం
గని దృఢాంతరంగులు. మానవులకించిజ్ఞత నర్థముచేసికొని చరించు
నాదర్శజీవులు. ఆదర్శచరితుడగు శ్రీరామచరితమును రచియింపఁ
బూనుటయే వారి యనూన దైవభక్తితత్పరత కొక నిదర్శనము.

నేటికవిత యొక విచిత్రమార్గమునఁబడి సాగిపోవుచున్నది.
పోకడల వైవిధ్యమునకు పరిమితి గానరాకున్నది. ఇంచుమించుగ
సారస్వతరంగము రచ్చబండయైపోయినది. పోయిపోయి యెటనాగునో
తెలియకున్నది. కావ్య ముఖ్య ప్రయోజనమగు లోకకల్యాణము
గాని సత్కార్య సమాచరణ దుష్కార్య నిరాకరణేచ్ఛాజనకతగాని
దైవభక్తి ప్రబోధముగాని నేటికటు వాఙ్మయమున మృగ్యమైపోవు

చున్నదనుటలో సందేహము లేశమునులేదు. ఇట్టికాలములో నాదర్శ పురుషుఁడును, ఆరాధ్య దైవమునగు శ్రీరామచంద్రుని పరమపవిత్ర చరిత్ర నీ కవివ్రాసి, మఱియొకమారు మానవలోకమునుదట్టి, కండ్లకు గ్రమ్మిన కనికట్టును బోగొట్టి, ప్రాచీన హైందవకావ్య విశిష్టత నొక్క పరి కన్నులకు గట్టుట యాంధ్రపాఠకలోకముఁ గట్టిపుణ్యము ఫలించుటచేతనేకాక మఱేమున్నది?

శ్రీకృష్ణుఁడు భోగజీవి; శ్రీరాముఁడు త్యాగజీవి. కృష్ణుఁడు త్యాగము నుపదేశించినాఁడు; రాముఁడు తాను త్యాగముచేసిచూపి యందలి సుఖాతిశయమును నిరూపించియున్నాఁడు. శ్రీకృష్ణుఁడు దైవత్వమును దొరంగకయేయున్నాఁడు. రాముఁడట్లుగాదు. మానవలోకము నుద్ధరించుటకుఁబూని మానవులలో మానవుఁడై మసలినాఁడు. మానవజీవిత సమాగత కష్టపరంపర ననుభవించి యాత్మశక్తితో, త్యాగదీక్షతో, మనోనైశ్చల్యముతో, మనోనైర్మల్యముతో దానింగడచినాఁడు. తాను దైవమునని మనమువిని గ్రహించునట్లు చేసియున్నాఁడు. దయ, సత్యము, శౌచము, త్యాగము, చిత్తశుద్ధి మున్నగు నేగుణములు దైవస్వరూపములో, వానినెల్ల మనము శ్రీరామునిలోఁ గనుగొనఁగలము. అనగా దైవమునకు సన్నిహితత్వమును గల్గించు నా సద్గుణగణముల నాచరణద్వారా మనకు నేర్పు నీ శ్రీరామచరిత్ర మనకు పునఃపునః పఠనయోగ్యముకదా! అట్టి శ్రీరామచరిత్రను వ్రాసిన యీ కవియు, నందుకొనిన పాఠకలోకమును ధన్యతములనుట సత్యేతరము కాజాలదు.

గ్రంథము మిక్కిలి హృద్యమైయున్నది. అనవద్యముగూడ. పద్యములు కందములగుటచే నందములై భాషాజ్ఞానముగల పిన్నల డెందమునకు సైతమానందకరములు కాగలవు. ఆశ్వాసాద్యంత పద్యములు, షష్ఠ్యంతములు మున్నగు సంప్రదాయములు, పూర్వ ప్రబంధ ధోరణినే నడచి, ప్రాచీనాంధ్ర భాషావిస్తృతిని, భావపుష్టిని, సారస్వత విశిష్టతను నొక్కపరి జ్ఞప్తికిఁదెచ్చి యాంధ్రులకఖర్వ గర్వ జనకములగుచున్నవి. రచనా వేగములో దొరలిన కొన్ని వ్యాకరణ విరుద్ధ ప్రయోగములు గన్పట్టినను నవి క్షంతవ్యములు. అందులకు

కారణ మట్టివి పూర్వకవి ప్రయుక్తములే యనునదొక్కటియే కాదు రసావిర్భావత్వావరోధములు గాకుంటచే వానికి దోషత్వము పట్టనేరదు. శైలి సరళమై యున్నది. అటనట కొన్ని పద్యములు, మఱియు ధారాశుద్ధితో నొప్పుచున్నవి. కథా కదన మొడుదుడుకులు లేక చక్కగా సాగినది.

ఇంకను నాంధ్ర భారతీసేవ నీకవి యితోధికముగఁ జేయుదు రని యాశించుచున్నాను. అందులకై పరమేశ్వరుఁడు వీరికి దీర్ఘాయు రారోగ్యాద్యనేక భాగ్యంబు లొసంగుగాతమని కోరుచున్నాను.

పప్పు కన్నారావు,
భాషాప్రవీణ

15—6—1954,
రాజమహేంద్రవరము.

ప్రధానాంధ్రోపాధ్యాయుఁడు,
స్థానికోన్నత పాఠశాల—కొవ్వూరు.

---

వేదవేదాంగ విశారద, వేదార్థాభిజ్ఞ

## బ్ర॥శ్రీ॥ కొంపెల్ల సత్యనారాయణశాస్త్రి

శ్రీ వీరభద్రరావుగారిచే రచితమైన యీ కందరామాయణ మును నేను స్థాలీపులాకన్యాయముగఁ జదివితిని. శైలి ధారాశుద్ధిఁ గలిగి మహారంజకముగ నున్నదనుటలో సందియమావంతయు లేదు. అటనట, కొన్ని వ్యాకరణ విరుద్ధ ప్రయోగములున్నను నవి పూర్వ మహాకవి ప్రయుక్తములే యగుట క్షంతవ్యములే కాని దొసగులనుట కుం దగినవిగావు. ఈనాటి దేశస్థితికి, కాలపరిస్థితికి, ఇట్టి రామభక్తి బోధక గ్రంథమొండు నూతనముగ హృదయంగమముగ వెలువడు టెంతయు నావశ్యకము. ఎల్లరు నీసరళ పద్యరత్నభరిత గ్రంథమునుఁ జదివి సద్యః పర నిర్వృతిని నిశ్చలభక్తినిఁ గాంచుట మంచిది. అధి కారుల మన్ననకుఁ బాత్రమై యీచరిత్ర యాచంద్రార్కము విల సిల్లునని యాశించుచున్నాను.

ఇది ధర్మాజీగూడెము హైస్కూలులో టీచరు శ్రీ లింగం పెదవీరభద్రరావు బి. యె. గారు రచియించియున్నారు. ఈ గ్రంథము సంపూర్ణముగా వారే చదివి నాకు వినిపించినారు. గ్రంథమంతయు బాలకాండము మొదలుకొని యుద్ధకాండమువరకు యారు కాండములు నేను విని యున్నాను. వీరభద్రరావుగా రిదివరకు చిన్నచిన్న పుస్తకములు రచించియున్నారు. ఇదియును 10 సంవత్సరముల క్రిందటనే వ్రాసియున్నారు. నేను వినినంతలో శైలి చక్కగానేయున్నది. కవిత్వము కఠినముకాక మృదుమధురముగానున్నది. చిన్నచిన్నతప్పులు కొనికి "క" లు, అఖండయతులు లోనగునవి కలవు. అవి యిప్పటి నవనాగరకకవులకు సమ్మతమే. అట్టివి కొన్ని యున్నను వాని నీముద్రణములో చాలాభాగము సంస్కరించి యున్నారు. వీరభద్రరావుగారు భక్తులు, గ్రంథమంతయు భక్తిబోధకముగా నున్నదని చెప్పుచున్నాను.

కవిసార్వభౌమ బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి

---

శ్రీ వీరభద్రరావుగారు రచించిన కందరామాయణము నందలి భాగములు గొన్నింటిని నేను వింటిని. దానినిబట్టి వారిశైలి మృదువుగను సరసముగను నున్నదని గ్రహించితిని. చిన్నతరగతి బాలురు గూడ వానినర్థము చేసికొనుట కనువుగనుండునని యూహింతును. విజ్ఞులు వారి రచనాసక్తిని వృద్ధిపరతురని యాశించుచుంటిని.

వ్యాకరణశిరోమణి బ్రహ్మశ్రీ వారణాసి గంగాధరశాస్త్రి

సీనియర్ తెలుగుపండిట్

బి. హెచ్. స్కూలు—కొవ్వూరు

## బాల కాండము


| | | పుటలు |
|---|---|---|
| 1 | అయోధ్యా పురవర్ణనము — దశరథునిపాలన ... | 5–7 |
| 2 | దశరథుడు సంతానము లేక చింతించుట–పుత్రకామేష్ట్యధ్వరప్రయత్నము | 7–8 |
| 3 | శ్రీరామాదులజననము — బాల్యక్రీడలు ... | 9–11 |
| 4 | విశ్వామిత్రాగమనము — యజ్ఞరక్షకు రామలక్ష్మణ లేగుట | 12–14 |
| 5 | తాటకవధయు— యజ్ఞసంరక్షణమును ... | 15–16 |
| 6 | రామలక్ష్మణుల మిథిలా ప్రయాణము - సీతావృత్తాంతకథనము | 16–18 |
| 7 | అహల్యా వృత్తాంతము — స్తోత్రము ... | 18–20 |
| 8 | రామలక్ష్మణుల మిథిలా ప్రవేశము - సీతారాముల యన్యోన్యసందర్శనము ... | 21–23 |
| 9 | విశ్వామిత్రుడు రామలక్ష్మణులతో జనకునిం గనుట ... | 24–25 |
| 10 | శివధనుర్భంగము — సీత రాముని వరించుట ... | 25–26 |
| 11 | సీతాకల్యాణ మహోత్సవము ... | 27–29 |
| 12 | సీతాదుల నప్పగించుట — జనకాదుల విచారము ... | 30–31 |
| 13 | పరశురామ గర్వభంజనము ... | 31–32 |
| 14 | రామాదుల యయోధ్యా ప్రవేశము—కాండాంతము | 33–34 |


## అయోధ్యా కాండము


| | | |
|---|---|---|
| 1 | పరిణీతులైన సీతారాముల సుఖస్థితి ... | 35–36 |
| 2 | దశరథుడు రామునకు పట్టంబుకట్ట నిశ్చయించుట - రాజనీతియుపదేశము ... | 36–37 |
| 3 | కైకకు మందరదుర్బోధ ... | 38–39 |
| 4 | కైక దశరథుని వరంబులగోరుట ... | 39–40 |
| 5 | దశరథుడు మూర్ఛిల్లుట ... | 41–42 |
| 6 | రాముడు కైకతో సంభాషించుట ... | 43–44 |
| 7 | రాముడు కౌసల్య నోదార్చుట ... | 44–45 |
| 8 | రాముడు సీతతో సంభాషించుట ... | 45–46 |
| 9 | పురజనులు రామునను గమించుట ... | 46–47 |
| 10 | రాముడు గంగానదిని దాటి చనుట ... | 48–49 |
| 11 | రాముడు చిత్రకూటమున వసించుట ... | 49–50 |
| 12 | రామ వియోగభరంబున దశరథుడు దివంగతుడగుట .... | 51– |
| 13 | భరతుండయోధ్య కేతెంచుట ... | 51–52 |
| 14 | భరతుండు రాముని దర్శించుట ... | 52–53 |
| 15 | రాముడు భరతుని బంధువుల నూరడించుట ... | 53–54 |
| 16 | కాండాంతము ... | 55– |

## ఆరణ్య కాండము


| | | |
|---|---|---|
| 1 | శ్రీరాముడు చిత్రకూటము వదలి అరణ్యంబునకుఁబయనించుట | 56-57 |
| 2 | శ్రీరాముడు దండకారణ్యము ప్రవేశించుట ... | 58- |
| 3 | సీతారాములు పంచవటింగాపుర ముండుట ... | 59-60 |
| 4 | శూర్పణఖాపరాభవాదికము ... | 60-61 |
| 5 | శూర్పణఖ రావణుం బ్రేరేపించుట ... | 61-62 |
| 6 | మారీచుడు మాయామృగంబై యేగుట ... | 62-63 |
| 7 | సీతలక్ష్మణుని రామసహాయార్థము పంపుట - సీతాపహరణము | 63-64 |
| 8 | రామలక్ష్మణులు సీతకై విలపించుట ... | 65- |
| 9 | జటాయువు సందర్శనము—కబంధవధ ... | 66- |
| 10 | రామునకు శబరి యాతిథ్యమిడుట—భక్తితత్వప్రశంస | 67-68 |
| 11 | శబరి రామునకు సుగ్రీవునిగూర్చి తెలుపుట—కాండాంతము | 68-69 |


## కిష్కింధ కాండము


| | | |
|---|---|---|
| 1 | రామలక్ష్మణులు ఋష్యమూకమును చేరుట ... | 70-71 |
| 2 | హనుమంతుడు రామసుగ్రీవులకు సఖ్యము నొడగూర్చుట | 71-72 |
| 3 | రాముని పరాక్రమముంగని సుగ్రీవుడుసహాయముచేయనియ్యకొనుట | 72-73 |
| 4 | వాలిసుగ్రీవులయుద్ధము రాముడు వాలిని గూల్చుట ... | 74-75 |
| 5 | వాలి రాముని దూఱుట రాముడు వాలి బాంధవుల నూరార్చుట | 76-77 |
| 6 | సుగ్రీవునిపట్టాభిషేకము—వర్షాదిఋతువర్ణనము ... | 78-79 |
| 7 | సుగ్రీవునిపై రాము డలిగి లక్ష్మణుంబంపుట ... | 80-81 |
| 8 | రామసుగ్రీవుల సంభాషణము—కాండాంతము ... | 81-82 |


## సుందర కాండము


| | | |
|---|---|---|
| 1 | రామలక్ష్మణులు మధువనమును దర్శించుట ... | 83-84 |
| 2 | వానరులు సీతాన్వేషణార్థమేగుట — హనుమంతునకు రాముడుతనయుంగరమిచ్చుట ... | 84-85 |
| 3 | రాముడు వానరులచే వినాయకుం బూజింపంజేయుట ... | 86-87 |
| 4 | వానరులు సీతను వెదకుచు సముద్ర తీరముజేరుట ... | 88-89 |
| 5 | హనుమంతుడు సముద్రమును దాటి లంకంబ్రవేశించుట | 89-90 |
| 6 | హనుమ, లంకను పరిశోధించి సీతం గనుగొనుట ... | 90-91 |
| 7 | రావణుడు సీతతో సంభాషించుట-హనుమంతుడురావణుంజంపగోరుట | 92-93 |
| 8 | మారుతి సీతతో సంభాషించుట - సీత తన శిరోరత్నం బాన వాలుగా నిడుట ... | 94- 95 |
| 9 | హనుమలంకంగలంచి యక్షయాదులం జంపుట ... | 95- 96 |
| 10 | ఇంద్రజిత్తు హనుమను బంధించి రావణు నెదుటపెట్టుట | 96- |
| 11 | హనుమ రావణునకు హితోక్తులు చెప్పుట-విభీషణుని హితవు | 97- |

12 సీత యగ్నిదేవుని బ్రార్థించుట - లంకాదహనము ... 98-
13 సీతయొద్ద సెలవుగైకొని హనుమద్రాముంగన నేగుట ... 99-
14 రామునకు హనుమంతుడు సీతాన్వేషణ వృత్తాంతము చెప్పుట 100-101
15 రామలక్ష్మణులు సుగ్రీవాదులు సేనాసమేతులై సముద్రతీరము చేరుట - కాండాంతము 102-103


## యుద్ధకాండము


1 రామలక్ష్మణులు సముద్రుని దర్శించుట సేతునిర్మాణము ... 104-105
2 విభీషణుడు రావణునకు హితోపదేశము సేయుట - విభీషణుని నిర్గమనము ... 106-107
3 విభీషణుని శరణాగతి - శుకసారణులు రాము సైన్యమును గూర్చి రావణున కెఱింగించుట ... 108-109
4 వానరులు లంకను ముట్టడించుట - యుద్ధప్రారంభము... 109-110
5 కుంభకర్ణుడు యుద్ధమున కేగుట - ఇంద్రజిత్తుని ప్రథమయుద్ధము 110-111
6 హనుమంతుడు యుద్ధమున మృతులైన వానరులను బ్రతికించుట 112-
7 వానర దానవుల యుద్ధము ... 112-113
8 రాముడు రాక్షసవీరులం దునుమాడుట - రావణుడు విచారించుట 113-114
9 ఇంద్రజిత్తుని 2వ యుద్ధము-రావణుడింద్రజిత్తుకొఱకు విచారించుట 115-116
10 రావణుడు యుద్ధమున కేగుట - రామరావణుల ప్రథమయుద్ధము 117-118
11 రావణుడు విభీషణుని పైశక్తి నేయుట - లక్ష్మణుడు మూర్ఛిల్లుట 118-119
12 రాముడు క్రుద్ధుండై రావణు దఱుముట సంజీవిని లక్ష్మణుండు బ్రతుకుట 119-120
13 రావణుడు మూలబలములతో వెడలి రామునితో యుద్ధము చేయుట 121-
14 నారాయణాస్త్రంబున రావణుని శిరంబులు మరల నుద్భవ మొందమానుట - రావణుని పశ్చాత్తాపము ... 122-123
15 రావణపతనము - దేవతలు రాముని గన నేగుట ... 123-
16 లక్ష్మణుడు విభీషణునికి లంకారాజ్య పట్టాభిషేకము చేయుట- దేవతలు రాముని స్తోత్రము చేయుట ... 124-125
17 సీత చితిం బ్రవేశించి తన పవిత్రతం దెలుపుట - సీతారాములు విమానమున ప్రయాణించుట ... 125-126
18 రాముడు సీతకు దారిలోగల వివిధప్రదేశములం జూపుట 126-128
19 రాముడు భారద్వాజాశ్రమంబునొద్దదిగి హనుమను భరతునొద్దకంపుట 128-129
20 భరతుడు రామాగమనవార్త నయోధ్యాపురవాసుల కెఱింగింప శత్రుఘ్నుం బంపుట 129-
21 నందిగ్రామంబున రాముడు బంధుమిత్రులం గలసికొనుట 129-
22 రాము డయోధ్యాప్రవేశంబు సేయుట ... 130-
23 శ్రీరామపట్టాభిషేకంబు ... 131-
24 శ్రీరామరాజ్యమున ప్రజలు సుఖపడుట ... 132-
25 రాముడు కుశలవులకు రాజ్యంబిచ్చి స్వస్థానంబున కేగుట 133-
ఆశీస్సులు ... 133-
కాండాంతము ... 134-

ఓం శ్రీ సద్గురుస్వామినేనమః

శ్రీ శ్రీ రాధాగోవింద భగవతేనమః

# శ్రీమత్సుందరామాయణము

## బాలకాండము

---

### —* ఇష్టదేవతాప్రార్థనము *—



కర శుభగుణమణిర
త్నాకరు బుధవినుత బహుశు ♦ భాకారధరున్
లోకాధీశ్వరు రిపుహృ
ద్భీకరు నఘదూరుఁబరుని ♦ ప్రేమ నుతింతున్

శ్రీధరణిజా మనోహర !, యోధాంచితసుగుణగణ్య ! ♦ యోగిశరణ్యా !
మాధవ నిను కొనియాడెద, రాధాప్రియ మధురవదన ! ♦ రాజితసదనా!

కరములు మోడ్చి నుతించెద, గరిముఖుదొలిపూజవేల్పు ♦ గాంచనవర్ణున్
గిరికన్యావరతనయుని, సుర నరదనుజాదిభక్త ♦ సుజనస్తుత్యున్ 3

విమలతరభక్తి బొగడెదఁ, గమలోదరు కూర్మిరాణి ♦ ఘనమృదువాణిన్
అమరీకృతసచ్ఛ్రేణిం, భ్రమరీసమనీలవేణిఁ ♦ బంకజపాణిన్ 4

పాణియుగమెత్తి మ్రొక్కెద, వాణీగుందత్త నిఖిల ♦ వాంఛితఫలగీ
ర్వాణీశుభజిత గౌరీ, ప్రాణేశున్నైజ సుకృత ♦ రతలక్ష్మీశున్ 5

వాణిఁదలంచెద వీణా, పాణిన్మృదు మధురవాణిఁ ♦ బద్మజురాణిన్
వేణీజిత మదభృంగ, శ్రేణిం గ్రొమ్మించుబోణి ♦ స్నిగ్ధశ్రోణిన్ 6

శూలిన్మన్మథమదని, హ్మాలిన్ ధృతచర్మ చేలిఁ ♦ బూజితకరుణా
శీలిం బాలిత నిఖిల సు, రాలింగడు సన్నుతింతు ♦ నతిగుణశాలిన్ 7

సతికిన్మ్రొక్కెద శంభుని, సతికిన్మునివినుత సకల ♦ సద్గుణతతికిన్
పతితజనావన మతికిన్ స్తుతిపాత్ర సుకృతికి నవిత ♦ సురసంతతికిన్ 8

## —* మాన్య కవిగురుజనస్తుతి *—

ఆదికవికి వ్యాసునకును, మోదముతోఁ గాళిదాస ♦ ముఖ్యులకెల్లన్
గాదిలిజేజేలిడి సం, పాదించెద వారి కరుణ ♦ మానితకవితన్ 9

మన్నన సేసెద నామది, నెన్నికతో నన్నయాఖ్యు ♦ నెఱ్ఱనమంత్రిన్
సన్నుతుఁదిక్క మనీషిం జెన్నుల గని పోతనార్యు ♦ శ్రీనాథవిభున్ 10

తక్కిన తొల్లిటి సుకవుల, మక్కువతోఁ బూజసేసి ♦ మన్నించిమదిన్
నిక్కువపుభక్తి నతిపెం, పెక్కిన యాధునిక కవుల ♦ నెలమిదలంతున్

డెందమున దలతు యోగా, నంద సుకవి, రాజవోలు ♦ నంబెనుబడినా
కుందెనుగు నోజ్జయై యెదకుందనియగ తెలుఁగుతీపిఁ ♦ గొలిపినగురునిన్

అంతకమున్నటనాకుం, గొంత తెనుగు నుడుల రుచిని ♦ గూర్చినబుధుధీ
మంతు దమ్మప్పశాస్త్రిని, నెంతు న్నా తెనుగునోజ్జ ♦ నెలమిని నెపుడున్

గురునిభు దలతున్ మానస, గురునిన్ కవిసార్వభౌము ♦ గురుకవితావా
గ్వరు శ్రీపదకృష్ణాహ్వాయ,ధరునివ్వరకృష్ణ భారతత ప్రాభవునిన్ 14

ధరసరస చాటుకవితా, గరిముల బహుకావ్యకరణ ♦ ఘనకౌశలులన్
వరతిరుపతి వేంకటకవి, గురుల సుధీవరులఁదలతు ♦ గురుతరభక్తిన్ 15

గురులన్ దలతున్ విద్యా, గురులన్ విజ్ఞానగురుల ♦ గురుకవితావా
గ్ధురులన్ శ్రితపాలన భా, సురులన్ పరతత్వవేది ♦ సూరులవరులన్ 16

వ. మఱియు 17

సుకవిరచనానభిజ్ఞుల, స్వకృతమహాదోషనిధుల ♦ సాహసవిధులన్
కుకవిబుధులనేగోరెద, నకుటిలమతి, నాదు కావ్య ♦ మంటకుడనుచున్

వ. ఇట్లిష్టదేవతారాధనంబును, నాద్యాధునిక కవిసత్తమార్చనం
బును, గురుజనపూజనంబును, కుకవి నిరాసనంబునుం గావించి
మదీయ వంశ వృత్తాంతం బించుక యెఱింగింతు నెట్లనిన. 19

## —* కవి వంశాదికము *—

కలజారువేలవిప్రుల, నిలనాప స్తంబసూత్రు♦డినసమ తేజుం
డలఘుతపోనిధిలింగము, కులజుడు బాపన్నసూరి ♦ గుణమాన్యుండై
బాపబుధాగ్రతనూజుం,డై పుట్టె కుటుంబరాయ ♦ డాత్మ పిత్రుల గా
రాపుసుతుడౌచు, గడు ను,ద్దీపితధీయుతుండునై సు♦ధీతతి మెచ్చన్ 21

వెండియు బాపనగనె కవి, మండల మండనుల విబుధ♦మాన్యసుకవితో
ద్దండులపండితులనుగుణ, మండితులన్ రామనరస♦మహితాహ్వయులన్

వారు ముగురుగోదావరి. చేరువందగుజల్లిసీమ ♦ చెలగెడి ముదునూర్
కోరిక దమకున్నెలవుగ, దారెసగిరి ప్రాంతసీమఁ ♦ దద్దయు కీర్తిన్ 23

ఆమాన్య నరసమంత్రికి, దామిడువురు రామమూర్తి ♦ దగ కామేశా
ఖ్యామానితులాత్మజులై, భూమింగాగఁడొందిరాత్మ ♦ పూత చరితలన్

అందునను రామమూర్తికి, పొందుగ ముచ్చురము మేము♦పుత్రులమందున్
ముందు నృసింహాఖ్యుఁడుజన, వందితుఁడై యొప్పెనంశ ♦ వర్ధనుడగుచున్

అతనికి తమ్ముడనై స, ద్వ్రతతివొగడ వీరభద్ర ♦ విదితాఖ్యుడనై
సతత పరమేశభజనా, యత కౌతుకమతిఁదనర్చు ♦ నట్టిడనాకున్ 26

చినవీరభద్రనామ్ముం, డనిశవిబుధ వినుతుడైన ♦ యనుజన్ముఁడుదా
ననవరత సాధుసుజనా,ర్చనలోలుఁడు కలడొకండు ♦ సద్గుణనిధియై 27

మజ్జనని విమల గుణఖని, సజ్జన సంస్తుత్య చరిత ♦ సాధుసమర్చా
హ్యాజ్జనిత సంప్రమోద న,మజ్జనపరితోషసాధ్వి ♦ మముదాబెనుపన్

చిననాటనె లభియించెను, మనమలరగ రాముకథల ♦ మాటికి వినుటల్
ఘనముగ బాడుటలును స, జ్జనసంగతి రామనామ ♦ సంకీర్తనముల్

అద్దానికితోడు బుధుల, యొద్దన పఠియించుటబ్బె ♦ నోగిపెనుబడులన్
ముద్దులొలుకు తొల్లిటికవి. పద్దియములఁగొంతకొంత ♦ భావంబలరన్

తమపరి నించుక స్వకృషిం, జదివితి భాగవతమాది ♦ సద్గ్రంథములన్
మదినాసక్తి యుదానం, గుదిరెన్ సద్గ్రంథమొందు♦గురుతుగవ్రాయన్

# కథా ప్రారంభము

రామా! నవనీరద సు,శ్యామా! సుగుణైకధామ! ♦ సమ సంగ్రామ
స్థేమా! భూమిసుతాహృ,ద్ధామా! సుకమనీయనామ! ♦ దశరథరామా!

కరుణ నవధరింపుము నే, సరసాభిఁ గూర్చి వినుతా ♦ సజ్జనులలరన్
పరము శుభదము భవార్ణవ,తరణము హృచ్చరిత: భక్తి ♦ తాత్పర్యములన్.

ధర నొప్పెను పూర్వంబొక, పుర మాజను యోధ్యనాగఁ ♦ బూతచరిత్రన్
బొరసి సరయూతటంబునఁ, గరిహయరథసుభటకోటిఁ ♦ గను రమ్యంబై.

మిన్నంటు హర్మ్యపంక్తుల, చెన్నొప్పు చరింత్రు పౌర ♦ శీతాంశుముఖుల్
అన్నగర రాజవీథుల, నెన్నంబను జూడనోము ♦ రెలమిం బౌరుల్. 47

విమల సరయూజలంబుల, నమలోన్నత సౌధరాజి ♦ నటయుపవనులన్
బ్రమదా జనవీక్షణముల, బ్రముదమ్మిడు నప్పురంబు ♦ పాంథులకెపుడున్.

యతులను సాధుల నభ్యా,గతులను నతిథులను భక్తిఁ ♦ గని యర్చనలన్
అతితృప్తులఁగాఁ జేయుదు,రతివలు పురుషులును నగర ♦ మందెవ్వేళన్.

అన్నగరి విప్రవర్యులు, మిన్నలు చదువులను బుధు; ల ♦ మేయభుజబలా
భ్యున్నతులు నృపులు; ధనసం,పన్నులు వైశ్యులును; దైవభక్తులు శూద్రుల్

గురుపితృ నృపభక్తులు, నిజ, తరుణీరక్తులును, వర్ణ ♦ ధర్మాసక్తుల్
పరనిందారిక్తులు, వర, కరుణాయుక్తులును ప్రజలు ♦ గనవచ్చీటన్. 51

పశుధనసమృద్ధి సంచిత, శిశుపోషణబుద్ధి, పంట ♦ చేల ప్రసిద్ధిన్
విశదబహులాభులై శుభ,దశఁ జెలగిరలోభులగుచుఁ ♦ దత్పురజనులున్ 52

అరుదుగనొప్పు నయోధ్యా, పురము సదాచారయుక్త ♦ పూతసుధర్మా
చరణైకనిష్ఠులున్నత, వరకరుణాసక్తులఖిల ♦ వర్ణప్రజలున్ 53

ఆపురము వెలయు నెల్లెడ, గోపురముల, గుహ్యసత్ర♦కోటుల, నెపుడున్
బ్రాపగునుత్సవతతు లెంచ, నాటక జనసాంఘతశాలల♦సరసవినుతులన్

అన్నగరి వేశ్య వాటిక, తెన్నొందగు రసికవరుల♦కెంతయు నవలా
మిన్నలతో బరువంపుం, గన్నులతోఁ గ్రొంజికలికి♦కనుసన్నలతోన్

అప్పట్టణ పణ్యస్థలు, లొప్పును సకలార్థ సంచ♦యోపేతములై
కుప్పలిడి పసిడిరాశము, తెప్పలుగ విలిచెదరు సాజు♦లింపుగఁ బ్రజకున్

ఆపురవరమును నేలిరి, యేపున రఘుకులమునందు♦ వినవంశజులౌ
భూపవరేణ్యులు పలువురు, వ్యాపితసత్కీర్తియుతులు♦ననఘులునందున్

దశరథుఁడను నృపమౌళి కలఁడు, దిశలం దిలకేలు నృపుల♦ధీబలగరిమన్
వశముగొని ధాత్రి నేలెఁ బ్రసిద్ధి. దను తెల్లరుఁ దన్నుఁ బొగడ♦దత్తుత మెఱయన్

ఆవీరనృపతి కన్నిలి, దేవేరులు గలరు ముగురు♦ దీప్తశుభాంగుల్
ధీవిద్యాగుణజనిత య, శోవైభవయుతలు నతులు♦శోభితమతులున్ 59

వ. అందు కౌసల్య పట్టపుదేవియు, కైకేయీ సుమిత్రలు తదీయ
సపత్నీద్వయంబునై యొప్పారుచుండిరంత.

ఆ రాజేంద్రున కెంతయు గూరిమి మదిఁ గూర్చు కుసుమ♦కోమలికై కే
యీరమణియామె కలదుచుఁ, గూరుచునాస్నపవరుండు♦గోష్ఠిల నెపుడున్

నిరుపమ ధనవిభవంబుల, సురుచిరగతి ధరను నేలె♦ సుస్థిర మతితోఁ
గరుణయు ధర్మము నెఱపుచు ధరణీశులు వినుతిసేయ♦దశరథుఁడంతన్

భూతల సురపురమోయను, భాతిగ జూపట్టె సౌఖ్య♦ భాజనమై సా
కేతపురము; ప్రజకయ్యెడ, ఖ్యాతిగ దశరథుఁడు గాఁగ♦గలుముల నెలవై

ఎదగుందరు లేమిం బ్రజ, లెదరాజను సాధుజనుల♦ కించుక యేనిన్
గదురవు జగడములిండ్లం, గదియవు మారీకములును♦ గనఁ జోరుల

లంచములు గొనెడువారలు, వంచకులగువారు లేరు♦ నలిత్రాసక్తుల్
ఇంచుకయుం గనరారిల, నంచిత భుజశక్తి దశర♦థాధిపుఁ డేలన్ 65

ధర్మరతులగుచు బ్రజలు, కర్మంబులఁదగిలి నడువఁ ♦ గాలగతియుఁ దా
నిర్మలత నడచు నత్తఱి, కూర్మిలి సన్మౌళి వెలుఁగు ♦ నవ్విభు భూమిన్ 66
కొఱగానరాదు బలములఁ, గొఱలేదల భాగ్యమందుఁ ♦ గోటలయందున్
గొఱలేదు; సుతులు లేరను, కొఱ యొక్కటె తక్క నృపునకుం ♦ భువి నెందున్

వ. అట్లు సంతానంబు కొఱంతంబునం దంత చింతాక్రాంత స్వాంతుం
డైన భూకాంతుం డేకాంతంబునం జింతించుచు.

"తొలు బాముల నేఁ జేసిన, కలుషం బెట్టిదియొ సుతులు ♦ గలుగరు నాకున్
గులముద్ధరించువారీ, యిల నేలగ నేర్చువారు ♦ నెవ్వరొ, యింకన్ 69
"పూలొందవని తీవను ఫల, జాలముగన రాని తరువు ♦ జాబిల్లి గనం
జాలని రేయింబోలదె, చాలగనన పత్యగృహము ♦ జననింద్యంబై 70

చిడిముడి యడుగుల నిడుచును,
బడిబడి నోడువుచును నగుచు ♦ పడి మగుడవడిన్
బుడిబుడి నడకల నడచెడి
బుడుతలుగల యదియె యిల్లు ♦ పుడమిని నెందున్ 71

కొమరుం బ్రాయపు సుగుణులు
కొమరులు గట్టెదుటఁ దిరుగఁ ♦ గోరికఁ గనునా
కొమరాలి భాగ్యమది యను
పమమాగద యరయ వంశ ♦ పావనమగుటన్ 72

బందుగు లెందరుగలిగిన, యిందుముఖులు కాంతలింట ♦ నెందరొ యున్నన్
సందడియబ్బు నెనయగుణసుందరులగు సుతులు లేక ♦ సారిది గృహమునన్

సుతులు నిజపితృహితార్థులు
సతిభర్తృ మనోనుకూల ♦ సహజన్ములుఁ దా
రతి వినతులాత్మహితులును
క్షితిఁగల్గుదు రరయ పూర్వ ♦ కృత పుణ్యులకున్ 74

వ. అని యన్నరేంద్రుండు బిట్టు వగచుచున్నంత నొక్కనాఁడు. 75

శిష్టుండగు కులమునైన న, విష్ణుకుఁ డాఁ దెలుప ప్రభుఁడు చేయుదలంచెన్
ఇష్టులఁ గూడుక సుతకా, మేష్టిం ద్విజపుష్టిమెడి♦విశ్వోత్కృష్టిన్ 76

వ. అట్లు సత్సంతాన కాంక్షితుండైన యన్నరేంద్రుండు పుత్రకామేష్టిం
జేయువాఁడై. 77

రావించె నెల్లబంధుల, గావించె మఖార్హ నిఖిల ♦ కార్యంబుల సం
భావించె గురుబుధాళిన్, సేవించెన్ మునుల ద్విజులఁ ♦ జిరతరభక్తిన్ 78

ఇయ్యజ్ఞమునకుఁ బంగల, యయ్యనఘుం డృష్యశృంగుడనవినియతనిన్
జయ్యనఁగొని తేఁ బనిచెను, ఒయ్యారి మిటారి చెలుల♦నుర్వీశుండున్ 79

వారుంజని గని రావన, చారినినతిలోక బ్రహ్మ ♦ చారిన్ లోకా
చారానభిజ్ఞు సుతప, స్సారునినాఋష్యశృంగు ♦ సజ్జనసంగున్ 80

కని యాతని నెవ్విధమున, గొని తేనొ యంచు దలచి ♦ కుసుమాంగులున
వ్వనినిల్చి యతని పరిచయ, మునుగోరి చరించి రెంతొ ♦ ముదముగ నంతన్

ఒక్కతె పాడును మృదుగతి, నొక్కతె సయ్యాటలాడు♦నొర్తునటించున్
ఒక్కతె కమాల లిడు వే, ఱొక్కతియందించు ఫలము♦లొప్పుగ మునికిన్

గానముల మధుర ఫలరస, దానములన్ మృదువచోవి ♦ తానమ్ముల స
న్మానములనలరి ముని యభి, మానమ్ముల రార నరిగె♦ మగువలు బిలువన్ 83

వ. అట్లు సనుదెంచిన ప్రభు కార్యాచరణ ధురీణలగు నన్నెలజాణలు
దూరీకృత దుస్సంగు నాఋష్యశృంగుం గొనివచ్చి దశరథన్ప
పాలునకుం జూపిన నన్నృపమణియు నమ్మునిజనాగ్రణిం బూజించి
తత్సహాయంబున 84

నెఱవేర్చె నృపతి జన్నము, పరమముదంబెసఁగఁ బుడమి♦ప్రజలలరం భూ
సుర గురుముని పూజనముల, సురలలరగ నిఖిలదాన♦శోభ చెలంగన్

అంతట కలిగిరి విభునకు, సంతస మొప్పార మనము ♦ శాంతినిబొందన్
కంతుసమచారు విగ్రహు, లెంతయు భాసుర శరీరు♦లిందునిభాస్యుల్ 86

వారలలో కౌసల్య కు, మారుడు నిజరూప విజిత♦మారుడు ప్రావృ
ణ్ణీరద దేహుడునతిసుకు, మారుడునై వెలయు లోక♦మాన్యుండగుచున్

ఆతడభిరామ తేజుడు, పూతశుభాంగుండు నగుచు ♦ పుణ్యులకెల్లన్
చేతోమోద మొసంగుచు, నాతతశుభదుండునగుచు♦నలరారు నెడన్ 88

మునులుం భూసురులాతని, గని రాముండనుచు నామ♦కరణము సేయన్
జను లమితానందంబుం, గనిరనిశము రామనామ ♦ కలనిస్వనులై 89

వ. కైకకు భరతుండును, సుమిత్రకు లక్ష్మణ శత్రుఘ్నులను నిద్వరు
సుతులును జనించి నిజాగ్రజు నెంతయుం బోలుచు బాలార్క
తేజోవిరాజితులై యుంటయు, 90

బాలశశిగన్న కాంతి వి, శాలాపరదిశయుబోలె ♦ జనపతి గృహమున్
జాలనభిరామమయ్యెను, బాలురదై వాంశభవులు♦ ప్రబలుటకతనన్ 91

గ్రాలెభువిపాపదూరతఁ, దేలె వనులు హృష్టమాని ♦ దివ్యార్చనలన్
సోలెనసుర తేజంబులు, దూలె దురాచారపరుల♦ దుర్వృత్తములున్ 92

ఇలసస్య సమృద్ధింగనె, వెలసె వనులు కుసుమఫలసు♦విలసితములునై
యలరెంబ్రజ సౌఖ్యస్థితి, నలఘుమహిములాకుమారు♦లభ్యుదితులుగాన్

వ. అంత కౌసల్యాదేవియు తన ముద్దుకొమరు నుద్దేశించి 94

రామా! కోమలమేఘ, శ్యామా! సుమనోజ్ఞనామ! ♦ సద్గుణధామా!
రామాజనకామా! రఘు, రామా! లావణ్యసీమ! ♦ రాజలలామా! 95

వ. అనుచు నోరార బిలచుచు ముద్దుగొనుచుండు మఱియును 96

తల్లులుముగురునుతమతమ, యుల్లంబులసంతులవలనియుత్సాహములన్
పెల్లుగ నానందించుచు, నెల్లప్పుడు వీడనొల్ల♦రెంతయు వారిన్ 97

వ. మఱియు ననసామాన్య భాగ్యవతులగు సజ్జననుతల్లు లుల్లంబుల వెల్లివిఱియు ప్రేమాతిరేకంబుల లోకపూజ్య మహాతేజులగు నిజ తనూజులఁగని 98

నాచిట్టితండ్రి రారా! నాచిన్ని వరాలమూట! నావరఫలమా!
నాచిన్నియన్న రారా! నాచక్కనిచుక్క రార! ♦ నాముద్దులయా! 99

అనుచుఁదళ్తమైన కూరిమిఁగనుచుమఱియు నెత్తికొనుచు♦గ్గై సేయుచుఁబోడిన్
ఉనుచుచు పెనుచుచునుండిరి, తనయులనా రాజసతులు♦దద్దయుకూర్మిన్

వ. మఱియు నట్లనుపమాన మాతృప్రేమలాలితులగు నన్నృపాలబాల కులు లీలాలోలుపులగుచు సంప్రాప్త బాల్యోద్దీపితులగుచు 101

ఆటలకుఁబిలతు రెంతయు,గాటపుస్నేహమున చెలిమి♦కాండ్రనుఁదగబూ
దోటలగూడగ బాడగ, గూటువలుగ దిడుగ రాజ♦కుంజరు తనయుల్

ఓడింత్రు సఖులనాటల, తాడింతురు విహగతతులఁ ♦ దలిదండ్రులకున్
జోడింత్రు చిన్నిచేతుల. క్రీడింతురు వీరులట్లు ♦ కేళీగతులన్ 103

పేదలగనినం గరుణయు, సాదరహర్షములు సాధు♦సద్ద్విజులనినన్
మోదము పెద్దలయంపు ని,రాదరణము ధూర్తులన నృ♦పాత్మజుల కెదన్

ఈలీల పూర్ణ మోద, శ్రీలందనరారు సుతుల ♦ శ్రేయోయుతులా
బాలురఁగని తాదశరథు, డేలోటును లేక భూమి♦నేలుచునుండెన్ 105

వ. మఱియు నిజాత్మజులు దినదిన ప్రవర్ధమాన రూపరేఖావిలాసులై విద్యాభ్యాసయోగ్య వయోదశం బ్రాపించి చూపఱకమితానంద సంధాయకులగుచునుండుటయు 106

నృపవరుడుకూర్మితనయుల, కుపనయన ప్రముఖవిధుల♦నొనరిచిదయతో
నుపదేశంబొసగుడు నే,డుప్పుమెయినని బనిచె సద్గు♦రుని సన్నిధికిన్.

వ. అట్లు పంపంబడి 108

అమితముదమునం జని రా, కొమరులు నల్వురను గూడి ♦ గుర్వాశ్రమమం
దమలచరిత వసియింపుచు, క్రమమున సత్కళల నెల్ల ♦ గఱచిరి నేర్మిన్ 109

అనుపమకుశాగ్రధీయుతు, లినకులనృపసుతులు నేర్చి ♦ రెంతయు శ్రద్ధన్
వినుతనిగమపుంజంబును, ఘనశాస్త్రార్థముల గళల ♦ గను ధీయుతులై 110

నరనాథ సుతులు నేర్చిరి, కరమరుదుగఁ నస్త్రశస్త్రఘనులై పుణులన్
కరితురగాద్యారోహణ, లరదముగడపుటల నెల్ల నతి నిపుణతతో 111

వ. ఇట్లు నేర్చి మఱియు నా రాకుమారు లనన్య సామాన్య సహజ సాహస గంభీర ధీరోదార నిజస్వభావ తేజోపశీకృతసర్వభూత చేతస్కులగుచుం దత్పురవాసు లబ్బాలచంద్రులం గని ప్రీతమనస్కులుం బ్రేమపూరితవచస్కులునగుచు నన్యోన్యాలాపంబుల 112

బాలురు పరిశుద్ధ దయా, శీలురు నిజరూపపర వ ♦ శీకృత సుమనో
జాలురు భావిన యోధ్యా, పాలురకనుగొనుడి రాచ ♦ పాపల వీరిన్ 113

దక్షులు ప్రీతముముక్షును, లక్షీణనతార్త పక్షు ♦ లంచితవక్షుల్
శిక్షిత ఘోరవిపక్షులు, వీక్షింపరె వీరిమీరు ♦ వికచాక్షులరై 114

అని పౌరులెల్లరుం దమ,
మనముల జనియించినట్టి ♦ మహితానందం
బున బొగడుచు మరి చూచుచు,
దనివొందిరి తమదు కనులు ♦ ధన్యతనొందన్ 115

వ. మఱియు నత్తరి 116

భూపతితనయులు కరమున, మీాపించినయావ్వనముల ♦ మీరుచు నేర్పుం
జూపగడంగిరి యన్నిట, భూపతులలరంగ దండ్రి ♦ ముదమున బొంగన్

అంతనిటు కొంతకాలము, సంతోషముతోడ సర్వ ♦ జనవినుతంబౌ
సంతతిఁగని దశరథుఁడు, కాంతుఁడు దా మెఱయుచుండె ♦ ఘనగౌరవుఁడై 118

వ. అట్టిచో నొక్కనాఁడా పుడమితేఁడు పేరోలగంబున నున్నయెడ 119

జడలు పులితోలుబూదియు, నొడలనురాజిల్ల సరభ♦సోన్నతగతినా
యొడ యని కడకేతెంచెను, కడువడి కౌశికుడుదన్నుఁ♦గని ప్రజలలరన్

వచ్చిన పొడగని వినయం, బచ్చుపడగ మ్రొక్కి నృపతి♦యమ్మౌనికిఁదా
నిచ్చెందగు పీఠంబును, చెచ్చెరఁ బొరయింత లేని♦ సేవనములతో 121

వ. అట్లు పూజించి మ్రొక్కినంగని యమ్మునీశ్వరుండును 122

కుశలంబె నీకు దశరథ, భృశముగ నీబంధుమిత్ర ♦ భృత్యాదులకున్
వశముదొలంగక యుందురె, దిశలన్ సామంతులెల్ల♦ ధీయుతనీకున్ 123

నావుడునరపతి యిట్లనె, పావనమయ్యెను మదీయ♦భవనము భవమున్
దేవా! దేవర రాకను, నేవిధమున లోటుగాన♦మిలమీకరుణన్ 124

వ. అని మఱియు 125

ఊరక రారు మహాత్ములు, సారతపోధనులు నిత్య♦సదమల చరితుల్
ధీరులునాశ్రితసుజనో, ద్ధారులుమిముబోటిపరమ♦ధార్మికులెందున్ 126

స్వామీ! మీవచ్చినపని, యేమియొ చెపుడిపుడ చేతు♦నెలమిననుడున్
నామౌనీంద్రుండనియెను, భూమీశునకఖిలరాజ♦ ముఖ్యేశునకున్ 127

వనిమే మొనర్చుజన్నము, దనుజులెపుడుఁ జెఱచుచుంటఁ♦ దద్రక్షకు రా
ముని సౌమిత్రినిగొనిపోఁ,జనుదెంచితిమిపుడు మేము♦జనవరవినుమా 128

నావిని నమ్మునినుడులకు, భావంబునదత్తరిల్లి♦పార్థివుడనియెన్
ఏవిధి రాముని లక్ష్మణు, నావనికనుపంగ నేర్తు♦ నర్భకులుగదా 129

నడువగలరె ఘోరాటవి, గుడువగలరె కందమూల♦ గురుభోజనమున్
బొడువగలరె దనుజులనని,బుడుతలనడిగెదు మునీంద్ర♦పొరగవనికిన్ 130

ఆరక్కసులన్నంగడు, క్రూరులు మాయావులమిత ♦ ఘోరాకారుల్
వారేడమత్కుమారకి,శోరులు వీరేడ పోరు ♦ చొప్పడునెయిటుల్ 131

బహుకాలమునకు గల్గిరి, యిహపరసాధకులుకొమరు♦లీ నల్వురు నో
మహనీయ వీరి విడువగ, తహతహ జెందెడిని మనము ♦ తద్దయుభీతిన్

అటుగావున మునివర విను, పటుకాయుల వీరవరుల ♦ బలగము నిత్తున్
అటు కాదయేని వత్తును, చటుకున సబలుండ నేనె ♦ జన్నముగావన్ 133

అను నానరేంద్రునకు న,మ్ముని చంద్రుం డిట్టులనియె ♦ మునుకొను కినుకన్
విను రాజ భవద్వంశ్యులు, మును బలుకరు నీదు చంద ♦ మున నొకరైనన్ 134

నీకొమరులర్భకులయని, వాకొంటివి తెలియవింత ♦ వారి మహిమమున్
లోకారాధ్యగుణులు జగ, దేక పరాక్రములు వారి ♦ నెన్న గఁదరమే 135

ఆడిననుడి మీరరు విడ,నాడరు సంశ్రితుల హితుల, ♦ నాలంబున బో
వీడరరిగణము దుష్టుల,గూడరు రాజేంద్ర నీదు ♦ కొమరులు గంటే 136

నరమాత్రులుగారో నృప, పరమాత్మాంశజులు వీరు ♦ భవ్యులు ప్రాజ్ఞుల్
నరలోకోద్ధరణార్థము, పరమసుకృతి వౌట నీకు ♦ బ్రభవించిరిలన్ 137

నీకార్యమొనర్చెదనని, వాకిడి యద్దాని నిలుప ♦ వలదా కో నీవున్
నీకొమరుల తేజమ్మును, లోకమ్మెఱుగంగవలదా ♦ లోనెంచు నృపా 138

వరహితుడనంచు నాపై, గురుభావము గల్గు నేని ♦ గురుతుగ సుతులన్
కరమనుమానింపక స, త్వర మంపుమ లేదయేని ♦ దలగెదుఁ జెపుమా 139

నావుడు నమ్మునివరునకు, భూవిభుడెదురాడనోడి ♦ పూనిక సుతులన్
రావింప భటుని బంపెను, నావిభుగని మెచ్చె మౌని ♦ యలరుచు నంతన్ 140

రాముడు సవినయ సుగుణో, ద్దాముడు నిజజనకునాజ్ఞ ♦ దలదాల్చి వడిన్
సౌమిత్రి గూడి వైశమ, భూమీశుం జేరవచ్చె ♦ భూరిముదమునన్ 141

వ. అట్లు వచ్చి యాకుమారతిలకులును 142

జనకునకు మ్రొక్కి మునివరు; ఘనపదముల కెఱగి సభను గల ♦ పెద్దలకున్
వినతులగుచు నెల్లరకును, కనుపండువు చేయు చపుడు ♦ కనుపట్టు నెడన్

ఆరామలక్ష్మణుల నతి, ధీరుల దరహాసరమ్య ♦ దీప్తాననులన్
గారాముననగని దశరథ, భూరమణుండిట్టులనియె ♦ ముదమెదఁబొదలన్ 144

ఓబిడ్డలార వినుడిక, ధీబలసంపన్నులగుచు ♦ దిట వెసగంగా
నీబహుళ తపోధనమణి, కిం బాసటయగుచు గొల్చి♦కీర్తింగనుడీ 145

ఇమ్మౌనిని కర్పించితి, నెమ్మి నితడు చెప్పుపనుల ♦ నేర్పొప్పంగా
సమ్మతినొనర్చిబడయుం, డిమ్మునివరుదయను♦దాన నెంతయు మేలౌ 146

మీకితడె తండ్రిదల్లియు, మీకీయన ఘుం,డ విభుడు♦మేటిగురుండున్
మీకింక సర్వరక్షకు, డీ కౌశికమునివరేణ్యు♦డెఱుగుడు గానన్ 147

వ. మీరిమ్మహాత్ముని సవన రక్షాచరణంబున కృతకృత్యులరై
క్షేమమ్మున చనుదెంతేదగాక యని వారినామునీంద్రున కప్ప
గించిన మునియుం దన పాదంబులకు సాష్టాంగ దండప్రణామంబు
లాచరించు నా రాచబాలురంగని దీవించి 148

అమితానందంబున సం, యమి వారిందోడికొనుచు ♦ నరిగెను కడుసం
భ్రమమున జన్నము సేతకు, కమనీయసుమాభిరామ♦కాంతారములన్

వ. మఱియు నయ్యెడ 150

ఆరామలక్ష్మణులు జని, రారూఢిగ కడిదివిల్లు ♦ నమ్ములు గొనుచున్
సారోత్సాహము లెసగగ, భూరిగతిన్ సవనరక్ష♦పూనియొనర్పన్ 151

అమ్మార్గమందు దెలిపెను, నమ్మౌని మహాస్త్రవిద్య ♦ లన్నిటివారున్
సమ్మదమున నేర్చిరి గని, యమ్మౌనీశ్వరుడునలరె ♦నవ్వారలకున్ 152

వ. అనంతరం బమ్మునివరుం డక్కుమారశేఖరుల కొడలిబడలిక లడంచి
యాకలిదప్పులందప్పింపంజాలిన "బలాతిబల"లను విద్యల నేర్పి
ముమ్మరంబగు నెమ్మిం గొని చనుచుండుటయు 153

అటగాంచిరి తాటక ను,త్కటభీషణ దీర్ఘ బాహు♦కాఠిన్యమహా
చటులగతివిజితఘోటక, నటనాచాతుర్య రచిత♦నవనాటకనున్ 154

కని చకితాత్ముండై యా,ముని పిరిదికి నేగి రామ♦మునుకొని కోలన్
గొని తాటకిగూలుచుమని, పని చెంగుణధాము రాము♦ఖండనభీమున్ 155

వ. అంత నా రామచంద్రుండును ధీరతాసాంద్రుండై 156

కూలిచె తాటకి నొకనిషు,కోలన్ మునులలర తీవ్ర ♦ కోపంబున నా
భీలన్ ఘనవేలన్ సు,శ్రీలన్ వనపాలకరుజ ♦ సేవితలీలన్ 157

వ. అట్లు తాటకిం గీటడంచి ముని సంఘ్యు వెనువెంటం జనుదెంచుచు కతిపయప్రయాణంబుల శ్రీరామ సౌమిత్రుల క్రమంబుగ విశ్వామిత్రాశ్రమంబు సేరి రంత, 158

మునివర్యుడు పిలిపించెను, మునులెల్లర తనదు యజ్ఞ ♦ మును వీక్షింపన్
గొనకొని సర్వార్థంబుల, నొనగూరి చెకపిడి పూన్కి ♦ నురుకుతుకుండై 159

వ. ఇట్లధ్వరంబు సేయువాడై కౌశికుండు రామలక్ష్మణులం జీరి తద్రక్షణభారంబు వారిపై నిడి యజ్ఞదీక్షం గైకొనియె నంత 160

వినువీధి దోచిరయ్యెడ, దనుజులు చెలరేగి యమిత ♦ దర్పంబునన
మ్మునివరుడు సేయుజన్నము, బనివడి చెఱుపంగ దలచి ♦ పరికరయుతులై

వారలగని యారఘుకుల, వీరులు విల్లంది పవన ♦ వేగముగలవౌ
నారాచంబుల దొడగిరి, ఘోరాజిని రక్కసులను ♦ గూల్పగ గడిమిన్

అంతంగని రెట్టించిన, పంతంబుల దనుజులెల్ల ♦ బలయుతగతులై
గంతులగొనిరి భూమికి నిసు,మంతయు దయలేక మునుల ♦ యాగము జెఱుపన్

వ. ఇట్లు స్తోకంబగు నీకన్ మూకలై రాకాసులు నాకౌకసులడలం గగ్గోలు వెట్టుచుం, దమ నాయకులగు మారీచ సుబాహులు ప్రేరేచినం బెచ్చు పెఱిగిన హెచ్చరికం జెచ్చెర మచ్చరంబున యజ్ఞశాల దెస మూగిన వారి దురుద్యోగంబుం గని 164

కోచవడక వింటను నా, రాచము సంధించి యేసె ♦ రాఘవుడల మా
రీచున్ రాత్రిం చరకుల, నీచున్ పటుకపట దేహు ♦ నిర్గతరోచున్ 165

వ. ఇట్లేసిన న్వేటువడియు నన్నిశాటుండు గీటడంగక గోటమీటిన వంటియుండ మాడ్కిం జని మున్నీటం బడిన రామచంద్రుండును సాంద్రప్రతాపుండై 166

ఆహవవిదుఁడై దివిజుల, మూహము దనుమెచ్చ వాడి♦ములుకులనలుకన్
దేహముఁబాపెనుకలనసుబాహుఁ బహుదీర్ఘబాహు♦బటుతర దేహున్

ఇక్కరణి దమమునాయకు, లుక్కరిభువిపడుటఁగాంచి ♦యురుతరభీతిన్
రక్కసులు పఱచిరెల్లరు, నొక్కటజన్నంబు విడిచి♦యుగ్రాటవికిన్ 168

వ. తదనంతరంబున విశ్వామిత్రుండును యజ్ఞంబు నిర్విఘ్నంబుగా నిర్వర్తించి సఫలీకృత చిరమనోరథుండై నిజాంతర్గతంబున సంతసిల్లి కృతజ్ఞతాపాత్రులైన రామసౌమిత్రులంగని "యయ్యలారా మీకారణంబున నామఖంబు సుఖంబుగ నెరవేర్పంబడిమె నెంతయు సంతసించితి" నావు "డియ్యదియంతయు భవత్కృపా విశేష ప్రభావంబుకతనగాదె" యని 169

దండముబెట్టిరి రఘుకుల, మండనులత్యంతభక్తి ♦ మౌనికివరకో
దండయుతులు నతగాత్రులు, ఖండితసర్వాఘులగుచు ♦ గడువెసనంతన్

మది మెచ్చివారిగనిముని, సదయతనిట్లనియె"రామ♦చయ్యనమనమా
విదితయశుడైనజనకుని,ముదమునగననతనినగర♦మునకేగుదమే"171

అనవల్లెయంచు వారా, ముని వెంటను జనిరివేడ్క♦ మునుకొనవారిన్
గనిమునియు నిట్టులనె దు,న్మనములు సంతోషవార్ధి♦మగ్నంబులుగాన్

మిథిలేశుండగు జనకుడు, ప్రథితంబగు రాజనీతిఁ ♦ బ్రజఁ బాలింపన్
శిథిలంబులుగావెయ్యెడ, పృథులాశ్రమవర్ణవిధులు♦పెనుపగుశుభముల్

వ. మఱియుకాలానుగతంబులై కర్షకజనహర్షదాయకంబులైనవర్షంబులు గుఱియ పాడిపంటల సమృద్ధిమై యిలకు వసుంధరా ప్రసిద్ధి సుప్రసిద్ధంబుగా ప్రజలనామయ సుఖస్థితిని సంతసింప న్యాయంబు బాయక సజ్జన శ్లేఘ్యమానుండై జనకుండు సర్వజనానంద జనకుండగుచు ప్రజల నేలుచుండునని మఱియు 174

వినురామచంద్రజనకుం, డనుపమవిఖ్యాతయశుడు♦వనఘుడుమునుతా
తనయులకొఱకై జన్నం,బును జేయగబూని యొక్క♦భూభాగమునన్

దున్నింపుచున్ననొక్కెడ, కన్నులకింపైన దేహ♦కాంతులుదనుకన్
బున్నమచందురుఁ గేరెడి, కన్నియనొకమందసమున♦గనుగొనియంతన్
ఆకన్నియ గొనివైశమ చేకొని ముద్దాడి వేడ్క ♦ చెలగుచు నతఁడున్
ఆకొన్న వానికమృతము, చేకూరిన భంగినంత ♦ సింపుచు నేగెన్ 177

వ. అట్లా బాలారత్నంబుంగొని చని నిజ సతీమణికింజూపిన, 178

అలలనామణియుంగడు,లాలితమై యలరు బాల ♦ లక్షణములకున్
లోలోన మెచ్చుచుననా, బాలికఁదాఁబెంచెకన్న ♦ బాలికవోలె 179

వ. మఱియు నబ్బాలిక. భూజననంబునంజేసి భూజాతయనియు, నాగేటి చాలునలభియించుటంజేసి సీతయనియు మిథిలాధీశు తనయగావున మైథిలియనియు, విదేహరాజ పుత్రికగావున వైదేహి యనియు, జనకనృపాత్మజగావున జానకియు నా పెక్కు నామంబులం బిలువంబడుచు నలరారుచుండునంత; క్రమంబున 180

నవ్వులు వెన్నలగేరెను, క్రొవ్విరులన గంధమనిసఁ ♦ గోరిక హెచ్చెన్
నివ్వటిలెనంగ కాంతులు, జవ్వన మొగి నంకురింప♦జానకి కంతన్ 181

వాలుకనులేలుదమ్ముల, మేలిమిబంగారుచాయ ♦ మెచ్చదుమెయి ము
త్యాలపసగేరుపలుచాల్, బాలామణివేణి యళుల ♦ బారులఁదోలున్

అబ్బాల నెన్నడల సాబ ,గబ్బాలిక నుడులతీరు ♦ నాయమగొనముల్
అబ్బురముగాదె గన సుర, బిబ్బోకవతీవిలాస ♦ పృథుగతులందున్ 183

వ. అనుచు నవనిజంగని యామె సఖీజనంబులు వల్కుచుండు రట్లు వైదేహి రూపయావ్వనసంపదలం బొంపిరివోవుచు వివాహయో గ్యదశం బ్రాపించుటయు 184

సీతా స్వయంవరంబును, చేతోమోదంబెసంగ ♦ చేయదలచి దా
నాతరిచారులఁ బంపెను, భూతలనృపసుతుల బిలువ♦బూని జనకుడున్

వ. మఱియు నొక్క విశేషంబు సెప్పెద వినుం డమ్మిథిలాధీశు నింటఁ
దడవులంబట్టి యొక్క చాపంబు ధరాధరసమభారం బైన యది
గల దద్దానిం ద్రిపురాంతకుండైన శివుండు దనుజ సంహారణానంత
రంబ జనకునొద్దడించిచనియె నంత నొక్కనాడు జానకియుఁ దోడి
బాలికలతోడంగూడి యాడుచు నద్దాని నవలీలనెత్తి వేరొండు
చోటం బెట్టుటయుఁ గని చెలికత్తియ లా యుదంతంబు జనకు
నకెఱింగించిన నాటఁగోలె నతండును, 186

రాజన్యుఁ డెవ్వఁ డీవిలు, తేజమెసఁగ నెక్కువెట్టు ♦ దిరముగ నతఁడీ
రాజిత కోమలగాత్రిని, భూజాతను బెండ్లియాడఁ♦బోలునటంచున్ 187

వ. నిశ్చయించి యిప్పుడు తదీయ స్వయంవరంబును చాటంబంచు
టయు నేతన్మహోత్సవమునకు మనమును నాహూతులమై యేగు
చున్నవారము, 188

అని సీతావృత్తాంతము, ముని సెప్పగ హర్షజలధి♦మునుగుచు రాముం
డును సౌమిత్రియు గడువడి, జనుచుండిరి మిథిలకపుడు♦సంయమి వెంటన్
చనిచని కనుగొనిరటనా, యనఘులు కడునలరిఖగమృ♦గావళికృతని
స్వనరమ్యవనస్థలినొక, మునివరు నాశ్రమము పుణ్య♦మునిసేవితమున్

వ. అట్లాయాశ్రమోపాంత కాంతారముందరిసి చనుచో 191

అచ్చోటి వనమనోజ్ఞత, లచ్చోగల మృగవిహంగ ♦ మాళుల సౌరు
న్నచ్చో నెలకొను శాంతియు, నచ్చుగ గన్గొంచు రాము♦డనె మునివరుతో

ఏమానివర్యునాశ్రమ, మీామహిత విశాలభూమి ♦ యిట్లు విజనమై
యేమిటనున్నది చెప్పుడన, నామానివరేణ్యుడనియె ♦ నారామునకున్

వినురామచంద్ర గౌతము, డను మునినిజభార్యయగు న♦హల్యాసతితో
ననుపమగతినిటఁ దపముం, బొనరింపుచునుండువాడు♦భూరి మహిముడై

ఆతనిసతి వనితామణిఁ, బూతచరిత సురుచిరాంగిఁ ♦ బూర్ణేందుముఖిన్
చేతోభవాస్త్ర పీడితు,డై తొలి నంచించె నిచట♦నమరాధిపుడున్ 195

అది యెఱిఁగి మునియుకిన్కఁ, ద్రిదశేంద్రుఁ శపించి నిజస♦తింగనియతిఁబె
ట్టిదమైన శాపమిడెనో, పదవతిశిలవగుచునిచట ♦ బ్రగ్గుమయనుచున్

వ. అట్లయ్యిరువురకును శాపంబిడి యచ్చోటువాసి చనఁ జూచుచున్న
నిజనాథుని పదంబులంబడి శాపభీతయైన యహల్యయు తచ్ఛాప
విమోచనోపాయం బెఱింగింపుడని వేఁడిన నాతండును "ఏనాఁడు
దేవదేవుండగు శ్రీరామచంద్రు శ్రీపాదారవిందరజంబు నీపయిసోఁకు,
నప్పుడ నీకు నిజరూపంబగు ననినుడివి యచ్చోటుఁవాసి చనియెనని
కౌశికుండు నుడువుచు నొక్క శిలావృతమార్గంబుఁ బట్టి చను
చుండు నెడ 197

శ్యామలశిరీషసుమదళ, కోమల సర్వాఘహరణ ♦ గుణమాన్య శ్రీ
రామపదకంజయుగమతి, కోమలగతిదాకె నొక్క ♦ గుండ్రాతికటన్ 198

అటుతాకిన నయ్యుపలం, బటునీటునై పదనుకెక్కి ♦ యతి చటులగతిన్
పటువొందిప్రాణయుతయై, తటుకున నొకసుదతియగుచు ♦ దనరారు నెడన్

ఆశ్రామంగని యరుదుగ, శ్రీరాముడుచూచుచున్న ♦ శీఘ్రమకని దా
నారాజమునియు దెలిపెను, నారాజితగాత్రియే య♦హల్యయటంచున్

వ. అట్లు పరాత్పరుండయ్యును మాయామానుష విగ్రహుండయిన
రామభగవానుండు కౌశికునివలన నయ్యహల్యా వృత్తాంతంబం
తయు నెఱింగి యామెంగనుచున్నంత 201

ప్రక్కకొదిగి కేల్మోడిచి, యక్కోమలి కడిదిభక్తి ♦ నత్యాతురతన్
గ్రక్కునదొరఁగెడి బాష్పము, లక్కునబడ రామునిట్టు ♦ లభినుతి సేసెన్

## —* అహల్యాస్తోత్రము *—

కందాష్టకము :

శ్రీరాజిత! మునిపూజిత! శూరాజితరణవిహార! ♦ శోభిత వనసం
చారా! జిత మారా! సుకు, మారా! జోహారు రామ♦మన్నింపుమయా!

రామాజనకామా! నుత, నామా! వరసుగుణజనిత ♦ నవ్యసమంచ
ద్భామా!రణభీమా!శుభధామా!రఘురామ!నన్నుదయచూడుమయా

ధృతచాపా! యతరోపా! జితకోపా! సత్ప్రతాప! చిరకరుణాసం
శ్రితరూపా! జిత పాపా! తతతాపాహరణ! నన్ను ♦ దయనేలుమయా!

హితతారణ! శృతికారణ! భృతచరణ! సిద్ధసాధ్య ♦ బృందారక వం
దితచరణా! సువితరణా! తతచరణా జ్ఞాతనన్ను ♦ దరిచేర్పుమయా

శ్రీరమణా! ధీరగుణా! ఘోరరణాభీల నిశిత ♦ క్రూరాస్త్ర మహా
మారణ! లయకారణ! భవ, తారణ! రఘురామ నీకు♦దండంబులయా

ఈశా! రిపునాశా! సుని, వేశా! నిజ దివ్యతేజ ♦ విచలితదనుజా
ధీశా! మృదుకేశా! భవ, పాశాహిత! రామ నన్ను♦పాలింపుమయా

పావన! సుజనావన! సమ, భావన! కరుణాకటాక్ష! పరితోషితనం
సేవక! భవపావక! ఘన, తావక చరణాబ్జసేవ! దయసేయుమయా! 209

శీలవరా! కాలశరా! లోల నిజాశేషభక్త ♦ లోకావనస
ల్లీలా! మృదుచేలా! భవవేలాతరణంబుదారి ♦ వేజూపుమయా 210

వ. అనియిట్లు పెక్కు భంగుల సంస్తుతించుచున్న నయ్యహల్యయెడం
గరుణించి సాదరవచనుండై రఘువరుండాయమను యథా
పూర్వంబుగ భర్తకడకుం బోననుజ్ఞయిడి తదనంతరంబ 211

భూతనయా చరితశృతి, జాతప్రముదమునజనిరి ♦ జనవరతనయుల్
చేతంబులు తమికొనసం, భూతత్వరితముననంత♦మునివరు వెంటన్ 212

వ. అట్టిసమయంబున 215

నెలవులు సేరంజనియెను, కిలకిలమని పులుగులెల్ల ♦ కేరుచువనులన్
మలయికలుమాని మృగతతి, నిలయంబుల జేరెనిరులు ♦ నెలకొనెదిశలన్

జలజాతహితుడు పశ్చిమ, జలరాశిం జొచ్చెనంత ♦ చనియమ్ముగురున్
జలములవార్చిరి వెసనొక, సలిలాశయ మందుకలువ ♦ సకుడుం బోలిచెన్

వ. అంతనాపథికవరేణ్యు లచ్చటి యాటవికులవలనం దెలుపంబడి 216

చని చేరువనయ్యెడనొక, ఘనతాపసనివసనంబు ♦ కనుగొనియటనా
దినశేషంబును గడపిరి, యనుపమ సంభావనముల ♦ నధిక ప్రీతిన్ 217

మఱునాడువారు ముగ్వురు
వఱువాతన లేచిచనిరి ♦ వారక మిథిలం
దఱియు తెఱవెఱిగి మిక్కిలి
మఱియుచు జవహర్ష కుతుక ♦ ములుముప్పిరిగాన్ 218

వ. అట్లమందానంద సుందరవదన చంద్రుండగు నారామచంద్రుడును

మునువెనుకలనడ తెంచెను, మునినిండనతమ్ముగూడి ♦ మునుకొనువేడ్కన్
గనియెందనకట్టెదుటను, ఘనుడాహంతపాపశిథిలం ♦ గడకమ్మిథిలన్ 220

వ. అట్లు కనుంగొను నయ్యెడ 221

ఆపట్టణ రాజంబట, చూపట్టం బధికులలర ♦ సొబగులగనియై
యేపగుతోటల, బాటల, గోపురముల గుళ్ళసత్ర ♦ కోటులతోడన్ 222

చేతమెలయించుసౌధ, వ్రాతంబుల మందమలయ ♦ వాతమ్ములస
ద్గీతమ్ముల పురిసరసీ, జాతమ్ముల పాంథరసిక ♦ జాతమ్ములరన్ 223

ఆమహనీయపురంబున, దామలరున రఖిలప్రజలు ♦ తత్తద్ధర్మ
స్థేమాభిరాములై ని, ష్కాములగు మదమదు నేలి ♦ కంబోలెలలిన్ 224

వ. అట్లింతయు నొప్పి యొప్పులకుప్ప యనందగు నప్పట్టణలలామముం
జూచి రాజమార్గంబున జని [illegible] నా రాజనందనులు తమ
ముందుగ నడచు మునిచంద్రు పిఱుందన జనుచు 225

నానాదేశాగతుల న, చూనామల కీర్తియుతుల ♦ నూతన మతులన్
మానావన నిరతుల బహు, భూనాయక సుతులగనిరి♦పురమున నెందున్

ద్విరదమ్ములపై కొందరు, నరదంబులపై న గొంద ♦ రందలములలో
వరగతి కొందరు తురగ,స్ఫురితగతింగొందరిటుల♦జొచ్చిరిపురమున్ 227

ఈరీతి చేరు రాజకు, మారుల విడియించెకడిది ♦ మందిరములలో
కోరిక చెలగగ జనకుడు, భూరిమహోత్సవముతోడ♦బురముంజెలగెన్

వ. అనంతరమట్లు విశ్వామిత్రు వెనువెంటం జనుదెంచిన రామ సౌమిత్రులును మిథిలాపట్టణ మధ్యంబుజేరి యచ్చేరువంగల యొక్క కమనీయ మహారామ మధ్యస్థంబగు మహాదేవు నాలయంబుం గాంచి దర్శింపం జనుటయు నయ్యెడ కంతకుమున్న 229

ఘనసారంబును శ్రీచం, దనమును నక్షతలు కుసుమ ♦ దామాదులుచే
కొనియాకో వెలకుంజనె, జననీజనకుల యనుజ్ఞ ♦ జనకాత్మజయున్ 230

వ. అట్లుపురాతన సదాచారానుసారంబుగ మంగళప్రదంబునుసర్వకామ్యసిద్ధిదంబునని స్వయంవర పూర్వంబున నమ్మహాదేవ దంపతుల నారాధింపంగోరి వివిధపత్రఫలపుష్ప పరిపూర్ణ స్వర్ణభాజన ప్రశస్తంబులగు హస్తంబు లలర సఖీజనంబులు పరివేష్టించిరా జని యక్కన్యకాలలామం బప్పురాణదంపతుల నతిభక్తి నర్చించి

స్తుతియించె సీతజనని, శ్రుతగుణు రఘురాముననఘు♦శుభగుణ దనకున్
బతిసేయింపుడటంచును, సతినింబశుపతిని కరము♦సదమలభక్తిన్ 232

వ. అట్లుపూజించి కైంకర్యానంతరంబు దేవళంబు వెడలి చనుదెంచ మైథిలింగని తదీయాద్వితీయతనూ విలాసవిభ్రమంబుల కచ్చెరు వంది కడుంగడునాత్మమెచ్చి శ్రీరామచంద్రుండును మరుశరంబుల కించుకనొచ్చి నిజాంతరంగంబున 233

మాయురె యీబాలికతన, సోయగమున మించె నిఖిల♦సురభామలనీ
తోయజవదనసరోజము, బాయవుమన్న యనభృంగ♦పంక్తులుగనగన్

ఆహా! యీబాలామణి, మోహాకరమైనముద్దు ♦ మొగమునునగవుల్
దేహాసమదీప్తియుగన, బాహాపరిరంభమునకు♦పరువిడెమనముల్ 235

అతులారుణాధరద్యుతి, స్తుతిపాత్రంబీమె- మోము ♦ సొబగుంగానీ
సతిలావణ్యంబెంతటి, ధృతిమంతునినైన దోయ♦దే మరువాతల్ 236

వ. అనియిట్లుపెక్కు తెఱంగులనమ్మెఱుంగుబోఁడిమెయిచెన్నుహారంగుంగాంచి యూహించుచు దశరథ సూనుండున్నయ్యెదుట నాతి దూరంబున నున్న తనయనుంగు చెలులం బిలిచి రామ సౌమిత్రుల వంక కొండొక తిలకించి పులకించిన కూర్మి నప్పంకజముఖి సఖీజనంబుల కిట్లనియె. 237

చెలులార కంటిరేతొవ, చెలికానిం డెగడుమోము ♦ చెన్నలరారం
జెలికానిగూడియదెకడు, చెలువమ్మున చెలఁగువాఁడు♦చెలి!యితడెవఁడో

సాహసవంతుండాయత, బాహాంచిత రూపయుతుడు ♦ పటుతర విలస
ద్దేహుఁడుదారుఁడునైకడు, మోహాంబుఘటించెదనదు♦మోముంగనినన్

వ. అని నిజాంతర్గతంబున 240

ఈరాచకొమరుఁబొందని, నారీమణిబ్రతుకదేల ♦ నరలోకమునన్
ధీరుడమిత భుజసారుడు, భూరిగుణాఢ్యుండు నగుచుఁ♦బొదలెడి జూడన్

ఈరాకుమారశేఖరు, డారాముఁడుగాఁగనోపు ♦ నటు కాదేనిన్
మారసముఁడితఁడునామది, కారాధ్యుండగుచుదోఁప♦నలవిదె యిటులన్

వ. అనుచుం జింతించి పరిపరి తెఱంగుల దుర్భరమదనాగ్నిదోదూయమానమానసయై చెలులవలన నాతండు రాముండగుట నెఱింగి, యాతనిందక్క నన్యుం బతిగానొల్లనని మనంబునఁదిరంబొనరించుకొని యెట్టకేలకు రామసౌమిత్రు లెదుటబాసి చనుటయుఁ దద్దర్శనప్రాప్తికి లోనంగడుంగడుమెచ్చికొనుచు నమ్మచ్చకంటి సెచ్చెరనిలుసేరం జనియెనంత. 243

ఆయవనీపతి జనకుం, డా యిత [illegible] చె [illegible] త ♦ ననద్యశేషపూల్యా
మేయమణికనకభూషిత, న [illegible] స్ఫటికకుడ్య ♦ మహామందిరముఌ

వ. అనంతరంబా స్వయంవర [illegible] ముకొని. 245

ఆహూతులౌచు సంభ్రమ, నా [illegible] ల రాజసుతులు ♦ చనుచుండిరొగిఌ
బాహువుబాహువుదగుల వి, దేహ [illegible] జవెంట్లియాడ ♦ దేజోయుతులై 146

తదనంతర మారాముడు, పదపడి లక్ష్మణుడు మహానీ ♦ పతికి పిఱుందన్
ముదమునపదములనిడుచును, గదలిరి దవుగనుచు పౌర ♦ గణములరంగా

ఈరీతిం జనసప్పుర, నారీజనమెల్ల మొగము ♦ నయనమ్ములుగా
శ్రీరాముని సౌమిత్రిని, సారతరప్రీతిఁగనుచు ♦ స్వాంతము లలరఌ 248

రాజులు విక్రమజితమృగ, రాజులు లావణ్యహాసిత ♦ రాజితరజనీ
రాజులు వితరణతటినీ, రాజులు నగు వీరిఁగనుడి ♦ రాజీవముఖుల్ 249

అనుచును బోగడుచుఁదమకము, పెనుపడగన్గొనుచు వేడ్క ♦ పేరిమివారి
న్ననలఁగొని పూజసల్పిరి, వనితలు సౌధములనిల్చి ♦ వారని కూర్మిన్ 250

వ. ఇట్లపూర్వరూపరేఖావయోవిలాసభాసురులగు రామసౌమిత్రులు విశ్వామిత్రుంగూడిచనుదెంచినంగని జనకుండును, భక్తితాత్పర్యంబు లెసకమెసగ నయవినయసంయుతుండై యెదురేఁగిలుసలిపి యమ్మునివరుం దోడ్కొనివచ్చి యుచితాసనాసీనులం గావించి, యుచిత పూజాసత్కారంబుల నొనర్చి కుశలంబడిగిన నమ్మిథిలాధిపతికి గాధిసుతుండిట్లనియె, 251

వీరలు దశరథభూపకు, మారులు గను బ్రీతి నాదు ♦ మఖమునుగావఌ
క్రూరుల దనుజులద్రుంపను, ధీరతచను దేరనిటకుఁ ♦ దెచ్చితి నేడున్ 252

ఈతండు రాముడగ్రజు, డీతడు లక్ష్మణుడు నిందు ♦ నీరాముడు దా
చేతోమోదమెసంగగ, సీతను పెండ్లాడఁగోరి ♦ చెచ్చెరవచ్చెన్ 253

ఈ రాముఁడు నీయల్లుఁడు, వారక చేకొనుము వీని ♦ వాసవుఁడయినన్
బోర నెదిరింపనోపఁడ, వారిగ సీతకును దగిన ♦ వరుఁడీతఁడగున్ 254

అను నమ్మునీంద్రుపల్కులఁ, దనమది సత్యమ్ములనుచు ♦ దలఁచి జనవిభుం
డనియె "మహాత్మక! యటులనె, చనుగాక న్యంబదెట్లు ♦ జరిగెడి" ననుచున్

తనమదినలరుచు జనకుఁడు, పనిచెను శివువింటి దేరఁ ♦ బలువురభటులన్
గొనివచ్చిరి వారును మెయి, జనియించిన స్వేదజలము ♦ జాలుగ వారన్

వ. అట్లు గొనివచ్చిన నద్దానిం గని 257

ఇదియేమి విల్లురోయని, బెదరిరి రాసుతులు లోన ♦ బెక్కురు దానిం
గదియఁగనోడిరి మనములఁ, బదిలంబొకయింత జార ♦ భయములు మీఱన్

అంతట జనకుండనె భూ, కాంతుల సుతులున్న వలను ♦ గనుగొని మీమీ
పంతంబులు నెఱపి యుమా, కాంతుని కార్ముకము నెత్తఁ ♦ గావలె దీనిన్

సత్త్వకలిమిని యాధను, వెత్తఁగలిగియెక్కువెట్టు ♦ నెవ్వఁడతని కీ
మత్తకురంగవిలోచన, నిత్తున్ మత్సుతను సీత ♦ నిందునిభాస్యన్ 260

అనవినియు రాజసుతుల, ద్ధనువుండాయంగలోన ♦ ధైర్యము లేమిన్
మునుపడరు వెఱతురొండొరు, గనిగుజగుజలాడుచుండ్రు ♦ గజిబిజిపడుచున్

తదుపరికొందఱు మనములఁ బదిలించుక తమదుతమదు ♦ బలములు వెలయన్
కదలుపఁజూచిరి వింటిని, వదలని బీరముల బెనఁగి ♦ వారని కడకన్ 262

వ. తత్సమయంబున సభాసదులెల్లరు నుదిలకొని చెదరిపఱవ మేఘనిర్ఘోషభీషణభాషణంబుల ఘోషిల్లుచు, 263

కంఠీరవనిభు నన్నన, కుంఠితగతిఁ బిల్వకూర ♦ కొనెనంచు మహో
త్కంఠజనుదెంచె నలదశ, కంఠుండురుగతినిజనకు ♦ గనలుచునటకున్ 264

ఇటువచ్చి బాహుబలత్స్య, త్కటగతి సారించివింటి ♦ కడకొని కేలన్
పటుగతినెత్తిననయ్యది, చటులతనొందమికిలోన ♦ జకితుండగుచున్ 265

హుమ్మనిగర్జించుచునొ, క్కుమ్మడి నిజబాహుబలము♦నూనిచి యలశే
ద్రిమ్మరులజేడువింటిని, నిమ్ముగనొకకొననుకొంత♦యెత్తుచు మగుడన్
పటిమంబు చాలకప్పుడు, తటుకున్బడె రావణుండు ♦ తద్దయుసభ నా
యటమటము నైపకేగెను, పటపటమని పండ్లుగొఱికి ♦ పటుభీకరుడై

ఇట్టు దశకంధరుడు తమ, కట్టెదుటనువింటినెత్తఁ ♦ గానోపకట దా
మట్టెగని రాకుమారకు, లొట్టిడికొన్నట్టు లూర ♦ కుండిరదవ్వులన్ 268

వ. అంత విశ్వజనమిత్రుండగు విశ్వామిత్రుండు ప్రేమపాత్రులగు నిజ ఛాత్రులంగని, 269

మమతదలిర్పగ బనిచెను, కొమరొప్పగ వింటినెత్త♦గుణధాము మహా
సమరావనిరిపుభీము, న్నమశరసన్నిభునిరాము ♦ శోభననామున్ 270

వ. అట్లు పంచినంజని యద్దివ్యకార్ముకంబునకు సప్రదక్షిణంబుగ మ్రొక్కి, 271

లీలన్ రాముడు తననిడు, కేలన్ గరి, చెఱకుఁ దిగుచు♦క్రియనెత్తె మహా
భీలంబగుహరుధనువును, చాలందనుజూచియచటి♦జనములుమెచ్చన్

ఈ రీతి నెత్తి నిజదో, స్సారంబు చెలంగనారి ♦ సంధించి వెసన్
సారించినవిల్లునిగెన్, భూరిధ్వానముననభము♦భూమియుమ్రోయన్

వ. అయ్యవసరంబున 274

కురిసెన్బువ్వులసోనలు, విరిసెన్వేల్పులమనంబు ♦ వివిధగతుల వే
మొరసెన్సురదుంధుభులట, మురిసెన్జానకియు రాముమోమొగిగనుచున్

కొసరుచుముసిముసినగవుల, ప్రసవంబులమాలనొండు♦రామునిమెడ న
క్కసలసమాధర జానకి, వెస మసలకవైచిచనియె ♦ వ్రీడావతియై 276

ఆ రాము గాంచిమెచ్చిరి, ధీరతతత్సభ్యనృపుల ♦ తిష్ఠిర హర్ష
స్ఫారోత్సాహులునై సీ, తారామయె దాశరథికిఁ♦దగుసతియనుచున్ 277

వ. అంత 278

రండీ! సీతారాముల, పెండిలికని పిలువబంచె ♦ పృథువిభవమునఁ
పండితుల హయారూఢుల, దండిభటులజనకుడంత♦దశరథుకడకున్ 279

వ. అట్లుపిలచిన, సపురోహిత బంధుమిత్రామాత్యుండును, సతీసుత సహితుండునుంగా దశరథక్షితీశుండు చనుదెంచి ప్రథితయశోభిరామంబగు మిథిలాధామంబుందరిసి పరివారసహితుండై జనకుండెదురరా నతనింగూడిసని, విశ్వామిత్రమహర్షి కిన్మ్రొక్కి, తత్కృత మహోపకృతినుగ్గడించి, రామసౌమిత్రికృతప్రణాముండై వారిం దీవించి యుచితాసనాసీనుండై యన్యోన్య కుశలసల్లాపంబులనడపి భూతవర్తమాన వృత్తాంతంబులనెఱింగి వశిష్టాది సకలమునిజన సమ్మతంబుగ సర్వశుభ ప్రతిపాదకంబగు నొక్క సుముహూర్తంబు నిశ్చయించి యుంటయునందు సీరధ్వజనామాంతరుండగు జనకుండును దశరథ కుమారులగు శ్రీరామలక్ష్మణ భరతశత్రుఘ్నులకు వరుసన నిజాత్మజయగు సీతను కుశధ్వజుండను నిజానుజుని యాత్మజలగు నూర్మిళా, మాండవీ, శ్రుతకీర్తులను కన్నియలనిచ్చి పాణిగ్రహణంబులుసేయఁ బెద్దల యనుమతింగొని యేతచ్ఛుభముహూర్తంబును సత్యాసన్నంబయిన మహావైభవ సముపేతంబుగ వివాహంబు నెఱపుచున్న నమ్మహోత్సవ సమయంబున నమ్మహనీయ వైవాహిక మందిరంబును 280

తోరణముల సుమమాలల, భేరిమృదంగాదివాద్య ♦ పృథులధ్వనులన్
భూరి ఘనసార మృగమద, చారుశ్రీ చందనముల♦సౌరభయుతమై 281

శుభమస్తు, సిద్ధిరస్తు, సువిభవోస్తు, సుసౌఖ్యమస్తు,♦విజయోస్తు ,సుదుర్లభకీర్తిరస్తు టంచును, నభమంటగ విప్రదీవ ♦ నంబులు చెలగన్ 282

అలరె మఱియు నాభవనము, విలసిత మణివేదికలను ♦ విద్రుమకుడ్యం
బులము త్తియంపుముగ్గుల, నలఘుత రానేక సముచి♦తాసనతతులన్ 283

వ. మఱియు నయ్యెడ 284

అచ్చర లేమలుపాడిరి, విచ్చలవిడి గురిసిరర్థి ♦ వేల్పులు సుమముల్
హెచ్చుగ నమానులుబుధులును, మెచ్చిరి వధువులనువరుల♦మేల్దీవనలన్

వ. మఱియుం బురోహితోపదిష్ట ప్రకారంబుగ జనకుండు యథావిధి హోమగుండములు దరికొల్పి యగ్ని వ్రేల్చుచు వధూవరులకు మధుపర్కాది సంభావనల వేదోక్తప్రకారంబుగ నడిపి సుముహూర్తం బాసన్నంబయినంత వరులచేత వరవధూగళంబుల మాంగళ్య సహిత చారుసూత్రంబులంగట్టించి వివిధ మంగళవాద్యంబుల మొరయించు నయ్యవసరంబున 286

దోసిళులబట్టి ముత్తెపు, సేసలుచల్లాడిరొకరి ♦ సిరముల నొకరున్
బోసికొనుచు వేడుక మెయి, వాసిగ వధువులకువరులు ♦ వరులకువధువుల్

వ. మఱియు నయ్యెడ జనకుండును భూదేవతల ననుపమ భక్తిం బూజించి భూరి భూవస్త్రగోదానాదులం బరితృప్తుల గావించుచు, సర్వజనసంతృప్తికరంబుగా మహాన్నవస్త్రదానంబులం జేయుచు నుండునయ్యవసరంబున

తోరంబౌమధురఫలా, హారంబుల హృద్యవన వి♦హారముల మణీ
హారంబుల సునటీ శృం,గారంబుల జొక్కిపౌర♦గణమెసగెనటన్ 289

చారుతరమయ్యెగన్గొన, భూరి సురభిశోభితములు ♦ భోజనశాలల్
సారరసవత్పదార్థ వి,హారంబుల, రమ్యపౌర ♦ హారావళులన్ 290

అన్నవ భోజనశాలల
నెన్నిక వడ్డించి సూప♦మింపగు కూరల్
వెన్నలు జున్నులు ఘృతములు
వన్నెల పచ్చళ్లు పులుసు ♦ వడెము ల్బొరుగుల్ 291

బూరియలప్పాల్ పెరుగుం,గారెలు పులిహోరలట్లు ♦ కమ్మని పూరీల్
క్షీరాన్నమతిరసంబులు, సారెకువడ్డింత్రు భోక్తృ♦జనములుమెచ్చన్,

జనకవిభు వినుతులొక్కెడ,జనకసుతారూపశీల♦సన్నుతులొక చో
నినవంశజగుణవర్ణన,మును నొక్కొకచోఁ జెలంగె♦భోజనవేళన్ 293

క్షీరాన్న మనుపమము! పులి
హోర మహాద్భుతము! దధియు ♦ నమృతోపమముర్
హారి భక్ష్యాళి! భళిరా!
కూర లహో! యనుచు మెచ్చి ♦ కుడిచిరి జనముల్. 294

వ. అట్లు, సర్వజనాహ్లాదకరంబుగ సంతర్పణములొనర్చి పరిమితదినంబులం గళ్యాణము నపరిమితవైభవోపేతంబుగ గడపి పరిపూర్తి గావించి బంధుజనంబుల యుక్తప్రకారంబుల సంభావించి యనిపి తక్కిన యెల్లర నర్హావిధిని సత్కరించి 295

అరణంబిచ్చెను మిథిలా,ధరణీశుం డల్లురకును ♦ తనయులకును నా
భరణంబు లంబరంబులు, వరవాహనచయము వివిధ♦వస్తునిచయముర్

వ. ఇవ్విధంబుగ సర్వసన్నాహంబులుంగడచి, యయోధ్యాప్రయాణ ముహూర్తంబు సమీపింపనుండుటయు నత్తరి దన్నుందర్శింపంజను దెంచిన తనుయనుంగు చెలిమికత్తియలంగని సీతాదేవి యిట్లనియె.

చనివచ్చెద చెలులారా, మనముల నన్నింతయేని♦మరువక మఱి నా
యొనరిచిన తప్పిదంబుల, నెనరునమన్నింపుడమ్మ♦నేప్రార్థింతున్ 298

వ. అనుటయు వారును దమ నెచ్చెలి నెడబాయవలయుటకుం గడుం గడు వగచి, 299

నినుఁ బాసియుండ మాకిక,దినమొక్కయుగంబువోలె ♦ దీర్ఘంబగునో
యనుపమగుణ!యిక నేగతిమనుదు మొనినుజూచువేడ్కమాకిక నెపుడో

వ. అనుచు చిరకాలస్నేహంబుకతన వారలును మిగుల వగలంబొగిలి కనుగవలనురలు నశ్రుల కొనగోటఁమీటుచు నబ్బోటిని వీడం జాలకయు నెట్టకేలకు వీడిన జనకుండును సతీసమేతుండై, నిజాన్న

జుండును, తత్సతియుంగూడ శిరాంగూతోండ్ర సత్త్రవారి కప్పగింత బెట్టం
దోడ్కొనివచ్చి రాముంగని 301

ఓసుగుణగణ్యయల్లుడు, నీసము ను లభించుటకిది♦నిక్కము తొలి మా
చేసిన పుణ్యంబెట్టిదొ, మా సీతకు భర్తవైతి♦మామన మలరన్ 302

నీకేము చెప్పనలయునె! రాకేందు యశోవికాస ♦ రమ్యవిలాసా !
మా కన్నియయిది గుణవతి, నీకనుకూలయగు నీమె♦నిక్కముసుమ్మా

వ. అని కూతుంగని 304

ఓయమ్మ! సతికి పతియే, నాయకుడును దైవమగుట♦నమ్మిక నితనిన్
బాయక మెలగుచువివిధో, పాయంబులఁగొల్చిసుఖము♦వడయుము! తల్లీ!

విను మత్తమామలం గడు,దనుపుమయొప్పైననుడుల♦దగునడవడులన్
మనమున వారే జననీ,జనకులనుచుకొలిచి మనుమ♦జనములుమెచ్చన్

గురుసాధువిప్రవిద్వ,ద్వరులన్ సేవింపుమమ్మ ♦ వైదేహీ! సదా
పరిజనుల యాచకావళిఁ,గరుణామతి బ్రోవుమమ్మ ♦ కడు ధీయుతవై

వ. అని యిట్లు బుద్ధులం గఱపుచున్న తలిదండ్రులను, చిరపరిచితసఖీ
జనంబును గృహారామాదికంబును, వీడి చన కాలాడక, 308

అక్కన్యకానతంగము, వెక్కసమై పొరలివచ్చు♦నెత లోలోనన్
జొక్కుచు వెక్కుచు వగచెను, చెక్కుల నశ్రువులజాలు♦చెచ్చెఱవారన్

వ. ఇట్లు విచారించు జానకింగని తామును గొంత వగచి మరల
ననునయించుకొని బిడ్డలనూరార్చి జనకుండును నిజభార్యాసహి
తుండై పురంబుదాటిచాలవఱకు కుమార్తెలనల్లురసాగనంపి మరల
వేగమవత్తురుగాని లెండనుచు నమ్ముగుదలఁ దిగవిడిచి, కనుచూపు
మేర దాటి వారు చనుటయు నింటికిచని భార్యంగని 310

చిన్నారిసీత లేమికి, చెన్నెడలుచు నున్నవవిగొ ♦ చెట్లుం దీవల్
ఎన్నండు చూడఁగలమొ, చిన్నికుమారికలమగుడ♦చేతంబలరన్ 311

ఎలనాగలు లేమింగడు, వెలవెలబారెడినిగంటె♦విరిఁదోటలు నీ
ఘెలమావితోఁట లల్లనె, పులుఁగులతోఁ బంజరములు♦బొమ్మలయిఁడ్లన్

వ. అని యిట్లు జనకదంపతులు సీతావియోగసంజాతసంతాపంబున
వగచుచు నమ్ముఁగుదల మఱువలేకుంటయు, నట రామాదులును
నయోధ్యాపురోన్ముఖులై పయనించుచు నయ్యెయెడల, 313

మందానిలవీచుల నా,నందలహరి బొంగుచుండ♦నగుమోములతో
మందగమనముల తండ్రి పి,ఱుందంజనుచుండి)పురము♦తోఁ)వనమెల్లన్
అత్తలవెనుకను మైతళ్లు, కొత్తగ నెన్నడలఁజనుచు♦నుండిరి వేడ్కన్
జిత్తజు కటారులోయన, క్రొత్తగ దశరథునికూర్మి ♦ కోడండ్రపుడున్

వ. అట్లా రాజసూను లసూనవైభవోన్నతులై సపరివారంబుగ మాతా
పితల పిఱుందనేగుచో మధ్యేమార్గంబున మధ్యందినచండమార్తాం
డుని కరణిన్మండుచు సరణికడ్డంబునని ధరణిపానేకపసింహుండైన
పరశురాముండు భీముండై భీముచాపభంజనంబునకుం గడుంగడు
గనలుచు ననలజ్వాలాసన్నిభంబులై కరాళంబులగు తామ్రపర్ణ
జటాజాలంబుల జనంబులు బెదరిచెదర, కఠోరంబగు కుఠారంబెత్తి
నిలునిలుండని యారాచవారి నదల్చుచు, రానతనింగని తక్కిన
యెల్లరుం భీతులై పఱవ సుస్థిరులై యున్న రామసౌమిత్రుల నెట్ట
యెదుటం గనుంగొని రామునుద్దేశించి 316

భర్గుని శరాసనమ్ము న,నర్గళగతి ద్రుంచితంచు ♦ నలరెదవౌరా!
భర్గహితుఁడ ద్విజుఁడను నే,భార్గవరాముండ వినవె♦పార్థివరామా! 317

శర్వుని విల్విఱిచిన నీ, దుర్వారమహాప్రతాప ♦ దోర్గర్వము నీ
యుర్వీశులడల గూలిచి, పర్వమ్మొనరింతునేడ♦పశుపతి మదికిన్ 318

ఇరువదొకమారు మున్నిల, నరపతులన్ బట్టిద్రుంచి ♦ నాపితరుపగన్
కరమరుదుగ,దీర్చితి నీకరయంగావలదె నృపకు♦లాంతకు నన్నున్ 319

చివికిచెడియున్న తొల్లిటి, శివువిల్లెత్తుటయుఁ గడిది ♦ చైదమె యీవై
ష్ణవచాపమెత్తినాతో, బవరమ్మునసిలుపుమిపుడ ♦ పసగనుగొందున్ 320

అనినవిని రాఘవుండును, వినయంబై నతులొనర్చి ♦ విప్రునకనియెన్
అనఘాత్మ! విప్రకులమం,దున మీకీ కోపమేల ♦ నాపై జెపుడీ 321

జనకుం డుంకువబెట్టిన, త్రినయను చాపంబునెత్తఁ ♦ దిగిచితి వరపూ
జనపూర్వకముగ నదియుం,దునికెంబిగివీడియందు! ♦ దోషమునా దే 322

ద్విజమాన్యులు మీకుంభూ,భుజుల యెడల నిట్టికినుక ♦ బూనందగవే
కుజననృపతికొకనికినై, సుజననృపౌఘుంబుమాపఁ ♦ జూడందగునే 323

కోపముతగదెవ్వారికి, కోపమ్మున రూపుబుద్ధి ♦ గుణముండఱుగున్
కోపమునతపము సెల్లును, కోపములోకములగాల్చు ♦ కొఱవియగాదే 324

భూపులకు ద్విజులయెడలం, గోపింపం దగదటంద్రు ♦ కోవిదులగుట
న్నే పగిది మనముకదన, వ్యాపారమునకును బూన ♦ వచ్చును చెపుడీ 325

అనిపల్క రామునకుభృగు, తనయుండనురామ! నీవు ♦ తగు రాజవహో
వినయోక్తుల ననుగికురిం,పను నెంచెదవిదియునొక్క ♦ ప్రజ్ఞయెతలపఁగ

ఎదఁగొంక నేలనాకై, యిదె బ్రాహ్మ్యం బిదియె క్షాత్ర ♦ మింపుగనాయం
దొదవు శాస్త్రంబు శస్త్రము, కొదలేకాలంబుసేయఁ ♦ గొనకొమ్మింకన్

అనితన విల్లిడి "దీనిం, గొనివిఱువుము విఱువవేనిఁ ♦ గూల్చెదనిను సా
గొనెవింటితోఁడె రాముడు, ఘనమహాతద్బలము నంత ♦ గనియాతండున్

ఆహా! విచిత్రమిదియ, ద్భాహోబలమెల్ల నొక్క ♦ పట్టునగొనె నీ
యూహాతీత మహాద్భుత, సాహసయుతుడితడు రాజ ♦ సామాన్యుండే

వ. అని యించుక యోచించి దివ్యదృష్టి నాలోకించి యాతం డాదిదేవుండును, మహాదేవప్రియుండును నగు శ్రీహరియే యని యెఱింగి యమ్మహానుభావు నీశ్వరేశ్వరు నిట్లని ప్రశంసించె. 330

ఓరామ! రాఘువా! భూ, భారాపనయార్థమిట్లు ♦ ప్రభవించినసీ
చారుశుభరూపనామము,లారయ శుభదములు భువిజ♦నావళికెపుడున్

శుభదుడవు, శుభమయుండ వ,శుభహరుడవుసునిశితాస్త్ర♦సుస్థిర తేజో
విభవుండ, వాదిదేవుడ, వభవుండవు భవనుతుండ ♦ వఖిలేశుడవుర్

వ. అగుసేకు నిత్యమంగళావాప్తిర స్తని యించుక ప్రశంసించి యాశీర్వదించిన నవ్విప్రలలామును గరుణించి రాజకులాబ్ధిసోముండగు రాముండు ధర్మజ్ఞుండుగావున నిట్లు బ్రాహ్మణుం డవ్యయుండని నిరూపించి, బహుమానపురస్సరంబుగ నతని వీడ్కొలిపి మాతాపితృదారాదులును బంధుసహోదరామాత్య పురోహిత విహితబృందమ్మును, దాసదాసీజనంబునుం దోడరా, భూలోక వైకుంఠంబునా దనర్చు సాలంకృత సాకేతపురవరంబుం బ్రవేశించెనంత 333

ఈరీతి రామచంద్రుడు, దారాదులగూడికూర్మి♦తమ్ములు దానుం
జేఱంగ నయోధ్యాపుర, పౌరులు గడునలరి రుత్స♦వంబులు చెలగన్

వ. మఱియు నప్పౌరనారీజనంబులు సీతాదికాంతలంగని 335

తగు కోదండ్రను గనెమన, జగతీశుడహోకనుండి♦చానల వారే
మగువల మన్నలు మిథిలా, జగతీపతిసుతలు సుగుణ♦సంపద్యుతలున్

వ. అనిపల్కుచు పుష్పాంజలులం జల్లుచు, నివాళులర్పించుచు, నిజగృహాంగణంబులనిల్చు వారల సత్కారంబుల సాదరంబుగా నంగీకరించుచు, దశరథ నృపాలుండు నగరుం బ్రవేశించి సుఖంబుండెనంత 337

ఇష్టములుకూరె, ప్రజసంతుష్టింగడుమించెనంతఁ ♦ దోరంపుగతిన్
వృష్టిగురిసె, గ్రమగతి నే, కష్టంబులులేక ప్రజలు ♦ గడపిరిదినముల్

ఆ శీ స్సు

ఈరామచరిత మిల నె, వ్వారలుపఠియింత్రుభక్తి ♦ వారలకగు సీ
తారాముకరుణ ననఘర,తారోగ్యాయుర్యశంబు ♦ లభ్యుదయంబుల్

## కాండాంతము

వనజహితాన్వయపావన, వనజాసనముఖ్యదివ్య ♦ వరకృతనమనా
మనసిజరిపునుతకథనా, ధనదసఖాక్రాంతచింతి♦తాంచితవదనా 340

వీరాధివీరనుత రణ, శూరా! త్రైలోక్యసుజన ♦ శుభకర! ధీరా!
హారాకార! సుహారా! సారామలసద్విహార! ♦ సత్యవిచారా 341

అమరావళినుతనామా!, సమరావనిసత్వభీమ! ♦ సద్గుణధామా!
ప్రమదాజనదృక్కామా!, సమదాసురమదవిరామా! జానకిరామా!

### గద్య

ఇది శ్రీమత్సీతారామచంద్ర సాంద్రకృపావిశేషప్రసాదిత
కవితావిశేష, సాధుజనసేవాపరాయణ, వినయ
ధురీణ, సేవితరామభద్రభక్త, వీరభద్రోక్త
శ్రీమత్కందరామాయణంబునందు
బా ల కాం డ ము
సమాప్తము.



ఓం శ్రీ సద్గురుస్వామినే నమః

శ్రీ శ్రీ రాధాగోవింద భగవతే నమః

# శ్రీమత్సుందరరామాయణము

## అయోధ్యాకాండము



సుకవి వినుతశీలా!
వాసవనుతవర కృపాల ♦ వాలా! విలస
ద్దాసావన గుణజాలా!
శాసిత రిపుజాల! జనక ♦ జా గుణలోలా! 1

వ. అవధరింపు మట్లు పరిణీతులైన రామలక్ష్మణ భరతశత్రుఘ్నులు నాకసన్నిభంబైన సాకేతపురంబున నిఖిల ప్రజాప్రమోదకరులై యుండుచు, 2

ఆ రాకుమార సోదరు, లారాధించిరి నిజాత్మ ♦ లందలిభక్తిన్
గారాపుఁ దల్లిదండ్రులఁ, గూరిమిఁ దమ్మెల్లజనులు ♦ గొనియాడంగన్ 3

జనకుండ విభుఁడు, గురుఁడును, జనకుండే దైవమనుచు ♦ సద్భావనలన్
దనరుచుభయంబుభక్తియు, ననురాగము నొకటగూడ ♦ నలరుచువారల్

ఆరామునురుపరాక్రము, ధీరునిజాగ్రజు భజింత్రు ♦ తిరమగుభక్తిన్
చారుగుణులుజితరిపుదో,స్సారులు, సౌమిత్రి భరత ♦ శత్రుఘ్నులొగిన్ 5

వ. మఱియు నంతఃపురములందుండు సీతాదికాంతా జనంబులును, 6

అత్తలుమామయునుండమ, చిత్తంబులఁ దమ్ముమెచ్చ ♦ సేవాసక్తిన్
హత్తుకొనినమనములఁగడు,బిత్తరులై మెలఁగి రెల్లఁ ♦ బెద్దలువొగడన్ 7

నయమునుప్రీతియుసిగ్గును,భయమునుభక్తియునుగల్గి ♦ భర్తలనెపుడున్
బ్రియమారఁగొలిచివారల,దయకుంబాత్రంబులైరి ♦ దయితలుఫెలుచన్

పాటీరాగరు కస్తురి, పాటీరాగములఁ జెలగి ♦ వివిధరుచులమేల్
శాటీదుకూలలై బహు, చేటీజనమెప్పుడుఁగొలువఁ ♦ జెలఁగిరిసతులున్ 9

పతినుడిగడవరుమఱచియుఁ, బతిహితమేతలఁతురఖిల ♦ భావములందున్
పతియేదైవమటంచును, మతిఁ దలతురుగొలుతురర్థి ♦ మానినులెపుడున్

వ. అట్టుండ కొండొకనాఁడు భరతుండు సహచరుండగు శత్రుఘ్నుం
గూడి నిజమాతామహుందర్శింపఁ గౌతూహలియై తదీయంబగు
గిరివ్రజ పురంబుంగూర్చి చనుటయు తదనంతరంబ, 11

ఒకనాఁడుదశరథుఁడుసభ, సకలంకతఁగూరుచుండి ♦ యాత్మసచివులన్
సకలావనీశచంద్రులఁ,బ్రకటంబుగఁజూచియిట్లు ♦ పలికెన్ బ్రాఢిన్ 12

ఏలితిభువిపెక్కేఁడులు, దోలితినసురులనరిపులఁ ♦ దురమున ధృతిమైఁ
జాలితిని ధర్మరక్షకు, సోలితిఁ గడుముదిమిశక్తి ♦ సురిగెనుగానన్ 13

రాముని,సురారినగసు,త్రాముని,నయవినయసుగుణ ♦ ధాముని,ప్రాంచ
త్స్థేముని, జనకకుమారీ, కాముని మీకింక రాజుఁ ♦ గావింతు వెసన్ 14

మారాముఁడతులకరుణా, పారీణుఁడు, సర్వశాస్త్ర ♦ పారగుఁడులస
ద్ధీరస్వాంతుం డతులిత,సారమహౌదార్యగుండు ♦ సాహసుఁడరయన్ 15

కోపము నుద్ధతిగర్వం, బేపగిదియు నెఱుఁగఁడెపుడు ♦ యిద్ధవివేకో
ద్దీపితశాంతాత్ముఁడుమా,భూపుత్రీకాంతుఁడఖిల ♦ భూతహితుండున్ 16

ఇంతకును మీకు నేయ,భ్యంతర ముండిననుగాని ♦ పలుకందగు నా
చెంత నే'' యనినను సభ్యులు, సంతోషితచిత్తులగుచు ♦ సమ్మతిఁదెలుపన్

వ. కడుహర్షించి పట్టాభిషేకమహోత్సవ మొనరింప నొక్క సుము
హూర్తంబు నిశ్చయింపంజేసి, 18

సంతసమున దశరథ భూ, కాంతుండు వశిష్టునెల్ల ♦ కార్యంబుల నా
ద్యంతయుఁగొఱలేకుండఁగ, నెంతయుసమకూర్చుడనుచు ♦ నింపుగఁబనిచెన్

కృతనిశ్చయుఁడై నృపుఁడా, తతమతిఁదాఁబిలువఁబనిచె ♦ దనసుతు రాముం
వితతగుణాంచితుఁ కరుణా, న్వితుఁడగ బోధింపరాజ♦నీతిఁ బ్రీతిన్ 20

వ. ఇట్లు రాజనీతి నుపదేశింప రామచంద్రుని, చేరంబిలిచి, 21

''ఓయన్న! నీకురాజ్యం, బీయంగానుంటిఁ గాన ♦ నిమ్మఁగఁగొను మీ
తీయనినాయుపదేశము, శ్రేయంబగు నీకుదీన♦శీఘ్రము'' యనినన్ 22

చిత్తంబనిహస్తమ్ములు, మొత్తముగాఁగూర్చి మ్రొక్కి ♦ముదముగ రాముం
డత్తఱినిల్వఁగఁగనిరా, జోత్తముఁడనె నిట్లు ప్రేమ ♦ ముప్పతిలంగన్ 23
ఎందునఁ బ్రజసుఖమొందెద, రందునసుఖమౌను జేని ♦ కమలచరిత! పూ
లెందునువాడనియప్పుడ, పొందెడు మకరందసుఖము♦పుష్పంధయమున్

కావున ప్రజలను సుతులని, భావంబునఁజూచి వారి ♦ పాలన సేయం
గావలయుఁ బ్రభుండెన్నఁడు, ధీవిలసిత! దీనినిజముఁ♦దెలియుము నీవున్ 25

కొండెములుసెప్పువారల, దుండగులగు వారిఖలుల ♦ దుర్మదుల, మఱిన్
పండిత విద్వేషులఁ గని, ఖండింపుము నీదుకీర్తి ♦ కడలకుఁబ్రాకన్ 26
దీవింపుము పిన్నలసం, భావింపుము దైవములుగ ♦ బ్రాహ్మణులమదిన్
గావింపు మార్తరక్షణ, సేవింపుము సాధుజనుల ♦ సిద్ధులగురులన్ 27
శరణార్థుల నేమఱకుము, గురుఘాతుకజనులనూఱ♦కొనకుము మఱియున్
గురునాజ్ఞమీఱి చనకుము, అరయమి సజ్జనులఁ గాసి♦నందింపకుమీ! 28
ఏమఱచి రాచకార్యము, నీమంత్రులచేత నిడుట ♦నిక్కము నీకున్
సేమముగా దటుగావున, నీమంబున గుప్తమంత్ర♦నిరతుఁడవగుమా! 29

దండింపదగిన వారల, దండింపక యున్న మఱియ ♦ దండ్యులఁ గడకన్
దండించుచున్న రేనికి, దండిగనగు నపయశంబు ♦ దగునరకంబున్ 30

ఇన్నియు నీవెఱుంగుదు, వన్నా! శ్రీరామచంద్ర! ♦ వైననుఁగూర్మిన్
గొన్నిటిఁ దెల్పితినీఁక న,భ్యున్నతిఁ గైకొమ్ము మకుట♦మున్నతశోభన్ 31

వ. అని ప్రేమపూర్వకంబుగా నుడివిన నందనియుండగు నిజపితరునకు ప్రియనందనుండగు రాముండును వినయ వినమితోత్తమాంగుండై యంజలిచేసి కృపాయత్తచిత్తుండైన తండ్రికడ పవివిని, నిజభవనమునకుంజనియె నాసమయంబున, 32

అనవరతరాజ్యభారం, బునఁ గృశతంగన్న నృపుని ♦ పోలికనంతన్
గననయ్యె నినుఁడువృద్ధత, దినగమనాహృతవిశేష ♦ తేజోయుతుఁడై 33

కమలములుగళలఁబాసెను, కుముదంబులుకళవహించె ♦ గొబ్బునయొకటన్
గమలాప్తుఁడస్తమించుట, కుముదాప్తుండుదితుఁడగుట ♦ గూడగనపుడున్

సితమయ్యె జలజతతి విల, సితమయ్యెం జంద్రకాంత ♦ శిలలును గడుభా
సితమయ్యెదరులతలు విక, సితుఁడై శశియంతఁబూర్వ ♦ శిఖరిన్ బొలువన్

అంత దశరథుఁడు సనియెను, సంతోషగుణైకకైక ♦ సౌధమునకుఁదా
నెంతయు "రామునివిభుగా, వింతున్ రేప"నుచు వేడ్క ♦ వినుచుటకునునై

వ. అట్టియెడ నంతకుమున్న యావార్త విని తనియక చిన్ననాటి క్రోధంబు ప్రవృద్ధంబుగ మంధరయను వృద్ధదాసియుఁ దనయేలికసానియగు కైకేయి కెఱింగింపంజని, 37

ఓయమ్మ! యెంతబేలవె!, నీయధిపునిచేత లెఱుఁగ ♦ నేఱక కడుని
న్నాయన మెచ్చునటందువు; ఈయెడనదియెల్లకల్ల ♦ యేయయ్యెగదే! 38

అది యెట్టులన్న నీపతి, ముదముగ శ్రీరామురాజ్య ♦ మునకున్ బతిగా
విదితగతిఁ జేయనెంచెను, ముదితా! నీచెవినొకింత ♦ మునువేసెనటే?

నావిని రామునివిభునిగ, భూవిభుఁడొనరించుననఁగ ♦ బొంగుచుసతియున్
శీవిచెలఁగ నొకహారము, వేవేగ మెదానిమెడను ♦ వేయగనదియున్ 40

"నాకేలనమ్మ! హారబ, హూకరణము? నీదుమేల ♦ హా! యిక చెడియెన్
ఆకౌసల్యకు నీవిక, లోకువగదె! రాజమాత ♦ లోగొనదె? నినున్ 41

నీపూర్వపుటౌన్నత్యపు, టేపు దఱిగి నీవుభరతుఁ ♦ డిటపై రామున్
భూపతిగగొలువనేనెటు, లోపుదు? మిముగొలువతొత్తునొకతొత్తువలెన్

ఈయనువున నేజెప్పను, పాయము వినియట్లు సేయఁ ♦ బాయునుసీకీ
హేయంపు దుర్గతియునిక, వేయనగాగలదె మేలు ♦ వినుమద్దాని౯ 43

వ. నాపుడు విధిచోదితయై కైకయు నాయుపాయం బెయ్యదియో తెల్పుమన మంథర యిట్లనియె. 44

ఓయతివ ! తొల్లి నీవును, నీయధిపునితోడ నేగి ♦ నెఱినొక యుద్ధా
పాయంబునఁ దనుమనుపగ, నాయనవిపుడిడినవరము ♦ లవియుండెగ దే!

నేడవ్వానింగోరుమ, పోడిమిభరతుండు నొకట ♦ భువినేలుట యీ
రేడేండ్లు రాముఁడటవిని, గూడిమనుట యిట్లుగోరు ♦ కొనఁదగువరముల్

ఇట్టగుట నొక్క కీడుం, బుట్టదు రాముండువనికిఁ ♦ బోవును పిత కై
చెట్టేదిభరతుఁడేలును, గట్టిగనీభువిని దానఁ ♦ గాంతువు శుభముల్ 47

వ. అనియిట్లు విధిప్రేరణంబున నిజదాసియగు మంథరచే బోధింపఁబడి దైవాభిమతంబునంజేసి కైకయు 48

రామునివనమునకనుపగఁ, ప్రేముడి నిజతనయుఁబుడమి ♦ నేలినొనర్పన్
ఈమాడ్కివరద్వితయము, భూమీశుం గోరఁదలచి ♦ పూనె౯ జలమున్

వ. ఇట్లు స్థిరమనోరథయై, నిజమనోహరుండగు దశరథ భూవరుండు సనుదెంచిన; కైకయు మంథరావచనానుసారంబుగఁగోపంబునభినయించుచు, 50

ఎదురేగదు తొల్లిఁటివలె, ముదమునఁగదియంగ రాదు ♦ ముచ్చటలాడ౯
బదులాడఁబోదుపతికిని, నదయత కైకేయి కాంచ ♦ దవనిపు మోము౯

చనవు మెయిఁజాయుపతినుడి, విననొల్లదు పలుకదెంతొ వేసఱుమఱియున్
జనఁజూచుఁగోలఁగువీడును, గనలుచుఁబర్యంకసీమఁ ♦ గైకయునపుడున్

హా!యను, నింతటి మోసం, బా!యను, నికనమ్మిచెడుదునా! ♦ యనునొనొ
నాయెనునాకుందగినటు, లీయననన నేమియనును ♦ నింతియువంతన్ 53

వ. ఇప్పగిది నప్పంకజేక్షణ క్రోధదురీక్షణయై యుంటంగని దశరథుండును, 54

బాలా! నాపై కోపము, జేలా! తెలియంగజాల ♦ నేలా! నన్ని
ట్లీలన్ మారుని కోలల, జాలంగారింతువేల ♦ సన్నుతశీలా!
ఆడితినో నీనుడికెదు, రోడితినో శత్రువులకు ♦ యుద్ధావని బో
నాడితినో భూసురులను, నోడితినో నీమనమున ♦ నొయ్యన సేయన్ 56

నావుడు కైకేయి యను, "ధీవిలసిత! నీగుణంబు ♦ తెలిసెన్నేటన్
భూవిభులుస్వార్థపరులను, నావచనముకిత్తు రా నె!" యనన్నృపుడనియెన్

"ఏమీ! నన్నిటులాడెదు! చామీకరచారుగాత్రి! ♦ సరగున చెపుమా!
నీమది శంకయ దేటికి! నామాటకుం దిరుగులేదు ♦ నమ్ముమచెప్పన్ 58

సురలెత్తి వచ్చిరేనియు, సురరిపులెత్తినను గాక ♦ సురలును, నసురల్
వరగతి నడ్డినగైకొన, సరగున నీకోర్కెసేతు ♦ సకియరో చెపుమా 59

కోరెదవో నృపకాంతల, భూరిగతిని నూడిగంపుం ♦ బోలతులుగను, గా
కీరాజ్యమేలనలతో, సారసనిభనయన! చెపుమ ♦ సరగుననిత్తున్ 60

ధరణిం బ్రసిద్ధులు కడిదివి, తరణాఖ్యులు సత్యవాక్య ♦ తత్పరులని మా
తరణికులులు తరతరముల, తరుణీ! నీకోర్కెసెపుమ ♦ తప్పక చేతున్ 61

వ. నీవింకను నన్ననుమానింతువేని నా ప్రియనందనుండగు రాము
నిపై నానవెట్టి చెప్పుచున్నాడ. నాడితప్పు వాడంగాను నీ కోరు
నట్టి దెయ్యదియేనింగాదనక యిచ్చెదనని 62

మిక్కిలి చెలగుచుమదిలో, నక్కోమలిన్నృపువిమెచ్చి ♦ యనియెను నాధా!
యుక్కువుల దానవులనని, జక్కాడందొల్లి మనము ♦ చనితిమికాదే 63

ఆయాహవమున మిక్కిలి, గాయంబులనడలుమీను ♦ కాయముగని, నే
తోయంబులార్చివి విధో, పాయంబుల సేదదీరు ♦ పగనైతిగదే 64

ఆకొలది నాదుసేవను, చేకొనిమది మెచ్చి మున్ను ♦ శీఘ్రిమ మీరల్
నాకొసగినవరయుగమును, నేకోరెద నిడుడు పేమ ♦ నిజముగనున్నన్ 65

వ. నావిని యయ్యవియేవియో తెలియంబల్కుమీ క్షణంబున నొన
ర్తునని మోహాంధుండై మీఁదెఱుంగక యనిన నక్కవల యే
క్షణ కువలయాధిపుంగని, 66

నాథా! వినుండు సీతా, నాథుని వనములకుఁబంపి ♦ నాసుతుఁదగ భూ
నాథుగ నొనరింపుండవి, రోధమ్ముగ నేలునట్లు రూఢిగ ♦ ననినన్ 67
హతమతియైపిడుగడచిన, గతిఁజతికిలబడుచుఁగూలె ♦ గ్రక్కున నృపుడున్
శ్రుతికంటకంబులై నిజ,సతిదుర్వాక్యములు చెవులఁ ♦ జట్టనదాకన్ 68

వ. మఱియు నట్లనివార్యమనో వ్యథాకులితస్వాంతుండై మూలంబు
దెగిన సాలంబువోలె నేలంగూలి భూపాలుండు మూర్ఛిల్లి
కొండొక వడికిందెలిసి, 69

'ఏలాగున నోరాడెనె?, యీలాగున రామచంద్రు ♦ నినకులతిలకున్
బాలామణి! నిర్దోషిని, బాలుని సుకుమారువనికి ♦ బంపుమనంగన్ 70
నిన్నెంతో భక్తిఁగొలుచును, నెన్నడునిజమాతవోలె ♦ నిట్టిసుగుణునిన్
పున్నెములప్రోకరామున్, చిన్నిగొమరునెట్లువీడఁ♦జిత్తంబొప్పెన్ ?71
పోనిమ్ము రాజ్యమును నీ, సూనునకేయిత్తు రాము ♦ సురుచిరకరుణన్
గానల బంపంగోరకు, మానిని! వేడ్కొండుగోరు ♦ మా!యిత్తువెసన్ 72
అనకైకయు నిజనాథుం,గని "యోనృప! యిట్లుకల్ల♦గానాడుట నీ
కనుచితముసూవె! బొంకం, జనునే? నినుబోటిరాజ♦చంద్రునకెందున్
ఏనొల్లనొండుకోర్కులఁ, గానలకారాముఁబంపి ♦ కావింపుము నా
సూనునరపతిగనటుకా, దేని చెపుమవిసముద్రావి♦యిదెమరణింతున్

వ. అనుటయు దశరథుండును, 75

ఔరౌర! ఎంతమోసం, బీరీతిగ నడుగునంచు ♦ నెన్నడుఁదలపన్
నారీస్వరూపరాక్షసి! నారాముని వీడుటెట్లొ ♦ నాబ్రతుకెటులో! 76

వ. అనుచు దూరపిల్లుచు నృపాలుం డొంటుకర్తవ్యం బెఱుంగక మేందఁకొను మహాదుఃఖభరంబున వెండియు మూర్ఛిల్లి యుండు నయ్యవసరమ్మున 77

తెలతెలవాఱెందూరుపు, వెలవెలనై తారలొప్పె ♦ వినువీధిఁదగన్
ఒంజలపిదల్చెగఱులం, బులుగులుగడువేగుచుక్క ♦ పొడిచెం బ్రాచిన్ 78

కుక్కుటములు సెలగెంగడు, నక్కజముగ గంధవాహుఁ ♦ డల్లనవీచెన్
బ్రక్కపసిబాలలాడిరి, యిక్కరణింధరణియొప్పె ♦ నెంతయునంతన్ 79

ఉదయాద్రి శిఖలఁదోచెను, పొదలెడికెంజాయలెంతొ ♦ బొంగిద్విజాళుల్
గదలెవనులంజొఱంగను, పొదపొదమని యుత్సవమున ♦ బొంగిరిపౌరుల్

వ. అంత నద్దివసంబునన శ్రీరామునకు పట్టాభిషేకంబు సేయంబడు నని నిర్దేశింపంబడియుంటయు, నయోధ్యాపురజనంబులు మీరిన వేడుకఁ జెలంగుచుండిరత్తరి, 81

ఒకవంక దూర్యనాదము, లొకవంకను భేరిఘోష ♦ లొక్కటఢక్కా
లొకవంక కాహళధ్వను, లకలంకతనొప్పెనగర ♦ మందెయ్యెడలన్ 82

అప్పురవీధులజల్లిరి, కప్పురమును సాంకవంబు ♦ కస్తురియుగరుల్
కుప్పలుగదెచ్చి పురజను, లొప్పుగ పన్నీటగలిపి ♦ యురుకుతుకమునన్

మనరాముఁడు రాజగునట,వినరేచెలులార! యనుచు ♦ వేడ్కఁ జెలగుచున్
గునగుననడచుచుగడువడి,జనుచుండిరిచెలులబిలువ ♦ చానలుమఱియున్

బంధుగుల బిలుచుచును మెయి, బొందుగనై సేసికొనుచు ♦ బురమేగంగా
సందడిబడుచునుమఱిమఱి, సుందరులు చరించిరెంతొ ♦ సొగసుగనంతన్

వ. అంతట పట్టాభిషేక ముహూర్తం బాసన్నంబు కావుడుం బురోహితుండగువశిష్ఠుండును, 86

దశరథుఁగాని తేఁబనిచెను, విశదమతిన్ చారునొకని ♦ వేజనివాడున్
కృశముఖుడై వచ్చియుమునీ,దిశగనియిటులచటివార్తదెలిపెనడలుచున్

అపధారు దేవ! మనభూధవు దుస్థితిఁ జెప్పఁజాలఁ ♦ దనువు నెఱుఁగకేఁ
పవిహతనగంబుకై వడి, భువిపడి పెనుమూర్ఛమున్గి ♦ పొలుపఱియుండెన్

అటులున్న బెగడునను, కపటమతిగని మనసు రాజ్ఞి ♦ కైకేయియుదా
"నిటుగొనిరమ్మా రాముని, పటుగతినీ" వనుచు ♦ పలికి పనిచెన్నన్నున్

అని చెప్పి యంత చారుడు, చనియెను శ్రీరాము కడకు ♦ జయ్యన నతనిన్
గొనిపోయెదుకొఱకైయిట, మునియును ప్రజశోకవార్ధి ♦ మునిగిరి పెలుచన్

వ. అంత విమలవదనవిజితచంద్రుండైన రామచంద్రుఁడు చారుని
వలన నాహూతుండై తత్క్షణము కదలిచని గురునాజ్ఞంగొని, పితృ
దర్శనాప్తిత్తోషంబునఁ దదుపద్రవ కారణగవేషణాభిలాషంబును,
జనకదురవస్థాహేతుభూతుండగు వానిపై రోషంబును ముప్పిరి
గొనంజని నిబిడచింతాక్రాంత చిత్తుండై మేనుమఱచియున్న
తండ్రిపదంబులకెఱఁగి తల్లికి కేల్మోడ్చి, 91

జననీ! ఏలాయిటు మజ్జనకుండున్నాఁడు! చెపుమ ♦ చయ్యననాతో
నొనగూర్తు నతనిపంపును, మనమునఁ గొంచింపకెందు ♦ మసలక నేఁడే 92

అటుగాక యితనికెగ్గులు. పటుగతి నొనరించిరేని ♦ పలుకుము వారిన్
చటులాసివిశిఖములనొక, త్రుటిలో నాసురలు మెచ్చ ♦ తెగటార్తునిదే 93

అదిగాక యున్న నాయెడ, నెదియేనిందప్పుగల్గు ♦ నెఱిఁగి జనకుడున్
కుదురుఁదొరంగెనొ, తనమది సదయత నెఱిఁగింపుమమ్మ ♦ జననిరొ నాకున్

అనుచున్న నృపతిప్రియునం, దనుగని కైకేయివల్కు ♦ తనయా! వినుమా
మును నాకు నీదు జనకుడు, కొనుమంచును నిడియె రెండు ♦ కోర్కులవానిన్ 95

వేఁకోరితి నిపుడయ్యవి, నాకొమరుం రాజుసేత ♦ నట్టడవులలో
నీకీరేడేండ్లునికిం, జేకూర్చుట, వాని వినుట ♦ చే నిల్లాయెన్ 96

వ. అనినవిని రాముండును చలింపక తల్లీ! యింతలకా జనకుండు వందు
రుట? నాకు నా ప్రియజనకునానతి నెఱవేర్చుటకన్న మిన్న యెన్న

డుంగలుగంబోదు. అదియునుంగాక నీవు నా పక్షం బించుక వహించి నన్ను దుర్భరరాజ్య మహాభారవహనంబునుండి దప్పించి మేలొనర్చితి విం కేమి కావలయును? నేనిప్పుడ కానలకుంబోవు చుంటిని జనకుమనంబు శాంతించుంగాక యనివారికి మ్రొక్కి, వెడలుటయు, 97

అందులకు కైకయుం దన, డెందంబొగి కళవహింప ♦ డిందఁటి యిక నే
సందియమందక సుతునకు, సందేశంబంపెఁ ద నదు♦జనకునిపురికిన్ 98

తదనంతర మారాముఁడు, కదలిచ నెన్ జననిసాధ్వి ♦ కౌసల్యగనన్
ఎదగడిదిదిట వెసంగగ, నెదురై సౌమిత్రి యచటి♦కే తెంచుటయున్ 99

చనిజననికినతులిడితా, నని నమ్మరో! కైకకిడియె ♦ నస్మజ్జనకుం
డొనరమును రెండువరముల, వినుమవి నేడామెఁగోర♦విభుడిచ్చె వెసన్

కావున నే పితృవాక్యము, గావగవని కేగ వలెసె ♦ గ్రక్కున నొకటన్
భూవిభుగ భరతు వేడ్కన్, గావించుటయొకట నిట్లు♦గాదగు వరముల్

అనతల్లడపడి శోకం,బున బెగ్గిలి "ఏర! నాదు ♦ ముద్దులతండ్రీ!
నినువిడిచి యెట్లుమని యెదగొనిపొమ్మర వెంటనన్ను గుణనిధి" యనుచున్

శోకిల్లు బెండువడు నా, హా! కైకా! యెంత సేసి ♦ తౌరా! యను, నో
భూకాంత! ఎందుడించితి,నీకరుణయు రాముమీఁది♦నీకూరిమియున్ 103

వ. అనియిట్లువగంబొగి లెడితల్లి నూరార్చువాడై రామచంద్రుండిట్లనియె

ఓయమ్మ! వలచింతిల, మాయయ్యకుఁ దిరుగరాదు♦మాటను గానన్
బోయెదవదు నా ల్గేండ్లును, నాయడవులనుండిమగుడ♦యతివెసవత్తున్ 105

వ. అనిమఱియు నోజననీ! నాకరణ్యంబునం దసుఖమ్మొండునుం గాన రాదేలనన, 106

వనములమితరమ్యంబులు, వనములు ఫలపుష్పవిమల♦వనశోభితముల్
వనములఖిలఖగమృగ ని, స్వనహృద్యములరయసాధు♦జన సేవితముల్

వ. కావున, 108

ఈయవనిభరతుఁడేలఁగ, నా యడవిని సాధుజనుల ♦ నర్చింతునొగిన్
ఈయవనీరాజ్యము,వన, మోయమ్మరో!నాకుఁజూడ♦నొకటిగఁదోచున్

కావున జననిరో! ధృతిగొని,భూవిభునాజనకునెపుడు♦బ్రోవుమ ప్రేమన్
నేవచ్చునంతదనుకను, నావలె నాభరతుఁగ్రైక♦నరయుమ నెమ్మిన్

అనిచెప్పెడి ప్రియనందను,ఘను గూర్మింగౌఁగిలించి ♦ కడుదీవనలన్
దనరనొసగి కౌసల్యయు, ననైనఘూసాధురతు ♦ననిశముగనుమా 111

వ. ఇట్లుదీవించు జననీరత్నంబు చరణంబులకెఱంగి మెఱుంగు
మోమున శాంతంబు తిరంబుగొన చిరునగవు చెంగలింప నటవీడి,

నయవినయోపేతయుసుగు,ణయుతయుధీసహితవితర♦ణగుణాన్వితయౌ
ప్రియురాలిసీతఁగనుగొన,రయగతిమైనంతిపురికి♦రాముడుచనియెన్ 113

ఈరీతింజని తనసతి, నారసి తగనచటి ♦ వృత్తమామూలముగా
ధీరత నెఱుంగ జెప్పుచు, నారమణికిననియె♦నిట్టు లారాముండున్ 114

ఇంతిరో! వినువనికే న,త్యంతము చనుచుంటి జనకు ♦ నానతివడి, నీ
వంతదనుక నుండుముచని, సంతసమున నీదుజనకు♦సదనమునందున్ 115

అమ్మాటలు వినినంతన, యమ్మానిని మ్రానుపడుచు ♦ నవనిం బడి వే
గమ్మునమూర్ఛమునుంగుచు,క్రమ్మర తెలివొందితనదుకాంతునకనియెన్

నాథా నాయనుగమనని, రోధంబది యేలనన్ను♦రూఢిగ నిటులన్
బోధింపక మీవెంట స,నాథనుగాఁగొంచుఁబొందు ♦ నావుడతండున్ 117

వనములమితభయదంబులు,వనితరో!కనరావుజనని ♦ వాసములెందున్
జనరాడట పూబోండ్లకు, ఘనకర్కశ కంటకాశ్మ ♦ కలితస్థలులన్ 118

వ. మఱియు, 119

కనరాదు చెలుల నటనుప, వనులన్ పక్వాన్నములను♦వరమంగళని
స్వనముల రుచిరార్థములను,వనితరో! వనికీ వురాగ ♦ వలచుట్టుచితమే

పలులాశబోరుక్రోల్పులు, తెలుగులుకోలములుమదపు టేనుగులుహరుల్
పలు తెగల చిలువగములుం, జెలగునటవినీకురాగ ♦ జెల్లునె చెప్పుమా 121

కాంతా! యిటు ఘోరములగు, కాంతారములకురాగఁ ♦ గడగుటదగునే
వంతంబొరయక యుండుము, సంతసముననీవు ♦ జనకు ♦ సదనమునందున్

అనవిని జానకియను "నో, ఘనగుణ! పతిచెంతనుండు ♦ కాంతకు కేళీ
వనములగు విపినసీమలు, కనుగొన పూతానుశిలలు ♦ కంటకవితతుల్ 123

వనసత్త్వములకు భీతిల, ననయముని బాహు దుర్గ ♦ మాధారముగా
నినవంశచంద్రమా! కా, దనక యగొని సొమ్ము ♦ కష్టమబ్బదు వనిలోన్

వ. మఱియు 125

ఈరీతిని జనిమీరలు, కారడవులఁ గ్రుమ్మఱంగ ♦ గనియును విని నే
నేరీతినుండు దానను, వారక చనినాడు ♦ కన్నవారలయింటన్ 126

సతికిన్ జనకుగృహమ్మున, పతిగృహమునఁ బుత్త్రునింట ♦ వాసము సెల్లున్
సతతము బాల్యంబుననం, చితయౌవనమందు ముదిమి ♦ జెందినయపుడున్

వెండియు విన్నపమొండువి, నుండిదె నేనిశ్చయముగ ♦ నుడి వెదనికనే
నుండంగజాలము విడి, దండిగ నర్పింతు మీ ♦ పదంబుల నసువుల్ 128

వ. అనియిట్లు దృఢమనోరథయైన నిజసతిం దోడుకొనియనుంగు సహచరుండైన సౌమిత్రియుం దన్ను వీడంజాలనని తోడరా వేడిన నాతనిం గూడికొని కౌసల్యా సుమిత్రలకు నమస్కరించి సెలవు గైకొని వశిష్ఠుం దర్శించి పురంబు నిర్గమింపం గడంగు తత్సమయంబున నవ్వివాదగాథయు ఝంఝానిలప్రచోదిత విలయానలంబువలె నెల్లం బురంబు వ్యాపించుటయు, 129

వ్యాకులచిత్తంబుల న,స్తోకంబగు నార్తి గొంతు ♦ శోషిల్లంగా
మూకలుగ గూడి పౌరులు, శోకించిరి రాముగూర్చి ♦ స్రుక్కుచు మఱియున్

రామునియందనుందనిలిన, వ్యామోహము బాయలేక ♦ పఱచుచును మహో
ద్దామగతి గదలిరవ్వాన, సీమల శ్రీరాము చెంత ♦ జేరి వసింపన్ 131

ఈవితమున చనుదెంచు పుర వాసిహితా ప్తచయ ప ♦ రీవృతుడై తా
దీవనలందుచు రాముడు, ధీవిలసితుడగు సుమంత్రు ♦ తేరున(జనుచున్ 132

కొందఱను బుజ్జగించును, కొందఱగని పల్కు మీరు ♦ కుందకుడనుచున్
కొందఱ నికచనుడను ని,ట్లందఱ సోదార్చుచుండు ♦ నాతండోలిన్ 133

134
వ. మఱియు దుఃఖితులగు పౌరులంగని రాముండును

ఏలా పౌరవరులు! మీ,రీలాగున చింతనొందు ♦ టిదిధర్మవె భూ
పాలకు వాక్యము నాకుం బా,లింపగవలదె! యార్య ♦ పద్ధతిగాదే

వినుడీ ప్రజలు తొలిభవముల, మనుజుడు దాజేయుకర్మ ♦ మానక దనచే
ననుభవనీయంబగు( గా, దనరాదల బ్రహ్మకైన నరయగజగతిన్ 136

నరునకిల( గష్టసుఖములు, వరుసన ప్రాప్తించు దాన ♦ వనటబడక దా
గరమలరక, నిజధర్మము, పరిరక్షింపంగవలయు ♦ బాగుగ గానన్ 137

వేవేగ మరలివత్తును, సేవింపుడంతదనుక ♦ చిరతరభక్తిన్
భూవిభుడు నాదు తమ్ముడు, నావానిన్ భరతు మీర ♦ లతిభక్తి మెయిన్ 138

139
వ. అనిన రామచంద్రునకుం బ్రజలిట్లనిరి.

వీడయ్యె తొలుత నిన్నని, బీడయ్యె నయోధ్య నీవు ♦ పెంపుగ విడుటన్
ఈడెవ్వరు నీకనఘా, పోడిమి వచ్చెదము గొంచు ♦ బొమ్మా మమ్మున్

141
వ. మఱియు

ఎచ్చోటన నీవుండెద, వచ్చో నెలకొనెడి శాంత ♦ మైశ్వర్యంబున్
హెచ్చగు ధర్మంబెల్లను, నచ్చోటన(జెల్లు జయము ♦ నభ్యుదయంబున్ 142

అనుటయు వారలయభిమతమును గొండొక యెఱిగి రాజముఖ్యుడు రాముం
డని యె సుమంత్రునకుం బ్రజ,గనుమూసిన పిదప తేరు( ♦ గడపు మటంచున్

ఆ రాము నాజ్ఞ చొప్పున, నారేయి సుమంత్రుడొప్ప ♦ నరదము గడపెన్
ఘోర గ్రావత్పృణాన్వృత, భూరాజిన్ బ్రజలు నిద్ర ♦ బోయిన వేళన్ 144

వేకువన లేచి పౌరులు, శ్రీకనమెయిరామ చంద్రు ♦ తేరుం గనమిన్
బీక చెడిబెగడుచుంబలు, పోకలనటునిటును వెదుక ♦ బోయిరి కడకన్ 145

వ. వారిట్లు బిట్టువెదకియు నారాచపట్టులు బాడకట్టమి నెట్టకేలకు దిట్టచెడి కట్టా! రాముండెట్టుకను బ్రామిపోవునే యంచు రెట్టించిన వంతన్ దురపిల్లి తొట్టతొరదకు దమ మనికిపట్టు తెరవుంబట్టి చనుటయు, 146

చనిచని కనియెం రాముండు, ఘనవీచిచయోత్తరంగ గంగ ♦ కలుషవిభంగన్
స్వనవిజిత వరమృదంగం, కనదుత్తుంగ జలపతంగ ♦ కరుణాసంగన్ 147

వ. అట్లు దర్శించిన, 148

గంగాతరంగిణియుదా, బొంగుచుం గానంగనయ్యె ♦ బూతచరితు రా
ముంగాంచికడిదిముదమొ, సగంగానటదమలవీచి ♦ కలంజెలగియటన్ 149

వ. ఇట్లు గంగానదిందరిసి, తేరుడిగ్గి సుమంత్రకృతాలింగనులై రామసౌమిత్రులాతనికిం బోననుజ్ఞయిడి గుహుండడనెడు వానివలనం బ్రక్షాళితపాదులై సీతాసమేతులై యాతని నావనెక్కి, 150

గంగంబరిచిత గిరిరా, డ్శృంగం బరిచలిత భృంగ ♦ సేవిత మదమా
తంగంగనుగొని శ్రీరఘుపుంగవులు తరించిరెంతొ ♦ పొంగుచుదానిన్ 151

వ. అట్లు గంగానదిందరియించి యవ్వలితీరం బారోహించిన 152

కననయ్యెనద్దరియుదా, గనులకు పెనుపండు వగుచుం ♦ గాననములతో
స్వనహసిత విపంచీస్వర, ఘనపతగకులంబుతోడ ♦ కకుబంతంబై 153

ఏయెడ గనుగొన శారిక లేయెడ గనుగొన్న శుకము ♦ లింపగు పికముల్
ఏయెడజూడమయూరము లేయెడగనబహుమృగాళి ♦ యింపుగ గనరాన్

వ. అవ్వానింగనుచు నవ్వనరామణీయకతకుం గడునలరుచు నచటి ప్రకృతివై చిత్ర్యంబులంగని యచ్చెరువందుచు, 155

నడచెను రాముండంతట, కుడియెడమల నడచుసతియు ♦ కూరిమి తమ్ముం
డెడనెడబ్రియములువలుకగ కడునలరుచు శాంత మెసగ కానలమటియున్

కుంజంబుల వనతరుసుమ, పుంజంబుల, వల్లికలను♦పొలుపగు నటవిన్
రంజిలుచుకనుంగొనిరఘు,కుంజరుడొగిచనియెనధిక♦కుతుకమున నటన్

రాముడనియెఁదమ్ముఁడ!యో, భామిని!కనుగొనుడివనవి♦భవములనెటులీ
భూములప్రశాంతియొసగెనో, యేమెయిభూతాళితృప్తినిట♦బొదలెడినో

అనిచనుచురాముడయ్యెడకనుగొనెబెక్కండ్రమునుల♦గందాశనులన్
వనవాటి కాంత నిర్మిత, ఘనపర్ణకుటీనివాస ♦ కలితమహిములన్ 159

వ. మఱియు నాయా మున్యాశ్రమంబులంగనుచు నయ్యయెడ, 160

కందంబుల నిర్మల మక,రందంబుల మూలములను ♦ రమ్యఫలములన్
డెందంబులుతనివింగడు, నొందగనాతిథ్యములను♦నొందిరివారున్ 161

వ. ఇట్లు నిఖిలవనవాసి జనసేవిత చరణసరసీరుహుండును, సరసీరుహా
ప్తాన్వయాంభోధి పూర్ణశరచ్చంద్రుండును, శరచ్చంద్రికోపమదర
హాస నవసుధాభాసురుండును, సురనారీమనోహరుండును, హరి
మధ్యుండును, మధ్యందిన చండమార్తాండ తేజోవిరాజమానుం
డును, మాననీయమహాగుణ విరాజితుండును, జితశాత్రవానీక
సంస్తూయమానామోఘశరలాఘవుండును నగు రాఘవుండు సతీసో
దర సహితుండై, 162

పాటవమెసగంజనిముని, కూటమునతిభయద సత్వ ♦ కోటి సమంచ
ద్ఘాటమునున్నతసద్గిరి, కూటమ్మంగనియె ♦ చిత్రకూటమునంతన్ 163

ఆశైలమ్మునముని సం,కాశుండై సాధువృత్తి ♦ గడిపెన్ దినముల్
ఆశాంతవిదితయశుడును, నాశాతీతుండురాముఁ ♦ డతిమోదమునన్

మఱియురఘురామచంద్రుడుమఱియుచుదనుచేరుమానిముఖ్యులకెల్లన్
దఱినెఱిగిస్వాదువాక్కుల, గఱపెన్సద్బోధ నిట్లు♦కరుణాత్ముండై 165

కర్మమునీశ్వర పరముగ, నర్మిలిజేయంగవలయు ♦ నటుగాకున్నన్
కర్మముభవకారణమై, నిర్మలమతులార! జెఱచు♦నిక్కమునరులన్ 166

మనుజులకును కర్మలవిడి, మనరాదిలపంచభూత ♦ మయదేహములన్
వినుడౌట నరునకీశ్వర, ఘనసేవా రతియవశ్య♦కామ్యముమఱియున్
అరయుడి మానివరులుమీ, రిరవుగ గావించుసేవ♦సేతుడుగానుచున్
వరశుభములిడుచుమిము దా,బరిరక్షణసేయుమీ క♦భయమగుదానన్
ధరసాధుచరణసేవా, నిరతులకుంబొందగల్గు ♦ నిశ్చలసత్వ
స్ఫురదమలరూపగుణు నీ, శ్వరునఘనచింత్యదివ్య♦వరధామునొగిన్

వ. అని కఱపుచు రామచంద్రుండును, 170

ఒకనాడు వేదగోష్ఠియు, నొకనాడు పురాణగోష్ఠి ♦ నొక్కదినమునన్
సకలాగమ సద్గోష్ఠియు, ప్రకటంబుగ నెరపెమునుల ♦ పజ్జనవేడ్కన్

వ. ఇట్లు ప్రశాంత చిత్తంబున సత్కథాకాలక్షేపంబులం బొద్దులు పుచ్చుచు లక్ష్మణుండు కందమూలఫలాదికంబుల సేకరించుకొని యనుదినంబును సమకూర్చుచునుండ వానివలన ఘనంబుగ మనంబున తృప్తినొందుచు సీతాసమేతుండై రామచంద్రుండుండుటయు నట నయోధ్యానగరంబున, 172

సంతోషంబననెఱుగరు, వంతంజెందుచునెయుంద్రు♦వారకయెపుడున్
కంతుసమానుడు రాముడు, సంతసమునఁగాన రామి♦జనులెల్లరటన్ 173

దంపతులు పెంపుదొఱగిరి, సంపదలందగులు విడిరి, సంసారు♦లొగిన్
దెంపరులగుచును ప్రజలును, సొంపెడలిరి రాముగనమి♦శోకాకులులై

వ. మఱియు 175

ఏయెడజూచిన చింతయ, యేయెడ గన్గొనినపీడ ♦ యెల్లెడభయముల్
బాయవయోధ్యనురాముడు, బాయుకతనపౌరజనము♦బాధలనొందన్

వ. ఇట్లు సంక్షుభిత ధర్మమార్గంబైన జగంబుకరణి నయోధ్యా పురంబు సొబగేది యుండుటయు, 177

పుత్రవియోగ విషాద ల,విత్రము నిజచిత్తవల్లి ♦ వేద్రుంపఁగదుఁ
గాత్రము శోషిలదశరథ, ధాత్రీపతియేడ్చె రాముఁ♦దలచుచునిటులన్

ఓరామ! సద్గుణాకర! సారభుజాంతర! విశాల ♦ సారసనయనా
చారుస్వరూప! ధృతియుత!, మారశుభాకార! రామ!మానితనామా!

నినుబోలనొరులకగునే, తనయా! ఘనవినయ!మాన్య♦తరసత్యనయా!
నినుఁగనకనిలుపనగునే,తనువునప్రాణములునాకు♦తనయా!మఱియున్

నీముద్దుమోముచందురు, నేమెయిగనుగొందురామ! ♦ యినవంశమణీ!
కోమలనీలశరీరా!, రామా! నాముద్దులయ్య! ♦ రావేలనురా! 181

నీశాంతము, నీధైర్యము, నీశక్తియు నీదునుక్తి ♦నీ భక్తిఁగనన్
యాశాంత విదితములు రా, కాశశిసమవదన! రామ! ♦ ఘనగుణసదనా!

వ. అనియిట్లు మఱియుం బెక్కుభంగుల రాముందలంచుచు రామ వియోగసంతాపంబు దుర్భరంబుగాగ; కౌసల్యాదికాంతాజనంబుం గని తనకుం దొల్లి మునిదంపతులచేతం దత్తంబైన శాప ప్రకారంబు నెఱింగించి కొంతవడికి నెల్లర శోకాబ్ధిముంచి ప్రభూత వేదనాభరంబునం గ్రుంగి శోకమయ భౌతిక దేహంబు నిర్గమించి కాకుత్స్థకులాధికుండు నాకంబుం జనుటయు, నటకైకేయి పుత్తెంచిన వార్తంగని భరతుండును శత్రుఘ్నసహితుండై, 183

కదలెనిజాప్తులగని, కడుముదమొప్పనయోధ్యకేగ♦ముదలంగొనుచున్
ఎదనెడనెడనొగితత్తర, మొదవగమాతామహుండు♦నొయ్యననుపన్

అట్టుఁజనుచు సొబగఱి తన,పట్టణమయ్యెదుటగానబడ ♦ నెడదవెసన్
బిట్టుబెగడి తనసారథి, కిట్టులనియె వింతభయము ♦ లిమ్ముగొనంగాన్

శ్రీకరమై తతనిఖిల శు,భాకరమై భాసమాన ♦ మా మాపురమీ
భీకరమైన వికారము, నేకతమున బొందెనొక్కొ♦యెఱిగింపగదే! 186

రాదుగదా! రుజతండ్రికి, పోదుగదా! ధర్మబుద్ధి ♦ పురిమనుజులకున్
రాదుగదా గృహకలహము, ఏదొకొకతమింక నగరనిటులుండుటకున్

ఈవింతరీతికిం గత,మానంతయు గానరాద ♦ యనియుదమన్నల్
ఏవంతలువాటిలెనో ప్ర,జావనితులకాప్తులైన♦జ్యాంతులకున్ 188

అనితలపోయుచు బెగడుచు, చనియార్తవినాదసౌఖ♦సహిత నయోధ్యన్
గనిరాజనగరుజొచ్చెను,జనపంమ్యుడుభరతుడంత♦సరభసగతితోన్ 189

వ. అట్లుచని కడచిన యెల్లవృత్తాంతంబును నచటివారిచే విని కడుం
గడు దురపిల్లి,యంతపర్యంతంబు తైలరక్షితంబుగ నున్నపితృకళే
బరమునకు గుర్వనుమతంబున దహనసంస్కారంబులు యథావిధి
నొనర్చి. తల్లికతంబున నన్నిసిలుగులు గలిగెనంచులకు విషాదపడి
పదంపడి నిజజననింగని క్రోధాతిరేకంబున, 190

మగనియుసురులంగొని వెడ,లగనడచితి రామునీత ♦ లక్ష్మణు వనికిన్
నగవక కరుణయు ధర్మము, దిగద్రావితి దుష్టురాల ♦ దిట్టగప్రజలున్

ఈరాజ్యము కావలెనని, కోరితివే? యెప్పుడేని ♦ కుటిలాత్మవునై
యారాముధర్మపరు నిటు,కారడవులపాలుసేయ ♦ గడగితివకటా! 192

నీచమతీ! యొరురాజ్యము, లాచికొనుచుకొమ్మటనగ ♦ లఘుబుద్ధినినై
యేచందమ్మునగొనుదని, యోచించితి చపలబుద్ధి♦నున్మత్తవునై 193

వ. అని యనేకప్రకారంబుల తల్లిని దూరుచు సర్వజన విచారా
వహంబైన యాపురంబునకు రాముని సత్వరంబుగ గొనితెచ్చి
క్రమ్మఱ ప్రజకానందం బొడగూర్పదలంచి, రామాన్వేషణార్థం
బుగాఁజని బంధుమిత్రామాత్య మాతృవర్గంబునుం బౌరముఖ్యులు
నుం దోడరా చతురంగబలసమేతుండై చనిచని గంగానదిందాటి
గుహప్రబోధితుండై గంగాదక్షిణ తటంబునం బయనంబుచేసి
యెట్టకేలకు చిత్రకూటాద్రిం దఱిసిచనుచు నొక్కచో, 194

చేతము దద్దరిల్లగనె, భూతలశయనున్ విభూతి♦భూషితు, శాంతున్
భూతనయానుజసహితున్, ఆతఱి శ్రీరామువల్క♦లాంచితు నెదుటన్

ఆరాముఁడు గనసయ్యెను, చాడస్మితవదనుఁడగుచు ♦ స్వాదువచనుఁడై
ధీరుండై ఘనభుజగం,భీరుండై, మానిచిత్త ♦ భీతిహరుండై 196

ఈకరణినుంటగన్గొని, వ్యాకులపాటొంది యున్న ♦ యనుగులబడి దా
శోకించెడియాభరతుం, జేకొనియూరార్చి ♦ ప్రేమ చెలువారంగన్ 197

రాముండనియెను; తమ్ముఁడ! సేమంబే నీకు ప్రజకు ♦ చెప్పుము సరగన్
ఆమయరహితుఁడె జనకుం, డీమెయి దుఃఖంబుబొంద ♦ నేటికి నీకున్ 198

అంతభరతుండు కొండొక, వంతయుడిగి రామునితోడ ♦ వచియించెనుభూ
కాంతునిమరణముగొలెవ్వ, త్రాంతముములుభంగి చెవులదగులగ నంతన్

రాముఁడునుజనకసుతయును సౌమిత్రియు ఘోర దుఃఖజలధిమునుఁగుచున్
భూమీశుండగు దశరథు, వేమాఱుఁదలంచుకొనుచు ♦ విలపించిరటన్

వ. అట్లు కొండకవడి విచారించి రాముండును తక్కిన బంధువర్గంబు
నూరడించువాఁడై వారిం గని 201

కుందకుఁడాత్మీయులు! మీ, రిందఱు భూనాథు దశర ♦ థేశ్వరుమృతికై
యొందాకకర్మఫలములు, బొందవలయునంతదనుక ♦ భువినరుఁడుండున్

కావున భువిమజ్జనకుఁడు, గావించె ననేకయజ్ఞ ♦ ఘనదానములన్
దేవతలుమెచ్చ ధర్మవు, ద్రోవక ప్రజనేలె నెల్ల ♦ రుం బ్రియమందన్

వ. అట్టి మహనీయ చరితుండై స్వర్గ మలంకరించిన జనకునికై
మనకు శోకింపంబనిలేదు. 204

ఆనృపమణికిం బ్రియమగు, సూనృతవచనైకదీక్ష ♦ సొంపుగఁగావన్
బూనగమనకుం దగదొకొ!, సూనులకున్ సకలలోక ♦ సుజనులుమెచ్చన్

వ. అని పలికిన యనంతరం బా రాజనందనులు నల్వురును నదికిం జని
విధివిహితంబుగ పితరునకు శ్రాద్ధతర్పణాదుల నాచరించి మఱలి
వచ్చిన భరతుండును రామచంద్రు చరణంబులం బడి, నిజమాతృ
కృతాపరాధంబు సైచి మన్నింపం బ్రార్థించి, సర్వజనాను

మోదంబుగ నయోధ్యకుం జనుదెంచి పట్టంబుగట్టికో గ్రార్థించిన
రామచంద్రుండును భరతునకిట్లనియె, 206

తండ్రినుడిమీఱు తనయుని, యెంద్రే సజ్జనుడటంచు ♦ ననునిజనంబుల్
తండ్రికిగానిసుతుండిల, గుండ్రాయనవగుచుబ్రతుకు♦గావనేమిటికిన్ 207

ఆడిననుడిమనుజులకుం, బాడియెదప్పంగ గాన ♦ మనకీయెడఁ గా
పాడవలయు పితృవాక్యము, కూడను నిచ్చిల్లుపలుక♦కొమరుడవౌటన్

వ. మఱియును 209

ధర్మాచరణమవశ్యము, నిర్మలమతి జూడనెల్ల ♦ నియతాత్ములకున్
ధర్మమె ప్రజరక్షించును, ధర్మముననె జగతినిలుచు♦తమ్ముడవింటే 210

ఏయెడ ధర్మమునిలుచును, నాయెడ దానుండుసతము ♦ నచ్యుతుఁడీశుం
డాయెడనె గల్గు నెప్పుడు, బాయక సద్యశముజయము♦బహులాభంబుల్

ధర్మాధర్మ విచక్షణ, కర్మములొనరించు ప్రజలు ♦ గ్రహింయింపవలెన్
ధర్మమెఱుంగక నడచిన, నిర్మల మతిఫలము జెంద♦నేరరు మూఢుల్ 212

అనుటయువినిభరతుండునుమనమున యోజించిరామమహీపునకనియెన్
వినునీవు వచ్చునందనుఁ కను,నందిగ్రామమందుఁ♦గడకవసింతున్ 213

వినుమఱియును శత్రుఘ్నుం, డనువుగ నీ పాదుకలను ♦ నర్చింపుచువే
జనెడునయోధ్యకుప్రతినిధి,గను నేనునునీదు రాకగనుచుందునటన్ 214

పదునాలుగేండ్ల మేరకు, సదయ ! యయోధ్యకునునీవు ♦ చను దేరనిచో
గుదిత్రోతునాదు కాయము, మదికొంచక నగ్నిలోన ♦ మఱువకుమన్నా

అనిన నటుల వచ్చెదనని, తనపాదుకలతఁడుగోర ♦ దయతోనిడివే
యనిపెను రాముండంతట,జనలోకస్తుత్యచరితు♦చయ్యనభరతున్ 216

వ. అట్లనుపుచు మఱల నొక్కపరి బందుగులంగనుచు 217

డిందకుడు మనములంగడు, సందియపడి బంధులార ♦ సరగున వత్తున్
పొందుగమీదీ వెనలం,బొందుదునటుగానఁజనుడి♦పురమునకిపుడే! 218

వ. అని తమ్మునుపుచున్నయన్నను, భువన మోహనుడైన రాము పిడిచన కాలాడకయు నెట్టకేలకు తదీయాదేశంబునంజననిశ్చ యించి రామసౌమిత్రులం గౌగలించుకొని సీతకున్మ్రొక్కి స్వజన పరివృతుండై భరతుండు పురోన్ముఖుండై చనుటయు, 219

ఆ శీ స్సు

ఈరామచరిత మిల నె, వ్వారలుపఠియింత్రుభక్తి ♦ వారల కగు సీ తారాముకరుణ ననవర, తారోగ్యాయుర్యశంబు ♦ లభ్యుదయంబుల్

కాండాంతము

విమలాంతరంగ! సంభృత, సుమనోర్చితదోః ప్రసంగ ♦ సురుచిరతరస త్కమనీయవరశుభాంగా, ప్రమదాహృత్స్ఫురదనంగ♦భవ్యనిషంగా

జలజసమమృదులచరణ!వి, మలతరజగదవనకరుణ ♦ మదరిపుహరణా కలితసురవినుతవితరణ!,సలలితరణవిమతహరణ ♦ సదయవిహరణా222

వరవిహిత సురాసుర నర, వరదాయక! దివ్యభక్త ♦ వాంఛితసంప త్కర!కాంతాజనదృక్సుమ,శర! సన్నుత! సుగుణసీమ! ♦జానకిరామా!

గద్య

ఇదిశ్రీమత్సీతారామచంద్ర సాంద్రకృపావిశేషప్రసాదిత
కవితావిశేష, సాధుజనసేవాపరాయణ, వినయ
ధురీణ, సేవితరామభద్రభక్త, వీరభద్రోక్త
శ్రీమత్కందరామాయణంబునందు
అ యో ధ్యా కా ం డ ము
సమాప్తము.



ఓం శ్రీ సద్గురుస్వామినేనమః

శ్రీ శ్రీ రాధాగోవింద భగవతేనమః

# శ్రీమత్సుందరరామాయణము

## ఆరణ్యకాండము



శ్రీమదినవంశజలనిధి,
సోమా! మహనీయనామ! • శుభగుణధామా!
హేమాద్రి సదృశధృతియుత!,
శ్యామాంగ శుభాభిరామ! • జానకిరామా! 1

వ. ఆకర్ణింపుమట్లు నిజబంధువర్గంబు ననునయించి యంపి, 2

కదలిచనె చిత్రకూటము, వదలుచు శ్రీరాముడంత • వనముల దిరుగన్
ముదమునతమ్ముడు సతియును, సదమలతరభక్తిసేవ • సలుపగ సంతన్

ఆ రాజసుందరుల ముద, మారంగని మధురగాన • మమర జెలంగెన్
కేరుచు వనీశకుంతము, లారసి మధుఫలములిడె • ద్రుమాళియునంతన్

మునుచనుచుపథముచక్కగనొనరించెను కంటకములనుపలశకలముల్
చనదోలి లక్ష్మణుండును, ఘనకార్ముకఘోషసత్వ • గణము నెగచుచున్

అయ్యెడ రాముడు నిజసతి, కొయ్యన కేలూతనిడుచు • నోదార్చుచొగిన్
నెయ్యంపుమాటలనొడువుచు, నయ్యటవీచిత్రతతుల • నరయించుచొగిన్

మృగపాళి లేపుజోపున్, ఖగపాళిన్ జూపు తేటిగమి • దారితరుల్
తెగనేయు రాముడిషుతతి, నెగచన సత్త్వములసీత • కింపుగ మఱియున్

అందందు విశ్రమించును, చందన తరుసారశీత • జలసేచనమున్
బొందు ఫలభోజనముఁగొను, పొందుగ లక్ష్మణుడు దేర • భూమిజతోడన్ 3

వ. మఱియు నయ్యెడ, 9

ఇంక దయసేయుఁడను వా, రెందేఁజననేల నిలుఁడి ♦ యిటననువారుఁ
విందుగొనుఁడి దయసేసి ప, సందుగ ననువారునటవి♦జానపదులటఁ 10

ఎనలేని కూర్మిగొలిచిరి, జనవల్లభరామచంద్రు ♦ సౌమిత్రిని భూ
తనయనపుడావనస్థులు, వనఫల మకరందకంద ♦ వస్తువితతులఁ 11

తలిరాకు బోఁడియగునా, లలనామణిసీతయొప్పె ♦ లలితగతిం దా
నలసతనొందకవిసువక, నలియక నిజనాథు వెంట♦నడచుటకలిమిఁ 12

అటుచనుచునొక్కరొక్కరి, నటకనుగొనెరాముఁడంత♦నమితతపోంచ
చ్చటులోద్యద్ఘన తేజుల,పటుకాయుల మునుల బఱిత♦పావనగుణులన్

ఆమానివర్యు లయ్యెడ, నీమమెసగ దీక్షఁబూని ♦ నియతాత్మకులై
కామాదిషట్కమణచిమహామహిమలతప మొనర్ప♦నరుదుగ గనుచుఁ

వ. మఱియు నాయామునుల యాశ్రమంబులంగనుంగొనుచు, దదర్పిత ఫలమూలాది సత్కారంబులం గొనుచు, వారివారి భయంబులుడుపుచు, ధైర్యంబులు గొలుపుచు, 15

తదనంతరమారాముఁడు, ముదమొప్పఁగగనియెనత్రి ♦ మునివర్యుసదా
హృదయాంతరస్థ శంకర, పదపద్మధ్యానధుర్యు ♦ భార్యాయుతునిఁ

అయ్యెడనమ్ముని సతియును, నెయ్యంబునకుంకుమంబు♦నెఱవగుననలఁ
నొయ్యనసీతకునిడి తా, నయ్యవి యెల్లపుడు వాడ♦వనినుడువుటయుఁ

ఆరాజదంపతులు దగ,నారాధించిరి మనంబు ♦ లందలి భక్తిన్
ధీరాజితుఁడగు నత్రిని, నారీతిలకంబు నతని ♦ నాతిని నంతఁ 18

రాముఁడుచనియెనుమహిమో,ద్దాముండై తపసివీడి ♦ తమ్ముఁడుసతియుఁ
బ్రేమగొలువంగ నవ్వన, సీమల పయనంబు సేయ♦జెలగుచునంతన్ 19

గిరిదరుల నిసుకతిన్నెల, తరుచయయుతనిబిడవిపిన ♦ తలములనోలిన్
అరయుచుచనె నొగి రాముఁడు,ధరణీసుతజూచివాని♦దద్దయు మెచ్చన్

వెండియు రాసుతులటఁజని, చండదరదసత్త్వకోటి ♦ చటులమ్ముమహో
ద్దండనిబిడ తరుషండము, దండక కాననము గనిరి ♦ తమకట్టెదుటన్ 21

అటఁజనియవ్వనిగాంచిరి, పటుఖగమృగఘోరసత్త్వ ♦ పన్నగముల సా
ర్భటులెసగఁదిరుగువానిన్, రటదళితతుముల ప్రసూన ♦ రమ్యతరువులన్

ఆదండకాటవీస్థలి, మోదంబునఁజొచ్చి రాజ ♦ ముఖ్యులు చనుచోన్
గోదండగుణధ్వని దివి, భేదిల్లగఁ జేసిరసుర ♦ బృందము బెగడన్ 23

అత్తరితద్ధ్వని విని కడు, చిత్తంబుగలంగివారిఁ ♦ జెనకన్ జనె దా
నుత్తుంగ భుజుఁడు క్రూరుఁడు, మత్తుండు విరాధుఁడనఁగ ♦ మనుజాశనుఁడున్

అయ్యెడనారక్కసుఁగని, యయ్యవనితనయ బెగడ ♦ నారఘువీరుల్
చయ్యనవానింగూల్చిరి, యయ్యటవింగల్గుమును ల ♦ హోయని మెచ్చన్

వ. మఱియు నట్లు పలలాశిం బిలుకుమార్చి యారాజవీరులేగుచో 26

ఉగ్రాటవిఁ దిరుగాడెను, నగ్రేసరుఁడగుచు విల్లు ♦ నమ్ములుగొనుచున్
అగ్రజుఁగావఁగ లక్ష్మణుఁ డుగ్రగతిన్ సత్త్వసంఘ ♦ ముఱుకుచు బాఱన్ 27

వ. అత్తెఱంగునం జనుచు మధ్యమార్గస్థాశ్రమావాస మునిజన ప్రబో
ధితులై కదలిచనుచు కతిపయది వసంబులకు దండకాటవీ మధ్య
స్థంబగు నగస్త్యాశ్రమ ప్రాంతంబుం దరిసి చనుచు, 28

అప్పృథివీశసుతాగ్రణు, లప్పట్టున గనిరి ఖగమృ ♦ గావళినెల్లన్
జొప్పడిన మైత్రి, నెలమిని, నెప్పుడు ఫలియించు తరుల ♦ నెంతయునరిదిన్

వెండియు గనుగొనిరట నా, దండినృపులు తత్ప్రదేశ ♦ తాపసులందున్
మెండుకొను నాత్మతేజము, నిండు స్వధర్మాస్థచిత్త ♦ నిగ్రహశక్తిన్ 30

వ. ఇట్లు కనుంగొని యగస్త్యాశ్రమాంగణంబు సొచ్చిన, 31

అమ్ముని చంద్రుండంతట, నెమ్మన మలరంగ చనియ ♦ నేకవిధములన్
అమ్ముగురఁ బూజఁజేసెను, నమ్మన నెలకొన్న భక్తి ♦ నయయుక్తిఁగజన్

ఆరాజచంద్రులకు ముని, కోరికఁదానిచ్చెదివ్య ♦ కోదండములన్
ఘోరాస్త్రవితతి బల్ తూ, ణీరమ్ములనక్షయాస్త్ర ♦ నివహమ్ములతోన్ 33

అమ్మునిదంపతులకును,ము దమ్మొసగన్నతులొనర్చి ♦ దాశరథులు లో
నిమ్ముగొనుభక్తినంతట, సమ్మోదమునఁ బంచవటికిఁ ♦ జనిరయ్యెడలన్

ఆపంచవటీప్రాంతపు, శోభంగని చనుచుగాంచి ♦ రినకులవరులు
ద్దీపిత పూతమహోదక, పాపఘ్నను గౌతమీసరి ♦ నంతిన్ జెంతన్ 35

ఆగౌతమీమహానది, దాఁగానగనయ్యె సురభి ♦ తరుగుల్మలతాం
తాగారవిపులతీరము, వేగచలచ్ఛీకరమ్ము ♦ విమలోదకమై 36

అప్పుణ్య నదీజలముల, నప్పృథ్వీశాత్మజాతు ♦ లాడిరి తాసం
బుప్పొంగుచుఁ దత్తీరపు, టొప్పగుపులినములదిరుగు ♦ చొయ్యనవారున్

అచ్చోజనుచో నొకచో ట, చ్చెరువడగనిరివటము ♦ లై దిటి నొకటన్
పచ్చికబయళ్ళపొంతను, హెచ్చగునొకసరసిచెంత ♦ నింపు దలిర్పన్ 38

అప్పట్టు తమదుమనికికిఁ, జొప్పడగలదంచు నెఱిగి ♦ సౌరిదికుటీరం
బొప్పుగ నిర్మింపంగను, నప్పనిగొనెలక్ష్మణుండు ♦ నగ్రజునొద్దన్ 39

అంచితగతినాచోటును, పంచవటీ క్షేత్రమనగ ♦ బఱగి ప్రజలకున్
మించెంబూజ్యంబై సుగు, ణాంచితుడగురామచంద్రు ♦ డందునిలుచుటన్

వ, అనంతరం బప్పంచవటీధామంబునం బర్ణకుటీరావాసులై సీతారామ
లక్ష్మణులుండుటయు, 41

ఆ రాఘవ దంపతులట, గారా మొప్పంగనట్లు ♦ కాపురముంటన్
ధీరతఁజెలంగి రచ్చటి, సారతపోధనులు నైన ♦ సన్మునులెల్లన్ 42

ఆ సీతా సాధ్వీమణి, భాసిల్లెన్ గరము నిత్య ♦ పతిపదసేవా
భ్యాసార్జితసౌశీల్య మ, హాసుగుణాంబోధియగుచు ♦ నలరుచు మఱియున్

వీడదు నిలయము, పతికెదు, రాడదుయతినతిథిసాధు ♦ నభ్యాగతుఁబో
నాడదుమితభాషను విడ, నాడదుసంతతము జనకు ♦ నాత్మజపేర్మిన్ 44

పతికన్నమున్న లేచునుఁ, పతిహితమే యరయునెపుడు ♦ పరభాషణముల్
మతిదలప దెన్నడును ధీ, యుతయై కార్యములుసలుపు ♦ నుర్వీసుతయున్

చిలుకలనంచలనెమిళుల, కలకంఠంబులను బెంచి ♦ కడుబోషించున్
తలిరుంబోడినిజాంగణ, తలమున నుద్యానరమ్య♦తరులత లందున్ 46

చెలులుతలిమములుసురుచిర, కలమాన్నము లేవటంచుగలగదుమదిలో
నలరునిజనాథుసద్మశ, మిలనిల్చి వెలుంగుననుచు ♦ సంతియు సంతన్ 47

ఆ సీతారాములకట, బాసెందిన మొక్కగడియ ♦ భంగిని పరమో
ల్లాస ప్రియభాషల సవి, లాసక్రీడలను కరము♦లాలనగతులన్ 48

కందంబులె మృష్టాన్నము, చందంబై యొప్పభూమి ♦ జారాములకున్
పొందగువేదులెహర్మ్యము, లందనరెన్దర్భశయ్య♦లమ్యోదలిమముల్ 49

వలచినసతి వలచినపతి, యిల గలిగిరె కేమివలయు ♦ నెన్నగ సీతా
లల నా రాఘవ దంపతు, లలరిరి యిష్టాప్తిదుష్టులై ♦ గడు నంతన్ 50

అరుదుగఁగనుగొనవచ్చిరి, నరభక్షకు లచటివారు ♦ నానాడును కే
సరిసదృశభయదతేజుల, దరదాయతదివ్యబాణ ♦ ధరులన్నరులన్ 51

వ. అట్లుగనుంగొనుచుదాదావులందిరుగువారింగాంచి లక్ష్మణుండును,
బాణములనుబెడిదపు సిం, గాణుల ఖడ్గములనెపుడు ♦ గైకొని నిశలన్
ప్రాణసము రాము రక్ష, శ్శ్రేణివలన బాధతొలఁగ♦జేయుచునుండెన్ 53

అంతట నిలహేమంతం, బెంతయు చనుదెంచి ప్రజల♦నేచగడగ దు
ర్దాంతప్రశీతబాధల, వంత యతులు వటులు పేద ♦ వారుంగుందన్ 54

ఆ సీతున కా రఘుపతి, గాసింబొందకయ వెలగు ♦ ఘనలావణ్యో
ల్లాసినిజసతికుచాంగణవాసియగుచుఁబీతువాసి♦వఱలుచుమఱియున్ 55

ఆ సౌమిత్రియు నవ్వలి, గా సిల్లండెపుడు భ్రాతృ ♦ ఘనపదసేవా
భ్యాసార్జితఘనతేజుం, డై సతతబ్రహ్మచారి ♦ యైభాసురుడై 56

ఈ రీతినుండ రక్షో, నారియొకతు చుప్పనాతి ♦ నానెసగెడిదా
ధీరాత్ము రాముగనఁజని, కోరెం దమిదన్ను బొంద ♦ కోమలిరూపై 57

కోరిన గని రాముడు తన, చేరువ నున్నట్టి యనుజు ♦ జేరనఁ జనియా
శూరుండద్ది. నిశాచర, నారియనుచు దాని చెవులు♦ నాసిక గోయన్ 58

రోషమున శూర్పణఖసని, ఘోషింపుచు జెప్పి పంపె♦ ఘోరాకృతులన్
దూషణుడు ఖరుడు మున్నగు, దోషాచరవరుల నధిక♦ దోర్బలయుతులన్

పంచినవారుం జని శర, సంచయముల బూని కడిది♦ సాహసు లగుచున్
పంచాస్యాయుతఘనబలు, గాంచక శ్రీరాముడాయ♦ గొనకొనునంతన్ 60

రాఘవుడు తీవ్రతరశర, లాఘవుడై ఘోరసువేగి ♦ లంఘించు క్రియన్
మేఘసమగర్జనముల న, మోఘాయతబాణవృష్టి♦ ముంచెనసురులన్ 61

ఆ రామచంద్రుతోడను, పోరంగను శక్తి లేమిఁ ♦ బోరిరపారినసురుల్
పోరిరి ఖరుడును దూషణు, డా రణమున నిహతులగుట♦ నతిభయగతులై

అనుచరులగు నా రక్కసు, లనిఁ బడఁగ శూర్పణఖయు ♦ నతికోపమునన్
జనియెన్ లంకకు వేగమ, తనదుస్థితి రావణునకుఁ ♦ దగ వినిపింపన్ 63

వ. అట్లు చని తనయన్నం గని, 64

ఓయన్న కంటె రాసుతు, లాయడవిం గలుగువార, లదయులు నన్నున్
నీ యనుజ నింతగై కొన, రీయెడను బరాభవింతు ♦ రిదిగంటివా కో 65

ముక్కడసి కర్ణములు చెడి, యెక్కరణిం బ్రతుకనేర్తు ♦ నీయిల్లు నేనో
రక్కసి తేడా నీవా, యుక్కివుల మదంబు నణప ♦ నూహింపని చోన్

అని వెండియు నతనికి ననె, వినుమో యసురేశ నాదు ♦ విన్నప మొంటిన్
ఇనకులు లా రాకొమరులు, ఘనసత్వులు కలరు దండ ♦ కాటవి వారున్ 67

త్రుంచిరి ఖరాదివీరుల, నంచిత భుజశక్తి మునిజ♦ నావనరతి రా
త్రించరవిభు రాసుతు లిటు, ముంచిరి నీయశము లోతు, మున్నిటనిటుల్

ఆ రాకొమరుల యొద్దన, నారీమణి యొర్తు గలదు ♦ నమ్ముము భువిలో
లేరా మెసాటి యువతులు, ఔరా! యేమనగవచ్చు♦ నా యమ సొబగున్ 69

చెలిహాసమ్ము వెన్నెల మఱి, ములికికలికిచూపు నాతి ♦ మోవితలిరుకెం
పలవియెయొన్నగసతిచే, తొలకరి మెఱుపతివ మోముతో వరాయందుర్

ఆనాతిలేని నరుసిరి, యానారీమణిని గూడ ♦ నతని పరువముర్
పోనాడకేల సౌరభ, హీనసుమముపోలె వ్యర్థ ♦ మే యగుగాదే   71

నావుతుసోదరి మెచ్చుచు, రావణుడాక్షణమ దివ్య ♦ రయగతిగల మేల్
మావులగట్టిన తేరున, భావజశరసహాసు డగుచు ♦ పయనంబయ్యెన్   72

వ. అట్లు చనిచని చిరపరిచితుండగు మారీచుకడకేగి నిజాంతర్గతసీతాపహరణోద్దేశంబెఱింగించి తనకు సహాయంబు కమ్మనిన నాతండును భీతుండై,   73

ఈచెడుగుబుద్ధినీకేల, తో చెనాయసురేంద్రదీని ♦ ద్రోయుము రామున్
రాచకుమారుడు నరుడని, యోచింపకుమతడు త్రిజగ ♦ దుద్ధర్తసుమీ   74

మున్నెఱుగవా దనుజాధిప, విన్నాడవుగావా రాము ♦ విక్రమలీలల్
మున్నొకట ననుసుబాహుని, పిన్నటనాడే సెగూల ♦ బేరమ్ములతోన్   75

అన్నన్న మనకు జనరా, దన్నరపుంగవునిపాలి ♦ కసురాంతకుడౌ
టన్నెఱిగియు చెడనేటికి, మొన్ననె ఖరదూషణుల స ♦ మూలముమాపెన్

మఱియొకటివినుము రావణ, యరయంగా నన్యసతి, న ♦ నన్యాసక్తన్
కరముబలగరిమ దెచ్చిన, దఱుగునిజాయుష్యమశుభ ♦ తతియగుమీదన్

వలవనిసతిసౌందర్యము, వలననొ్మోహితుడునగుచు ♦ వాంఛించిన యా
పలువకగుపాట్లు బ్రహ్మకు, నలవియె వర్ణింపలోక ♦ మందెయ్యెడలన్ 78

అనుటయు రావణుడుగ్రతే, గనలుచు మారీచుజంప ♦ గమకించుటయున్
వినిమొద నీదగుపంపును, వినిపింపుము వేగమనిన ♦ విని రావణుడున్   79

పంచవటినున్న రాముని, వంచింపుచు వానిభార్య ♦ వనితామణి వే
గొంచక లంకకు తేవలె, కాంచనమృగమగుచు నీవు ♦ గడు వెసజనుమా

నావిని స్వర్ణమృగంబై, ప్రావీణ్యంబెసగ పంచ ♦ వటికరిగి యటన్
ధీవిలసితుడగు రాముని, దేవిగనగ నెదుటనొప్పె ♦ దిరుగుచునంతన్ 81

కుప్పించు నెగురు వలగొను, దప్పక జానకినిగాంచు ♦ దలగున్ బండన్
అప్పుడ లేచుక సవుగొను, నొప్పులకుప్పొంచు లేడి ♦ యొడలితళుకుతోన్

వ. అంత

అద్దానిఁదనకుఁ దెమ్మని, ముద్దుమగనిఁగోరెసీత ♦ ముగుదయునగుటన్
గ్రద్దనరాముడుచనెతన, ముద్దియకుంగూర్చుమృగము♦ముదమున దేరన్

వ. మఱియునట్లు చనునయ్యెడ లక్ష్మణుండును నయ్యది మాయామృగంబుకానోపునని సకారణంబుగ నెఱింగించినను, నుడుగక నాతనిం బర్ణశాలకడనుండుమని. 85

సతికోర్కె ద్రోయజాలక, మతిమంతుడు రాఘవుండు మార్గణధరుడై
యతిదూరమరిగి వేసరి, ధృతిమెఱయఁగ నొక్కకోల♦దీవ్రత నేయన్ 86

'హా సౌమిత్రి' యటంచును, 'హా సీతా' యనుచునఱచి♦యసురాకృతితో
బాసెనసువులనుహరిణము, గాసింబడి రాముశరము♦ఘనముగ నాటన్ 87

వ. అంతనట సీతామహాదేవియు, 88

ఆయాక్రందమువిని పతి, నేయెడరులొపొందెననుచు ♦ నెద్దడలకి వెసన్
సాయపడ మఱిదిబొమ్మనె, నాయెడనిజనాథునొద్ద♦కతివేగమునన్ 89

వ. అట్లనిన లక్ష్మణుండును సనక, 90

ఓయమ్మ యేలభీతిల, మాయన్నకు నెందుచేటు ♦ మహిఁగల్గదు సు
మ్మాయా క్రందనమసురుని, మాయాకృతమంతెకాని♦మఱియన్యంబే

నావుడు లక్ష్మణునెడ దు, ర్భావము శంకించిరాము ♦ భార్యయునన్నో
ధీవర నీవేగకనా, కీవిధి దెల్పుటకు కతము ♦ నెఱిగితి నేనున్ 92

ఆయెడ రాజ్యముగొని వని, ద్రోయించెను భరతుడన్న♦ధూర్తత నీవున్
నీయగ్రజు డటనీల్గిన, నీయనువున నన్నుగొంచు ♦ నేగఁదలంతే? 93

అనుచాలక్ష్మణునిం గను, జనకజనిష్ఠురములాడ ♦ జట్టన నతడున్
జనెనాత్మకన్నతులిడి, వినుమమ్మరో! పర్ణశాల♦వీడకు మనుచున్ 94

అనియతఁడు సనిన వెనుకను, జనుదెంచెను రావణుండు ♦ జనకజఁ గొనిపో
మునినాథువోలె నెంతయు, ననుమానంబొదవనీని ♦ యాకృతితోడన్ 95

ఆతపసి రాక గన్గొని, సీతయు నతిభక్తి లేచి ♦ చేమోడ్చి యనెన్
ఓతపసి! వర్యయస్మ, చ్చేతోవిభుడిపుడు సుఖమె ♦ చెప్పుమ వేగన్ 96

నావిని యతడును భామిని, నీవిభునకు హానికలుగ ♦ నేరనియటులన్
దీవించెద మికభిక్షం, గావింపుమటన్న సీత ♦ గడుభక్తిమెయిన్ 97

వ. కందమూలఫలంబులం దెచ్చి యక్కుహనామానికి సవినయమ్ముగా భిక్షనిడు నయ్యవసరమ్మున, 98

దశమస్తకములమఱియును, దశమకుటంబులను ఘోర ♦ దర్శను డగుచున్
దశముఖుడు గానబడ భయ, వశయై ధరణిజయు గూలె ♦ వసుధాస్థలిపై

వ. అట్లు నేలంబడి మూర్ఛిల్లిన ధరణిజ పరమపతివ్రతామణి గావున రావణుండు డగ్గఱంజాలక నాయమపడియున్న భూభాగంబును గడ్డతో నెత్తి మాయాకల్పితజవంబగు రథంబున నిడికొని వాయుమార్గంబున నేగుచున్నంత గొంతదవ్వేగుసరికి విగతమూర్ఛావస్థయై,

విలపించె రాముభార్యయు, నెలుగెత్తి మహార్తిమనము ♦ నెఱియింపగ నా
ఖలుడైన రావణుడుద, న్నలఘుగతిం గొంచు వేగ ♦ నరిగెడు ననుచున్ 101

అనివిలపించుచు మఱి యి, ట్లను "భూజములార ఖగమృ ♦ గావళులారా!
ననుసీతనసుర దొంగిలి, గొనిపోయెడినాదుభర్తకుం ♦ జెప్పరొకో" 102

వ. అని పెల్లాక్రందనంబు సేయుచు నసురునరదంబున నంబరవీధిం జనుచుండ, 103

ఆయార్తరవము వించు జ, టాయువు నా పక్షియొకడ ♦ టకు జనిరక్షో
నాయకు నెదిర్చియాతని, కాయమునొవ్వంగఁ జేసె ♦ ఘననఖఘాతులన్

వలయాకృతి దిరుగాడును, బలగతిరివ్వనను వాలుఁ ♦ బదనఖఘాతులన్
దలదన్ని మకుటమెడపును చలమూనిజటాయువసురుజయ్యనబోరెన్ 105

అటుపెద్ద ప్రొద్దుదా నుత్కటభీషణ రోషగరిమఁ ♦ గడుఁబోరితుదన్
చటులాసురఖడ్గాహతి, పటలదళితపక్షుడగుచుఁ ♦ బడెఖగవరుడున్ 106

తదనంతర మారావణు, డదయతగొని చనియెవేగ ♦ నవని తనయన్
చదలు తెరవునను మిక్కిలి, మదిసంతసపడుచునధికమదయుతుఁడగుచున్

వ. తత్సమయంబుననటలక్ష్మణుండును రా ముంగూడంజని డగ్గఱిన,

తల్లడిలె రామచంద్రుం, డల్లన సౌమిత్రిగనిన ♦ యంతన తనదా
వల్లభ కేయిడుమలువా, టిల్లెనొయయ్యడవినంచు ♦ డెందమునందున్ 109
వ. అట్లు తల్లడమంది తమ్ముంగని తమ్మిచెలివంగడపు మానికంబైన
రాముండిట్లనియె. 110

ఏకతమున నిట్టుతమ్ముడ, యేకతమున సీతడించి ♦ యే తెంచితిటుల్
భీకరదనుజ మృగాకుల, మీకానన మన్నమాట ♦ యెఱుఁగవె నీవున్

నావినికడచినవృత్తం, బావంతయు గొఱతయిడక ♦ నన్నకుఁదెలుపన్
ఆవీరుడనుజుఁ డూఘుక, వేవేగమ చనియె సీత ♦ వీక్షింపంగాన్ 112

చని పర్ణశాలనెందున, జనకాత్మజ గానరామిఁ ♦ జకితుండగుచున్
ఇనవంశవరుడు రాముం, డెనలేని విషాదవార్ధి ♦ కెదురొచుమఱిన్ 113

ఇటనటగను నిజసతికై, యటమటపడు రామచంద్రు ♦ డగ్గలపు వెతన్

కటకటయనువిధిదూరును యెటుబోయితె సతియటంచు నేడుచు మఱియున్

భువిచూచు నరయు బెగడున్, దివిజూచు గలంగు నెడద ♦ దిటవఱికుందున్
అవిరతగతి యోచించును, రవికులమణిసీతకై వి ♦ రాళింజెందున్ 115

అంతటలక్ష్మణుడును దా, నంతకు కతమంచు దలచి ♦ యమిత విచారా
క్రాంతహృదంతరుడయియత్యంతముదుఃఖించెవదినెకై ధృతిసడలన్

వ. మఱియు శోకవిహ్వలుండైన రాముండును. 117

సీతా! యెందేగితె! భూ, జాతా! యెట దాగియుంటె! ♦ సరగున రావే!
యోతలిరుబోడి! నినువిడి, చేతనమెటు నిలుపగలనె ♦ చెప్పుము యేనున్

అని పర్ణశాలనల్లడ, గనుపరిసరగహనసీమ ♦ గనియరయుమటఁ
వనిసీయాయెడ నెమకుచు, జనునను జునితోడ రామ ♦ చంద్రుడుసతికై 119

రాముడనుజన్మతోనిటు, భూమిజ వెదుకంగబూని ♦ పోరిపోరిజనుచుఁ గ్రూ
భీమశరాసనుఁడై వన, భూముల నెల్లెడల వెదుక ♦ బోవుచు నెదుటన్ 120

వీక్షించె రాముడంతట, పక్షీంద్రునిశాచరాసి ♦ భంజితపక్షున్
శిక్షితదేవవిపక్షున్, దాక్షిణ్యగుణై కదీక్షు ♦ దగనొకచోటఁ 121

వ. అట్లుగని యాతడు నొక పక్షిరూపుననున్న రక్కసుండేయని, యేయంజని, యరయుటయ మంచిదని, చేరంజని, యాతండాత్మ పితరునకనుంగు నెచ్చెలియగు జటాయువని నుడువుటన్విని, యాతనివలన నసురాపహృత సీతావృత్తాంతంబుం దెలిసికొని, తత్కృత మహోపకృతికిన్మెచ్చి, తదవస్థకునొచ్చి, తద్వక్షంబు నఁగ్రుచ్చియున్న యలుగుంబుచ్చిన నతండునుపంచత్వంబునొంద, నమంద చింతాక్రాంత హృదంతరులై. తదీయ కళేబరంబునకుం బ్రేతసంస్కారంబు లొనర్చి. క్రమ్మర సీతాన్వేషణోద్యుక్తులై యథాపూర్వంబుగ నేగుచు, 122

అట జనిచనిరాసుతుల, య్యటవింగని రసురునొకని ♦ నాయతబాహుఁ
పటుఘోషణవనమృగఖగపటలమహాభయదునటక ♦ బంధాఖ్యు నొగిన్

గనియతని దీర్ఘబాహుల, ఘననిశిత కృపాణధార ♦ ఖండింపగదా
మునుపటి రూపైతగన, మ్మనుజాశనుడనియెనిట్లు ♦ మానవపతికిఁ 124

ఓ రామచంద్ర! వినుమిటు,లీరదుగుచు గాంతురొక్క ♦ యెడ సుగ్రీవా
ఖ్యారాజితు కపివరునిను, భూరిగతిన్ గొల్చితోడు ♦ పొనరుచువానిఁ

అనవుడు నమ్మనుజాధిప, తనుజాతులు సంతసించి ♦ తద్దయువేడ్కఁ
జనుచగనుచుండిరయ్యె, వనభూముల సీతజాడ ♦ వలనుగనంతన్ 126

వీరాగ్రణులినకులమణు, లారసి రటజనుచు నొకట ♦ నబ్జకుముద క
హ్లార మనోజ్ఞము ఘనవాః, పూరము పంపాసరంబు ♦ పుణ్యజలంబుఁ

ఆపంపాసరసీతటి, భూపసుతులు విడిసిగనిరి♦ భూరిముదమునన్
ఏపారుపతగ భృంగ, వ్యాపారవిహారరమ్య♦వనరుహచయమున్ 128

ఎల్లెడల నల్లిబిల్లిగ, నల్లుకొనిన సుమలతాళి♦ నటఫలతరులన్
సల్లాపసుముఖఖగచయ, ముల్లాసముగూర్చె నృపకు♦లోత్తములకటన్

అయ్యో, రఘురామునకు, దానయ్యెడచిత్తప్రశాంతి♦యలవడదట హె
చ్చయ్యె విరహార్తి కూరిమి, తొయ్యలినెడబాయుకతన♦దోరంపువెతన్

శుకకోకిలగీతంబులు, వికలస్వనమయ్యె విరులు ♦ వెలవెలబారెన్
పికవాణి కుసుమకోమలి, వికచాంబుజనేత్రసీత♦వెలియగుట నటన్ 131

అచ్చోటరామునింగని, ముచ్చటపడి శబరినాగ ♦ పుణ్యవ్రత దాఁ
దెచ్చెవరమధుఫలంబుల, చెచ్చెర శ్రీరామచంద్రు♦సేవించుటకున్ 132

గొనివచ్చియొసగి రాముని, ఘనపమువిలకెఱగియతని♦గనియెనవిభునిన్
మునువింటిమునులుసెప్పగ, గనిధన్యతగంటినేడు♦కనులలరంగన్ 133

నినువినుట, నిన్నుబలుకుట, నినుదలచుట నీదుకొలువు♦నీదాసులతో
ననవరతవాసమివి నా, కనఘాదయసేయగదె మ ♦ దభ్యర్థితముల్ 134

అనివేడునామెగనుగొని, యినకులవర్ధనుడు రాము♦డింపుగ ననెనో
వనవాసిని! నీసేవకు, మనమలరెన్ శుభముబొందు♦మామత్సేవన్ 135

అనిమఱియును రాముండనె, వినుమతివా నాదుసేవ♦విదళించునుదా
ఘనకర్మబంధనంబుల, జనులకు నిహపరమహార్థ♦సాధకమగుచున్ 136

కులగుణవిభేదమఱయను, సలలిత తత్త్వమాన♦సస్థితభక్తిన్
ఎలమిగనుగొందు బాహ్యము, వలనన్ మోసంబుజెందు♦వాడనెయవ్వా!

ధరసాధుసుజనసేవా, పరులకుమత్సేవజేయు ♦ పద్ధతిదెలియున్
వరమత్సేవారతమతి, దొరగున్ దాపత్రయంబు♦దురితౌఘంబున్ 138

ఆకో, పూవో, ఫలమో, లేకున్నజలంబొ, భక్తి ♦ లీనమదాప్రుల్
తేకువనెదియర్పించిన, చేకొందును మేర్పనుచుఁ♦జెలగుచుదానిన్ 139

నిరతముతమమదినిలుపుచు, పరముంగా నెఱిఁగి నన్ను ♦ భజియించెడియా
వరభక్తులకును వశుఁడగ,, జరియింతు భరింతు వారి ♦ సర్వభరంబున్
ననుఁ దెలియఁజాలవీయిల, ధనమునుసత్కులమువిద్య ♦ తపముల్ ప్రభుతల్
ఘనకర్మచయము జ్ఞానం,బును కేవల భక్తిపోలె ♦ ముదితరో! ప్రజకున్

వ. అని యిట్లామె కించుక భక్తితత్త్వమహత్త్వం బెఱింగించి యామె వలనంబూజనంబులంది గడుం బ్రమోదించి యామెననుగ్రహించిన శబరియు, కృతజ్ఞులై దివ్యమనోజ్ఞ మూర్తులగు నారామసౌమిత్రు లంగని, 142

అనఘాత్మ ఋష్యమూకము,గనుగొందురుమీరలింక ♦ గడు వేసన చటన్
ఘనుడగుసుగ్రీవుడుమీ,కనువొప్పగ సాయమొసగు ♦ ననిమఱియని యొన్
ఆసుగ్రీవుఁడుసద్గుణ, భాసురశీలుండు కీశ ♦ బలవిభుడతి వి
శ్వాసి,యుదారుడు తాఁగడు, గాసిల్లెడి వాలిదుండ ♦ గములకులోనై
ఆలముననోడి తనయి, ల్లాలిని నగ్రజుడుగొంచు ♦ నఱుగంగఁగడుం
జేలగతిఋష్యమూకము, పాలయ్యెనుసఖులుదాను ♦ భయగతిగొనన్
ఆవీరుని సాయంబున, రావణుగెలువంగవచ్చు ♦ రయగతి సీతన్
దేవచ్చు గాననెయ్యము,గావింపుండతనితోడఁ ♦ గ్రన్నన ననుడున్ 145
తమకట్లు హితమొనర్చుటఁ దమసతిబొందంగగలుగు ♦ తగు వెఱవునొగిన్
దమకెఱిగించుటయును భూ,రమణుడలరె శబరి కంత ♦ రంగమునందున్
ఆరాజసుతులునంతట, ఘోరవనోన్ముఖులునగుచు ♦ క్రమ్మరిరి వేసన్
నారీమణి సీతకునై,వారని దుఃఖాగ్నికరము ♦ వనరుచు వెలుఁచన్ 147

ఆశీస్సు

ఈరామచరిత మిల నె, వ్వారలుపఠియింత్రుభక్తి ♦ వారల కగు సీ
తారాముకరుణ ననవర,తారోగ్యాయుర్యశంబు ♦ లభ్యుదయంబుల్

## కాండాంతము

వేదాంతవేద్య త్రిజగ, న్మోదావహ దివ్యచరిత ♦ మునివంద్యమహా
సాదరసద్గుణ సహిత న, రాదాంతక కదనసీమ!♦రాజితనామా! 148

ఆజానుబాహు యుగళ! పి, రాజితకమనీయ వక్ష! ♦ రంజితపక్షా!
రాజాభరుచిరవదనా! పూజిత పరసుగుణధామ ♦ భువిజాకామా! 149

కరుణాంతరంగరంగ, ద్గిరిగహ నవిహారకీర ♦ ధీరార్చితస
చ్చరణాబ్జయుగళ గళని,స్సరదంభోవాహనినద♦శాత్రవభయదా 150

### గద్య

ఇది శ్రీమత్సీతారామచంద్ర సాంద్రకృపావిశేషప్రసాదిత
కవితావిశేష, సాధుజనసేవాపరాయణ, వినయ
ధురీణ, సేవితరామభద్రభక్త, వీరభద్రోక్త
శ్రీమత్కందరామాయణంబునందు
ఆరణ్యకాండము
సమాప్తము.



ఓం శ్రీ సద్గురుస్వామి నేనమః

శ్రీ శ్రీ రాధాగోవింద భగవతేనమః

# శ్రీమత్కందరామాయణము

## కిష్కింధాకాండము



శ్రీ రమ్య రూపజిత సుమ
నారాచ! మహీశవ్రాళి ♦ నవ్యమణీకో
టీరాజిత పదయుగళా!
స్మేరాంచిత సుముఖసీమ! ♦ సీతారామా! 1

అవధారు దేవ రఘువరు, లవనిజ నెచ్చోటగాన ♦ కరిగిరి భయదా
టవులంజొచ్చుచు నెమకుచు వివిధగతుల దిరుగుచెందు ♦ వేసరక వెసన్

గహనాంతరములఁ గొండల, గుహలంగాసారతటుల ♦ గురుతరభూమీ
రుహముల వెదకంజొచ్చిరి, బహువిధముల సీతకొఱకు ♦ బాయనికడకన్ 3

వ. మఱియు వెదకుచు నెడనెడ నెడందం గడింది దుఃఖంబెరియింప
సొంపరి రాఘవుండును, 4

ఎక్కడిది సీత నాకిక, యెక్కరణిం బొందనేర్తు ♦ నెయ్యది గతి నా
కెక్కడ గననగు జానకి, యెక్కడి యాడియాసలకట ♦ యీశ్వర! యనుచున్

హా! యీవియోగవేదన, నేయుపునబుత్తు నొక్కొ ♦ యెత్తెఱగున నా
కాయవనిజ గననౌనో, తోయలి లేక బ్రదుకుటెట్లో ♦ తోచదు కట్టా 6

ఏయెడకుఁ జనియెనొక్కొ తా, నేయెడ ననుగానకెట్లు ♦ లెద దలకెడినో
ఏయసురవాతఁబడెనొక్కొ, తోయలతాపర్ణశాల ♦ దొలగిన వెనుకన్ 7

అనిపలు తెఱంగుల మఱిమఱి, వనరుచునున్నట్టి రామ ♦ వసుధేశు గనుం
గొని సౌమిత్రియు నిట్లనె, ననునయనయవాక్యఫణితి ♦ నతిధృతి మెఱయన్

తిరుగుదము వనమునల్లడ నరుగునవె ఋష్యమూకమను ♦ నగమునకున్
ఎఱుగుదము సీతజాడల, దఱుగుద మరిజనుల తలల ♦ దర్పంబడగన్ 9

గాలింతము నిక్కల్లడఁ, దూలింతము దానవులను ♦ దోర్బల మెసగన్
జాలింతె మెల్లహరికులను, దేలింతము హర్ష జలధి ♦ దివ్యుల నెల్లన్ 10

వ. అనుచు నొండొరులు ధైర్యంబులు గొలుపుకొనుచు, 11

వీరల్ రాముఁడు లక్ష్మణుఁ, డా కాననఁ జరుచుఁగని ♦ యభయదమృగా
నీరముదివిజసతిబి,బ్బోకము నమ్మునాటి ఋష్య♦మూకమునంతన్ 12

వ. కనియొకింత ధృతింగొని, 13

అన్నగమున్నుడాయంజను,చున్నంగని యచటనున్న ♦ సుగ్రీవుండున్
గ్రన్నన రామునిగని తన,యన్నయె పుటుఁబని చెవారి♦ననిదలచి వెసన్

వారలవృత్తాంతముఁ దగ,నారసిరమ్మనుచు బంచె♦నయవినయగుణో
దారుం జలనిధిసమగం,భీరుం గపుధీరుపవను పే ♦ రిమికొమరున్ 15

పంచినఁ జనియయ్యనిలజు,డంచితవాచాని ♦ రూఢి నతిభక్తిని నా
పంచాస్త్ర సమశరీరులఁ,గంచు బలికెన్నిల్లు కేలు♦గవమోడ్చి వెసన్ 16

ఓపుణ్యాత్ములు ! మీరిటు, లేపనినవచ్చినార ♦ లెయ్యది మీకుం
గాపురపు బట్టొదెలుపరె, యేపుణ్యాక్షరములొప్పు ♦ నిలమీ పేళ్ళన్

అనుచు కేల్మోడ్చి హనుమయు, వినతుండై పలుక రామ♦విభునాజ్ఞ వెస
న్గొని సౌమిత్రియునిట్లని, వినిచెం దమచరిత నతని ♦ వీనులుదనియన్

ఓకపివర! వినుమీతడు, కాకుత్థ్సకులోద్భవాగ్ర ♦ గణ్యు దశరథ
క్ష్మాకాంతసుతాగ్రణి జగ,దేక పరాక్రముడు రాము♦ డేలక్ష్మణుడన్

జనకునినుడి చెల్లింపగ; జనకాముడు రాముడడవి♦జనియుండుటయున్
జనకాత్మజ నాతనిసతిఁ, గొనిపోయెను రావణుండు ♦ క్రూరతనంతన్

ఆయమ నెమకుచుఁజనుచుజ,టాయువునాపక్షి నొక్క♦డంగంటిమి మా
కాయాప్తుండు వచింపగ, నీయెడ కరుదెంచి నార♦మిట్ల వెదకుటకై 21

నావుడువారింగనుగొని, పావనియిట్లనియె లోక♦పావనుల మిమున్
మావిభుడగు సుగ్రీవుడు, సేవింపగ నిచ్చఁజేసి ♦ చెచ్చెరనిపుడున్ 22

ధీరత నను గ స వ్ర స,మీరాత్మజునని చె కూర్మి♦మీరగ గానన్
మీరఱు డెందమున నిక కనుఁగోఁ, దారులు! మాఋష్యమూక♦ధామంబునకున్

అనవల్లెయంచు నారా, ట్తనయులు సనిరంతవాయు♦తనయునితోడన్
మనములలర సుగ్రీవుని, గని నేస్తము సలుపలోన♦గడకొను వేడ్కన్ 24

వ. అట్లుసని యక్కపివరు చేతం బూజనంబులంది యాతనితోడం గొండొకతడ వన్యోన్య కుశల సంభాషణంబులు నడపుచుండు నత్తరి, 25

సుగ్రీవుడెఱింగించె ని, జాగ్రజుడౌ వాలి దుర్ణ♦యంబుల విని రా
జాగ్రణి రాముండనిఘ మ,హోగ్రత నవ్వాలి ద్రుంప♦నూనిన వేడ్కన్

తలఁగుము భయమీఁ వెదనిక, ఖలుఁడగు నవ్వాలి నాదు♦ఘన శరఘాతం
బుల ద్రెళ్లనేసి ద్రుంచెద, నలఘుగతిన్ సురలు మెచ్చ♦నర్కజ యనినన్

వాలి మహాబలి పోరఁగొన, బోలుదువో యనెడికించ♦బోడ మెడి నెద నా
కోలంగొని శ్రీరాముడు, సాలము లేడింటిగూల్చె♦చటుకున నొకటన్

వ. మఱియు నయ్యెడంగల, దుందుభి మహాకాయంబు నంఘ్రిఘాతంబున బహుయోజన దూర సముద్ధూతంబు గావించుటయు, 29

అదిగని సుగ్రీవుఁడు తన, మదిశంకను వీడి రాము♦మదరిపుభీమున్
హృదిమెచ్చుచ తనికోమల, పదపద్మమ్ములకు నెఱిగి♦ప్రణుతించె నిటుల్

రామా! కోమల శరద, శ్యామాంగ! మహాత్మ! నిఖిల♦సాధు శరణ్యా!
ధీమహిత! నిన్నుఁ బొగడెద, నీమెయి నీమహిత శక్తి ♦ నెఱిగితి నేడున్ 31

కదనమున రిపులఁ బోరిగొన, సదయత భువి సాధుజనుల♦సంతతి గావన్
ఉదయించినట్టి పూజ్యుడ, వదిరా! నీమహిమలెన్న♦నలవియెనాకున్ 32

ధీరుండ! వఖిల జగదా, ధారుండవు! రణవిదళి త♦దర్పిత రిపుదో
స్సారుండ! వాదిదేవుడ, వౌరా! నీమహిమలెన్న♦నజునితరంబే! 33

వ. అని యనేక ప్రకారంబుల నుతించిన సుగ్రీవుందిగిచి భువన మంగళకరంబగు కరంబున నిమిరి, భయంబువాపి ప్రియంబుసూపిన నతండును, 34

తరియించెనాదుజన్మము,కరమరుదగుమీదు మోము♦గనుగొనుకతనన్
ధరణీశచంద్ర! మీరిటు, లరుదెంచుటకుం గతంబు♦నానతియీరే! 35

నావుడు రాఘవుడనియెను, నావనచరవిభుని గనుచు ♦ "నర్క.జయస్మ
ద్దేవిని గొనిచనియెను దా, కావరమున రావణుండు♦ కాలము" దతియన్

వినుదండకాటవిం బ్రోలి. జనకాజ్ఞ వసించియుండ♦నరగుసజని మా
వనజాక్షి సీత దొంగిలె, ఘనదుర్మదు డతనిజంప♦గావలదె యనిన్ 37

కావున నానుడి వినుమిదే, యావాలింద్రుంచి యిత్తు♦నతనిపురమునీ
కావల నాకుందోడ్పడ, గావలయును నీవు భృత్య♦గణములతోడన్ 38

వ. అని యానతిచ్చిన మెచ్చి రఘుస్వామికిం బ్రణమిల్లి తొల్లి తనకుం దివినుండి పడి లభియించిన సీత యాభరణంబుల మూటం గొని తెచ్చి రామునికిచ్చిన, 39

ఆభూషణములగని వగ, నాభూమీశాత్మజాతు♦లందిరి యందున్
ఆభూసుతకై రాముడు, దాభూరి వియోగబాధ♦దార్కొననంతన్ 40

నిట్టూర్పుబుచ్చు సీతా! యెట్టుంటివె యసురునింట♦ నిడుమలబడుచున్
కట్టా!యీవిధిజేసెనె, కట్టడిదైవంబు విధిని ♦ గాదనదరమే 41

అనివంతంబొరయుచుం దా,గనునయ్యాభూషణముల♦గనుమంచునుదా
ననుజన్మునకుంజూపును, పనివడి రాముండు తనదు ♦ భామినినగలన్

ఇవెయందె లివియెగజ్జియ,లివెకంకణయుగములివియె♦యుంతిసరమ్ముల్
ఇవెరత్నహారములుగను,మివెతమ్ముడసీతభూష♦లిన్నియుననుచున్ 43

ఆరాముడు సుగ్రీవుని, నారసి గారామెసంగ♦ననె విను మనఘా
యేరీతి భూషలిచ్చితి, వారీతిన సీత జూప ♦ నర్హుడవీవున్ 44

వ. అని సుగ్రీవుం దీవించి వాలితోడ రణంబు సేయం బుత్తెంచి దానును దక్కంగల వానరవీరుల తోడం గదలి యనుజ సహితుండై యయ్యెడకుం బయనంబు సేయుటయు, 45

సుగ్రీవు డొక్కత్రుటి జని, యగ్రజు నవ్వాలిఁబిలిచె ♦ నధిక బలోత్సా
హోగ్రాహ్వాతేజుఁడగుచు మ,హోగ్రాహవకేళిసలుప ♦ నుత్సుకుఁడగుచున్

తనుబిలిచినంత వాలియు, చనఁబూనె పురంబు వెడలి ♦ చటులబలోద్య
ద్ఘన తేజుండయి యార్చుచు, ననితమ్మునిఁ జంపఁబూని ♦ యతిభయదుండై

వ. అంతన య్యెడ నవ్వాలి రభసంబుం గాంచి కించిద్దుర్నిమిత్తభీతయై యతని దార యగు తారయు వాలి కడ్డంబై, 48

ఆశ్లేశ నిన్ను బోటి మ,హాత్ములకుం దగునె యాజి ♦ ననుజుం జంపన్
[illegible]ంచిన ననుజుఁ[illegible], నాత్మజుఁడొక పాటిగారె ♦ యార్యులకెందున్

[illegible]త్తనగ పదవీ,కలిత మదచ్ఛన్న జనుల ♦ కలుషచరితులన్
[illegible]మెత్తురె పెద్దలు దా, రలఘు పరాక్రముల కిదియు ♦ నరయందగదే

ఇటులామె చెప్పిన నుశ్రుతి,పుటములఁ జేర్పకయె జనియె ♦ బోరిబోరి ననికిన్
[illegible]సంభ్రమమున వాలియు, పటుగతి కిష్కింధ వీడి ♦ బలగతి నంతన్ 51

ఆకపిసోదరులటు [illegible], స్వీకం [illegible]కొనుటగనుచు ♦ వింటం గొని యి
క్ష్వాకుకులాగ్రణి తానొక, మ్రాకున మాటుం డెవారి ♦ ప్రథనము గనుచున్

వ. తత్సమయంబున, 53

కుప్పింతురు తలపడు నెడ, దప్పింతురు శత్రుహతుల ♦ దర్పం బెసగన్
నొప్పింతు రెదిరి నొండొరు, లొప్పింతురు ప్రేక్షకుల నో ♦ హో యన మఱియున్

అడిదములబూని కొండొక, వడి బెడిదపు గదల కొంత ♦ వట్టును మఱియున్
బిడుగుల కెనయగు శిలలం, గడిమి నొక్క కొంతవట్టు ♦ గడగిరి పోరన్

వ. తదవసరంబున వెండియు, 56

క్రిందగు నువ్వాలి యొక్కెడ, క్రిందం బడు నర్కసూతి ♦ ఖిన్నత బొందున్
ఖుందున సహాయతం దమ, డెందంబులు నాప్తు లెల్ల ♦ డిందు వడంగాన్ 57

వ. మఱియు నయ్యెడ సుగ్రీవుండును, 58

వహ్వాయనవాలిడీకొను,విహ్వాలుఁడై భూమిబడును♦ వెతఁబడుమఱియున్
జిహ్వాతడియారరోజును,గహ్వరములుమారుమ్రోయు♦గాఢాహతులన్

అరుదైనవారి బవరము, మఱపించెను రాము మేను♦మఱువనతనికిన్
ఎఱిగించెవాయుజుఁడు ఖర,కరునందనుగావుమనుచు♦కడుదైన్యమునన్

జాలిగొని యార్తరక్షణ, శీలుడు రాముండు వింటి♦ జేకొని ఘనమౌ
కోలగొనిదూలనేసెను, వాలిన్ నయశాలి సతత♦నందితశూలిన్ 61

వ. తదనంతరంబ, 62

అనితరశౌర్యుఁడువాలియు,ననితలమునఁబడుటగాంచి♦యత్యాతురతన్
జనియెరఘురాముడనుజ,న్మనిగూడుకవాలిజూడ♦మునుకొనువేడ్కన్

వ. అంత, 64

ఆరాముధృతశరాసను, ధీరతఁ గనుగొంచు వాలి♦ తెలిసెనతడ తన్
గ్రూరాస్త్రపతితుజేసిన, వీరాగ్రణి యనుచు ఘోర♦వీక్షణుడగుచున్

చూచుచుఁ గొలంది నెడందను, నేచిన పెనుకినుక రోష♦మినుమడికా బెం
ద్రాచుక్రియరోజుచును శా,ఖాచరవల్లభుడు రాము♦గని యిట్లనియెన్

ఎవ్వండవోరి నీచా! యివ్వనిలోదాగి బాణ♦మేసితి వౌరా!
యివ్విధము ధర్మమగునే, క్రొవ్వుండిన నెదిరి పోరి♦కూల్పగరాదే 67

నాకనులబడకయుంటివి, లేకున్నను నింత కిలను♦లేకుందు వహో!
వీకననుడాసితేనియు, భీకరగతి నీదుశిరము♦భిన్నముగాదే! 68

ననుడాగియేయుకతనన, గననయ్యెను జగతి నీదు♦కడిమియు నాదౌ
ఘనసత్త్వగరిమ వగవం, బనిలేదికనాకు దీని♦పట్టున నాగన్ 69

రామవిభుడనియె వినుమో,రీమర్కట వీర దుశ్చ♦రితులఁ దునిమి యీ
భూమిని ధర్మము నిలిపెదు, భూమీశుఁడ రామనామ♦భూరివిభవుడన్

నిను మొఱగియేయు కారణ,మునువినునీయట్టిదుష్ట♦మూర్ఖమృగమ్మున్
ననుబోటిభూమిపతి వం, చనమ్మున మాటుండి కూల్పఁ జన దేనివ్వున్

అనుజన్ముఁబట్టి మోదితి, వనుజ సమంబైన యట్టి♦యాతని యాలిన్
గొని యతని పురము వెడలం, గనునడచితి విట్టిక్రూర♦కర్ముఁడు కలఁడే?
దీనావనవ్రతుండను, నే నందున నీదు తమ్ము♦నెమ్మిం గావన్
బూనితి నీవును మన్నితి, తానూనశరాన దెగుట♦నందెదు ముక్తిన్ 73

వ. నావుడు లోకమనోభిరాముండగు రాముసరళవచనసరణిం దెలిసిశర వేదనకునోర్వలసి, శిరంబువంచి, కరంబులు దోయిలించి ధీరగుణ శాలివాలి యిట్లనియె.

రామా! మ్రొక్కెద జగదభి, రామా! శుభనామ! శౌర్య♦రంజితభీమా!
నీమహిమ నెఱుఁగఁగలిగితి, నో మహనీయాత్మ! శరము♦నూడఁదివియవే 75

వ. అని మఱియు,

వగవ శరహతుడనౌటకు, వగవం దేహంబువిడువ♦వలయుటకును నే
వగవ నిలదారవిడుటకు, వగతున్ నాయనుగుసుతుని♦బాయుటకును నై

కావున మహాత్మ! రామా, కావుము నాకూర్మితనయుఁ♦గడునయగుణసు
శ్రీవిభవునంగదాఖ్యున్, నీవశ మొనరించుచుంటి♦నేడు మొదలుగన్ 78

వ. అన రాఘవేశ్వరుండును, పరివృత్తసతీసుతసన్నిహితాప్తమిత్రుండగువానరేశ్వరు వాలింగని నిజబాంధవ సమక్షంబున నతని నూరడించి, తద్వాంఛితంబు ననుగ్రహించి, అసమానతదీయశౌర్యంబు నగ్గడించి, శరంబు నెడద వెడలించిన నవ్వానరశ్రేష్ఠుండును నశ్వరంబగు భౌతికశరీరంబు విడిచి శాశ్వతంబగు మోక్షము నొందఁ జనుటయు, 79

వెతబడిరి వాలికై తత్సుతుడును, సతియును హితాళి♦సోదరుఁడుఁ గడున్
మితిలేని శోకభరమునఁ, జతికిలబడి వాలిసుగుణ♦చయము దలచుచున్

అత్తరి రాముడు వారల, చిత్తవిషాదార్తితమము♦ఛేదింప సమా
యత్తపడి వారికిట్లనె, జొత్తిలిన విరాగవచన♦శోభ చెలంగన్ 81

ఏలాయిటు శోకిలెదరు, వాలికొఱకు మీరలెల♦వనచరులారా
చాలగ నచ్చెరువయ్యెడి, నీలీల ఖిముంగనంగ♦నెంతయు నాకున్ 82

దేహమున కేడ్చుచుంటిరో, దేహికొఱకు నేడ్చువారో ♦ తెలుపుడిమీ
దేహియు దేహపు బేధము,నూహయొనర్పంగ నెంతొ ♦ యొప్పగుజుండీ.

దేహియనగజీవుడు పలు, దేహంబులదాల్చుకతన ♦ దేహియనబరుగ్
దేహియెనిత్యుడుపూజ్యుడు, దేహమునశ్వరముదీనిదెలియుడిమఱియున్

జీవుండు కర్మవశుండై, తావొరయును దేహములను ♦ తద్దయు పీడున్
ఈవిధి పరిభ్రమించుచు, వేవిధముల పుట్టిచచ్చి ♦ వేసరుమఱియుగ్ 85

ఎవ్వడు జ్ఞానాగ్నింగొని, యివ్వసుధంగర్మవనిద ♦ హింపగనోపున్
అవ్వానిఁబొందినిచ్చలు,నివ్వటిలుగ్ భక్తిమార్గ ♦ నిధియరయంగాన్ 86

జ్ఞానమెుగిగలుగు నతని క,నూనస్థితి పూర్వపుణ్య ♦ నూతనప్రజ్ఞా
ధీనిధియగు నెవ్వాడిల, దానం బరతత్వరక్తి ♦ దనరునుమఱియున్ 87

పుట్టెడునప్పుడ గల్గెను, గిట్టుటయును జీవులకును ♦ కెడయనివారల్
పుట్టిరె యిలనెపుడైనను, గట్టిగ యోచింప,కాల ♦ గతి యిదిగాదే 88

వాలియు మద్ఘన శరని,ర్మూలిత నిజపాపు డగుచు ♦ మోక్షశ్రీ సం
లాలితుడై చనియెడి సుర,నాళీకముఖీవిలాస ♦ నవ్యోదయుఁడై 89

వ. అని పలుతెరంగుల బోధగఱపి వాలిబాంధవుల నూరడించి సుగ్రీవుంగని భ్రాతృశవదహన సంస్కారంబొనర్ప ననుజ్ఞయిడి, యంగదు నాదరించి గౌరవించె ననంతరంబ, 90

ఏపునరవిసుతుఁగిష్కింధాపురికిని రాజుఁజేయఁ ♦ దమ్మునిఁబంపెన్
భూపకులై కలలాముఁడు, భూపుత్రీకాముఁడంత ♦ భూరిముదమునన్

రవిసుతునకు రవికులజున, కవిరళభక్తిని నివాళు ♦ లర్పించిరొగిగ్
తవిలివనేచర కాంతలు, వివిధగతుల నగర మొప్పె ♦ వేడుకనంతగ్ 92

వ. ఏతన్మహోత్సవానంతరంబ మగుడంజని సుమిత్రాసుత సుగ్రీవులు రాముచరణసన్నిధి నంజలిగావించిన, రాముండును వారలదీవించి సఖ్యంబుజూపి సుగ్రీవుంగని, 93

పరిపూర్తియయ్యెనానెడి, వరగతి నీకిష్టమెలఁ ♦ బాపితినాపగ్
నెరపవలె నీసహాయము, ధరణీసుతఁదెచ్చుగార్య ♦ తత్పరమతివై 94

వ. నావుడు మహాప్రసాదంబని సుగ్రీవుండును రామున కిట్లనియె.
"మహాత్మా! వానకాలం బాసన్నంబయ్యెడి నియ్యది యేగు
వెంటనే సీతాన్వేషణంబవశ్యం బాచరణీయం బింతకునాపై
భారంబు నిడుండు తావక చరణసేవారతీజనితామోఘసత్వాల
మైన మాకు నశక్యంబెందుగలదు! చతుర్దశ భువనంబుల నెందుం
డినను వెదకి భువనమాతయగు సీతందెచ్చి భవచ్చరణ సన్నిధి
నర్పించుకొనంగలవాడ నావుడు లెస్సయని రామచంద్రుండును 95

పొమ్మిక సుగ్రీవా! గ్రై, కొమ్మిక నీరాజ్యరమను ♦ కోమలినోలిన్
రమ్మేమఱక శరత్సను, యమ్మున నీవిటకు నతిర♦యమ్మునననగన్ 96

చనియెనతండునునతులిడి, చనెగాంబోలునునిదాఘసమయము దానున్
ఎనలేని జవముతోడుత, పెనుగాలులు వీచె పెద్ద♦పెట్టుననంతన్ 97

దుమ్మెగసె వారిదాకృతి, దిమ్మెకలిగెవాయుఘోష♦దిటముగ చెవులన్
క్రిమ్మెనిను మొయిలుచిహ్నములిమ్మెయివర్షాగమంబు నెంతయుజూపెన్

ఆయదనుగనుంగొని రఘునాయకులునుమాల్యవంత♦ నగరాజునొగిన్
డాయంజనుదెంచిరట సా, ఖ్యాయతనస్థితినివాన ♦ కాలముగడపన్ 99

వ. తదనంతరంబున, 100

ఉరుముల ఫెళ ఫెళలొక్కెడ మెఱుములతళతళ♦లునొక్కెమొయిలునుఁబీధిన్
పఱతెంచె వారివాహము, లరుదై కార్మబ్బుగ్రమ్మె♦నత్తరిమఱియున్ 101

భేకములు సెలగె కృషికా, నీకంబులు బొంగెనేల ♦ నెఱియ లడంగెన్
భీకరవర్షమువడె విను, వాకయెయటుధారగూర్చి ♦ వర్షించెనోనా 102

వారిదములుగర్జించెను, వారితమయ్యెను నిదాఘ♦వహ్నియు వసుధన్
భోరునజడివానగురిసె, భూరితటాకములునిండె♦బొంగెనునదులున్ 103

ఆతపతాప కృశంబులు, నౌతరు లాతఱిని పెక్కు♦లలరెన్ వర్షా
పాతసమాగతప్రాణో, పేతములై యెలయెడల ♦ పెంపుగనంతన్ 104

వ. ఇట్లు పాథంజన ప్రయాణ నిరోధకంబును, పర్ణకుటీరావాసులగు
పేదలపాలిటి బాధకంబును, నైన ప్రావృట్కాలంబు మెల్లనఁ
జనుటయు, 105

అంతంతఁ గనగనయ్యెను, వింతగ మేఘంబులెల్ల ♦ వెలవెలనగుచున్
రంతులనుడుగుమహోక్షము, లెంతయు బయలందుమేయ♦నేగెడిలీలన్

ఏతెంచె శరత్కాలం, బాతరిజగమలర నిర్మ♦లాంభోధర సం
జాతము పూర్ణధునీ సం,ఘాతము వరధవళచంద్రి♦కా పూతంబున్
వ. మఱియు తత్సమయంబున, 108

కొలకులు నిండి కనంబడె, కలగుండు నుడింగికుముద♦కల్హారాబ్జా
దుల క్రీడించెడి తేటుల, కలహంసబలాకకోక♦ఖగములరుతుల న 109

నిశలొప్పెనంత వికసిత, శశులై హిమకరసుధా క్త♦చారుచకోరీ
దశలై ధావళ్యల స, ద్దిశలై పూర్ణేందు కిరణ♦తేజోవశలై 110

పుచ్చపువు వెన్నెలంచును, హెచ్చుగ తెలిపిండిబఱచి♦రీయిల ననుచున్
మెచ్చిరొగిజనులు చంద్రిక, మెచ్చండారామవిభుఁడు♦మేదురచింతన్
వ. మఱియు, 112

చీకాకుచెందునెడదం, గాకగొనున్ విసువుఁ దిరుగు♦కనలున్ బడలున్
ఏకాకియగునుసీతా, రాకేందు నిభాస్యకై వి♦రాళిం గుందున్ 113
వ. వెండియు నట్లుకుందుచు డెందంబున కుందొప రఘువంశవనచంద
నుండు తమ్మునిగని, 114

ఏగగదె వర్షఋతు వని, కేగవలదె సత్వరంబ♦యెఱుగడె రవిజుం
డీగతి మసలెడి నార! దు,రాగతమతి రాజ్యభోగ♦రాగమందుడై 115

ఆడిననుడిచేరకు దా, రాడిందుకు గతము నరసి♦రమ్మా నీవున్
పాడివిడి మనల మఱచిన,గూడింతుము దన్నువాలి♦గుఱుతుగననుమా
వ. అనుచు వెండియు, 117

సుగ్రీవుని గ్రీవ న,నుగ్రహ మదియేలనా క♦నుజ యేనమదీ
యోగ్రశరనిచయఖలిత ద,శగ్రీవుం జేతు నలద♦శగ్రీవు ఖలున్ 118

వ. అని లోకభీకరావలోకనుండైన, నయ్యిక్ష్వాకునకు సుమిత్రాసుతుం
దంజలి ఘటియించి "చిత్తగింపుడు తావక మహాజ్ఞాబద్ధుం జేసి
యవ్వానచరుం దోడ్కొనివచ్చి భవదీయ చరణానతుం జేసెదనని
యనివిని యనుటయు నయ్యెడ, 119

క్రమముగ నిశలును హెచ్చెను హిమమెక్కుడు సూపగడగె నెంతయు చలిచే
తమహాపత్తుం జెందెజ,గములు హుహూ యనుచు వడక♦గా జొచ్చెనిటుల్

భరము ముదుసళులకు మనో,హరము నయోదంపతులకు♦నధిక క్షేమం
కరము తృణాళికి సౌఖ్యా,కరమిల పాంథులకు శీత♦కాలము వచ్చెన్

ఆసీతునకుం దాళక, గాసింబండె రాముడంత ♦ కడు లావణ్యో
ల్లాస విలాసిని గుణవతి,యా సీతాసతి వియోగ♦మధికము కాగన్ 122

వ. తదవసరంబున, 123

రామాజ్ఞను కిష్కింధకు, రామానుజుడేగె నాడు♦రవిశతముఖుడై
భీమశరచాపు డుగ్ర,స్థేముండై కపులుభీతి♦చెందుచు బారన్ 124

వ. ఇట్లు చని దారాసహితుండై యెదురు సనిన సుగ్రీవునివలన నతులు
గొని భీషణ రోషకషాయతాక్షుండగుచు, 125

ఓ వనచర! వినురాముం, డీవింతకు రామిగ్గినిసి♦యెంతయు దాలం
కా విజయమూని కిష్కిం,ధా విజయము సేయ బంపె♦తథ్యమునన్నున్

ఆరాము నాజ్ఞ దాటం, గారాదిల నింద్రునకును♦కాలునకయినన్
ధీరతగలిగిన రమ్మిక, పోరన్నను గెల్చికొంచు♦బోవలె నటకున్ 127

వ. అనుటయు నిశ్చేష్టితుండయి, యవ్వానరేశ్వరుండు కొండొకవడికి
సౌమిత్రికిట్లనియె. 128

ఏల! మహాప్రభు! "రాముం, డీలాగున నలిగె! మీర♦లెంతటికైనన్
జాలుదురతులితభుజబల,శాలురుసద్గుణవిశాలచారుహృదయులున్"

వ. అనునంత తద్భార్యయు, 130

మీ రిడినదె జీవనమని, మీ రిడినదె సౌఖ్యమనుచు♦మీ జీవనకూర్మిన్
కోరివచియించు సీతం, డా రాముని కహితుడగుట♦యబ్రము దేవా! 131

అనుడు సౌమిత్రి యిట్లను, వనచర! యట్లయిన రామ♦వసుధేశుసతిఁ
గొనివచ్చుఁ పనికై నీ, వొనరించిన జతనమెద్ది♦యో పేర్కొనుమా!

వ. నావుడు స్వామికార్యాప్రమత్తుండును, ధీరచిత్తుండునునగు వానరేశ్వరుండావఱకు దాఁగావించిన కార్యంబులనెల్ల నిట్లనివిన్నవింపఁ దొడంగె. 133

ఓనృప యింతకు నొకనెల, గా సంపితి వానరులను ♦ గడుబల్లిదులఁ
నానాదిశల నెసంగెడి, వానరవాహినులఁ గూర్చి ♦ వడిగొని తేరన్

వారును నేఁడో రేపో, చేరెదరియ్యెడకు వారి ♦ జెచ్చెరఁ గొనుచుఁ
ఆరఘువరు దర్శింపం, గోరి యిచట వేచియుంటి ♦ గురుకారుణ్యా 135

అనలక్ష్మణుడును దావిని, దినకరసుతుచేతఁ దెలిసి♦తిరమగుకూర్మిఁ
గొనియాడియతనిఁదోడ్కొని, చనియెఁ శ్రీరాముకడకు♦సరగు ననంతఁ

వ. చని సుగ్రీవుండు నిరపరాధియనియు సీతాన్వేషణోద్యోగాప్రమత్తచిత్తుండనియు నెఱింగించిన నిజపాదాక్రాంతుండైన సుగ్రీవుందిగిచి శ్రీరాముండెల్ల వృత్తాంతంబుందెలిసి యితనికిట్లనియె. 137

ఎఱుగుదునీవు సఖుడవని, యెఱిఁగియునిట్లేలయనిన ♦ నించుక శ్రద్ధఁ
నెఱినీకుఁగఱప నీకృత, మఱియుఁ లక్ష్మణునిబంచి♦తంతియసుమ్మా 138

మిత్రతయీభువినెల్ల ప,విత్రమహాధర్మమనుచు ♦ వినమె మహాత్ముల్
గాత్రముఁగుమవగనిడియును, మిత్రులబాలించిరెపుడు♦మిహిరజకంటే

పుత్రులుసూరుగునైన కళత్రమ్ములు పెక్కుడున్న♦లభియించునె స
న్మిత్రుడుగలిగినమేలు ధరిత్రిని చిత్రంబుమైత్రి ♦ రీతియుగానఁ 140

ఇనసుతుడవీవు నేము, న్నినకులజులమఱయ మనకు ♦ నిప్పటి నెయ్యం
బనయసుఖదమ్ముగావున, మనధర్మము నెఱపుపట్ల♦మసలంజను నే 141

నీయాలిగొన్న ముష్కరు, నాయగచరవీరు వాలి♦ననిపితి దివికిఁ
నాయాలిదొంగిలిన యా, మాయావిదశాస్యుఁబిలుకు♦మారుపవల దే

కావున నీవాజతనము, గావించుటయందు జాగు♦గా నీక వెసన్
రావణునితోడి యాజికి,గావలసెడి యత్నమెల్ల♦గావింపు వెసన్ 143

శరణార్థుల రక్షణమున, పరిపంథుల శిక్షణమున ♦ బంధుజన సుహృ
ద్గురు సంభావనముల సీ,ధర జాగొనరింపరాదు♦తజ్ఞుల కెందున్ 144

త్వరపడమిజెడునుశుభములు,త్వరపడుటంజెడునుకొన్ని♦తద్దయుగానక్
కరమువివేకియునగుచుం,ద్వరపడిత్వరపడక జేయదగు♦కార్యములన్

అనినెయ్యమునంబలికిన, ననురాగము వెలయ గృత♦సమాలింగనుడై
మనములలరనచ్చటిమధువనముంగనువాంఛజేసి♦వారేగుటయున్ 146

ఆశీస్సు

ఈరామచరిత మిల నె, వ్వారలుపఠియింత్రుభక్తి ♦ వారల కగు సీ
తారామకరుణ ననవర,తారోగ్యాయుర్యశంబు ♦ లభ్యుదయంబున్

కాండాంతము

జనకాత్మజా మనోహర! జనవందిత సుగుణవిసర! ♦ సత్యవిచారా !
జనకాజ్ఞాపాలక!దు,ర్జనభంజక!శౌర్యధామ! ♦ సన్నుతనామా! 148

కోదండ దండమండిత! వేదండ సహస్రకోటి♦విక్రమభుజ! తే
జోదండితారిమండల! పూజితసన్మునికాండ! ♦ మోహనశౌండా! 149

శరణార్థిగణావనచణ, కరుణా! భవహరణ! సుజన ♦ కామితచరణా!
ధరణీజనసుత సుకృతా, చరణా! హితతరణ! జనక♦జాహృద్ధరణా 150

గద్య

ఇదిశ్రీమత్సీతారామచంద్ర సాంద్రకృపావిశేషప్రసాదిత
కవితావిశేష, సాధుజనసేవాపరాయణ, వినయ
ధురీణ, సేవితరామభద్రభక్త, వీరభద్రోక్త
శ్రీమత్కందరామాయణంబునందు
కిష్కింధాకాండము
సమాప్తము.

ఓం శ్రీ సద్గురుస్వామినేనమః

శ్రీ శ్రీ రాధాగోవింద భగవతేనమః

# శ్రీ మత్సుందరరామాయణము

## సుందరకాండము





ఘానుషలయశోద! య
శోభాసిత దశదిగంత! ♦ సురుచిరతేజో
బీభత్సితారి నృపనా
రీభంజిత సూత్రధామ! ♦ శ్రీరఘురామా! 1

వ. అవధరింపుమట్లు రామలక్ష్మణ, సుగ్రీవు లమ్మధువన దర్శనేచ్ఛా సంజనితామిత కౌతూహల డోలాయ మానమానసులై యేగుచు, 2

కనిరెదుట వారుముఖ్యారు, మనములలర వకుళకుంద ♦ మాధవమల్లీ
ఘనసారభూజవరచం,దన చంపకసురభిసుపవ♦నముమధువనమున్ 3

వ. అట్లుకని యవ్వనంబుంబ్రవేశించు తత్సమయంబున, 4

కననయ్యె నపుడయావని, ఘననవచైతన్య మాత్మ♦కళలక్ పికని
స్వానతరుణపర్ణసుమచయ, వనరుహతతులెసగ కడుభు♦వనశోభనమై 5
వచితలిర్చిన రావులు, పూచినమావులును పొదల ♦ పూవులతావుల్
వీచెడుమలయానిలములు, సూచించెవసంతురాక ♦ సొబగులపొలికన్ 6

వ. అత్తరి నా రఘువరుండును తమ్మునింగని, 7

గానవిపుణపతగుల మధు,పాన నిపుణ భృంగపంక్తి ♦ ఫలపుష్పసుధా
దానవిపుణతరులతల న,నూనకుతూహలతగని మ♦నోహర్ష మునన్ 8
చూతువె తమ్ముడపాటల, చూతతరుణ పల్లవముల ♦ సురుచిరగతి ని
ర్లోలనరు మృదుతనూలత,సీతయెచటనార్తి మెయి గ్ర♦హించెడినొక దే!

మఱియునదెగంతమున మ్రొద,లఱిమఱి కయ్యంబులాడి♦యయ్యబ్జముపై
నెఱివాలెగనుమహాయిటు లెక్కింపంబడునో యేమొయింతియులంకన్

వ. అనియిట్లు తలంచుచు, 11

రఘువరుడువడిమెచ్చట న,లఘుతరవిరహవ్యథాన♦ లమునకుగుఱియై
మఘవకులిశధారాసతి, తఘునోన్నతనగముమాడ్కి♦దయనీయగతిన్

వ. ఇట్లుపడి కొంతవడికి రఘుకులస్వామి, 13

క్రమ్మర తెప్పిరిలెన్ దన,తమ్ముడు వినజుండుగూడి ♦ తగు శీతజలం
బిమ్ముగజల్లుచుముఖజల,జమ్మునపయిన్ శీతలోప♦చారముచేయన్ 14

వ. అట్లులేచి యధాపూర్వంబుగ ననుజసుగ్రీవసహితుండయి క్రమ్మఱి
మాల్యవంతంబుం జేరు నయ్యవసరంబున తత్పర్వత పరిసరంబుల,

ఆరాముడు గనుగొనియెచు, బారులు దీర్చిన యపార ♦ వానరసేనన్
శ్రీరామునకును జే! యని,బోరుకలఁగనార్చు వార్ధి♦బోలినదానిన్ 16

కనియుల్లమందు పెల్లుగ, ననుపమసంతోషమంది♦యర్కజు గనుచున్
నినవంశవల్లభుడు దా,ననియెన్ వినువారలెంతొ♦హర్షముబొందన్ 17

ఓహో! యీకపివరులతి,బాహాబలయుతులు, స్వామి♦భక్తిపరుల్! స
త్సాహసులువజ్రసమదృఢదేహులుకడుశౌర్యయుతులు దేవసమానుల్

అని మెచ్చురాము నెదుటకు, మునుచనినతులిడిరికపిచ♦మూపతులోలిన్
పనసగజగవయదధిముఖ,ఘననీలాంగదసుషేణ ♦ కపిముఖ్యులొగిన్ 19

పెండియుచనిరిగవాక్షుడు, గండరునలశరభమైంద ♦ ఘనులును రిపువే
దండహరిజాంబవంతుడు,భండన భయదుండునగు ప్ర♦భంజనసుతుడున్

వ. ఇట్లుసని సాష్టాంగదండప్రణామంబులాచరించిన నాదరించి సర్వ
సైన్యంబులఁ దన్నాయకులను నవలోకించి జానకీనాయకుండు
సుగ్రీవునింగని సీతాన్వేషణార్థంబుగ వీరల వైశమవుత్తెంచు
మనిన చిత్తంబని సుగ్రీవుండును, 21

ఓ వీరులార సీతా, దేవింగని వేగరండు ♦ దిశలన్నింటన్
వేవెదకి, మాసమునకున్, పైనడరా దిదిమదాజ్ఞ ♦ భాపింపుడనన్ 22

ప్రాచికి గొంటుద ననిరి ప్ర,తీచికి గొందఱనుజని యు♦దీచికినటులన్
వేచనిరియామ్యదిఙ్ముఖు,ద్రైచనగొందఱితోమారు ♦ తాత్మజుసుండేగన్

అమ్మారుతిగనిరాముడు, ముమ్మరమగు కూర్మిదనదు ♦ ముద్రిక నిడిసీ
విమ్మా సీతకు దీనిని, కొమ్మనినున్నమ్మిలోన ♦ గుందఱిపలుకన్ 24

వ. అనిన తనమనంబున నమ్మారుతన్నందనుండును, 25

ఏనింత పట్టుసేయం,గా నోపుదు నోకొ! యటులు ♦ గాకేమిమదీ
యానూనరామభక్తి రా, పూనిన కార్యములమేలు♦పొనరుచు ననుమున్

జతనమొకయింతసేయక, మతిగుందగదగునె యెట్టి♦మనుజునకయినన్
వెతవీడిరామునతికై, ప్రతినమెయిన్ గలతువిష్ట♦పత్రయమైనన్ 27

వ. అనితలచి, 28

రామునకనియెనుమారుతి, స్వామీ! భవదాజ్ఞనెట్టి ♦ సాహసమైనన్
ఈమెయినొనరిచికంటిను,ఈముల్లోకముల సీత♦నెచ్చటనున్నన్ 29

జముబట్టిపీచమడతును,గములుగరక్కసులగూల్తు ♦ కడిమిమెఱయనా
యమరరిపుదెత్తునిటకు నె,లమిసీతనుజూపకున్న ♦ లంకయె దెత్తున్

అనిపలికి రాఘవుని పద,వనజంబుల కెఱగి కడు జ♦వంబున కడకన్
మనమలరనెగురుచుండన,యనుచరులంగొంచువేగ♦నరుగగనంతన్ 31

రాముడనె భళిర! తమ్ముడ! సామీరింగంటె ఎటుల♦చనెడినో ధైర్య
స్థైమోత్సాహములె సగగ, భూమీసుతగాంచునిక్క♦ముగనీతండే 32

అనవిని సుగ్రీవుడు రా,మునికిట్లనె రామపుణ్య♦మూర్తివి నీదా
ఘనకృప మాపైగల్గిన, గనరాదిల దుష్కరంపు ♦ కార్యముమాకున్

వ. అనినం బ్రమోదించి రఘువీరుండు సఖులారా సీతాగవేషణంబు వానరులను సుకరంబుగ సఫలీకరింప గజముఖుంబూజింత మద్దేవుండును, 34

ప్రథమార్చనీయుడెల్లెడ, ప్రథితకృపామేయుడెల్ల ♦ ప్రమథాధిపుచే
కథితశుభచరితుడును ని,ర్మథితాఖిల కార్యవిఘ్న♦మండలుడుమఱిన్
ఆదిత్య సదృశ తేజుడు, వేదాంతజ్ఞానసార ♦ వేదియు కరుణా
మేదురశీలుడు శుభదుం,డా దిత్యాఖిలమహాంశు♦డనఘాత్ముండున్ 36
తానెఱుగు తన్నెఱింగిన, వానిన్ మానకను బ్రోచు♦వారనికృప సా
మ్మానిత సద్యశుడైన గి,జాననుడల్లాట గొల్చు♦రార్యులువానిన్ 37
ఎవ్వాడింతయు నెఱిగియు, నివ్విఘ్నాధీశు గొల్వ♦కెంతయు నడుగున్
అవ్వానికొనుమానక, నెవ్వనెగులదెంత యేని♦నెట్టనగానన్ 38
కొలుతమునునముందఱ మా,వలి గుబ్బలి కూతుకుఱ్ఱ♦వారణముఖునిన్
నెలమి శివుకూర్మినందను, సలలితమహా భక్తిపూజ♦సలుపుచు నిచటన్
వ. అనవుడు సుగ్రీవుండును లెస్సయని, 40
వనచరుల బనిచెనానా, వనమధుఫల, పుష్పపత్ర♦వారముగొనుచున్
ఘనసార చందనాదిక, ఘనసురభి పదార్థములను♦కడువెస దేరన్ 41
వ. అట్లు పంచినంజని యమందానంద మరందభరిత హృదయారవిందులగుచు వనేచర బృందంబులు చందనమృగమదాది సంభారంబుల గుప్పలుగ దెచ్చియిడిన రామచంద్రుండును విశుద్ధంబగు మృత్తికంగొని గణేశాకృతిగ రచించి యున్నత వేదికాసనస్థుం జేసి,
దీక్షగొని పూజసలిపెను, అక్షతలును పత్రపుష్ప♦మగరుసుధూపం
బక్షీణ భక్తిచేకొని, దాక్షాయణి కూర్మితనయు♦దగవిఘ్నేశున్ 43
వ. అట్లు పూజించి యద్దేవు నుద్దేశించి, 44
హేరంబ! వినతసుజన సమారబ్ధ సుకార్యచయఫ♦లావాద! సదా
ప్రారంభపూజ్య! సురనుతభూరికృపా! విఘ్ననాశ! ♦ మ్రొక్కెదనీకున్
గణనాయక! సురుచిర సద్గుణవర్ణితకీర్తిసాంద్ర!♦కోమలవరవా
రణముఖ! రణముఖనుత! కా,రణరహితకృపాంతరంగ!♦రంజితసంగా!

దండముఖిలపూజిత! వేదండకరాంచిత సురూప♦దాక్షిణ్యాగుణా
జాండహిత చిత్తరంజక! పండితనుత! నతిశతమ్ము♦పావనచరితా 47

వ. అని యనేకప్రకారంబుల నుతులొనర్చి, 48

చూతపనస ఖర్జూరో, పేతము వరనారికేళ♦పృథుతరకదళీ
జాతముఖసుఫలచయసము, పేతమునై వేద్యమపుడు♦పెంపుగనిడుచున్

నీరాజన మిచ్చెను ఘన,సారముతో రముగనిడి గ♦జాస్యునకర్థిన్
ఆరాజన్యకులైక వి,రాజన్మణి రాముడంత♦రాజిలుభక్తిన్ 50

వ. ఇట్లు పరమేశనందనుం బూజించి పరమాత్ముండైన రామచం
ద్రుండు పరమానందభరితుండై తత్ప్రసాదంబు వానరావళి కెల్ల
రకు నిప్పించిన నంత సీతాన్వేషణార్థం బఱిగిన యావానరానీకం
బును మహా రభసంబునం జని, 51

పొదల తరుకోటరంబుల,నదియొడ్డుల లోయలందు♦నగముల దరులన్
పొదలు సరసీతటంబుల, వెదుక గడగిరెల్ల ప్లవగ♦వీరులు సీతన్ 52

గిరులెక్కి కొండఱున్నత, తరులెక్కియుకొంద ఱద్రి♦దరులదిరుగుచున్
తరులగిరులగహ్వరముల, విరిచిగ్రొచ్చికలచికలయ♦వెదకిరి మఱియున్

గములుగపఱచుచు నెమకిరి,దమకగపడు దుష్టసత్త్వ♦దర్పముడుపుచున్
సమరహిత సత్త్వగతి దు, ర్దములై కపులటవినెందు♦దామేయగుచున్

వ. మఱియు నిట్లు వెదకి ప్రాక్పశ్చిమోత్తరాశలంజనిన కపులెందును
సీతజాడలం గనునాశ యించుకంతయు లేమిం జేసి దక్షిణాశకుం
జనుదెంచిరయ్యవసరంబున, 55

అచ్చోటమారుతియుగడు హెచ్చగునుత్సాహముప్పయిజుంకగుచొట్లన్
జొచ్చుచుగిరులన్ ద్రచ్చుచు,గ్రచ్చరజలగహనములనుకలచి వెదకుచున్

ఎచ్చోడ సీతంగానక, చయ్యన తనకడకువచ్చు♦శాఖాచరుల
న్నచ్చోటగాంచివారల, కయ్యనిలజుడెదురుసని యో♦నతిహర్షమునన్

చనియిట్లనె యోవనచర, ఘనులారా! సీతజాడ♦గంటిరె మీరెం
దుననైన నాఁగ వారు స,వనతాననులగుచు ననిరి♦వాయుజుతోడన్
తిరిగితిమి చీమకైనం, జొరరాని మహాటవులను♦చోద్యంబెందున్
ధరణిజజాడ గనంబడ, దరుదెంచితి మింక సినె♦యధారవముగాన్ 59

వ. అనిన వనచర శ్రేష్ఠుండగు నంజనీతనయుండు వారలంగని, 60

దైన్యంబు నొందకుడు సౌ, జన్య గుణాంబోధి రామ♦చంద్రునకరుణా
నన్య సులభబలులము భూ,కన్యంగను టెంతమనకు♦కపివరులారా!

అనివారలకును ధైర్యం, బును జెప్పుచు దోడికొంచు♦బోడగనె నెదుటన్
వనసత్వ భయదమున్నత,మును నైనమహేంద్రశైల♦మునునటనంతన్

వ. అట్లు కనిడాయంజనుచు తత్సమీపవాసి సంపాతి యనెడి జటాయు సోదరునిచే లంకాంతర్గత సీతావాసంబును, సముద్రంబున లంక యునికియుం దెలిసికొని, 63

ఆశైలమెక్కి గ్రక్కున, కేశవరులు గనిరి భంగ♦కేళీ కలితా
కాశ జలధరౌఘము సక,లాశాపరివృతము సంద్ర♦మతి భీకరమున్ 64

వ. అట్లు దక్షిణసముద్రముంగని తత్తీరంబున కేగి హనుమజ్జాంబవదంగ దాది ప్రముఖ కపివరులెల్లరు నాభయావహంబగు మహాపయోధిందరియించు వెరవెఱుంగక యోచనాపయోధి నిమగ్నులై యుంటయు నంగదుండిట్లనియె, 65

ఈవనధిదాటి యవ్వలి, రావణుపురి జొచ్చి యచటి♦రాముని దేవిన్
ఏవెరవున గనివచ్చెద, మేవిధి నొనరింతమిపు డ♦ధీశుని యాజ్ఞన్ 66

ఒకవంక రామకార్యం, బొకవంకను జేనియాజ్ఞ♦యూహింపగ బూ
నికకరణీయంబిది కపు, లకు నందఱ కనినవినుచు♦ప్లవగులు నంతన్ 67

పదియామడలరిగెద ము,ప్పదియామడలేగగలను♦పటుగతి నేడె
బ్బది యోజనములకించుక, కొదువగ నేగెదనటంచు♦కొందఱు తెలుపన్

వ. అంగదుండిట్లనియె "నేనట్లో శ్రమంపడి శతయోజనంబులదాక నెగురనోపుదుంగాని మగుడ రానోపనయినం బోయెదని దే రాము కార్యార్థంబై మేను వోజంగుటయ శ్రేయంబగుంగాని రిత్తచేతుల రాముపాలికిం బోరా" దనవుడు జాంబవంతుండును, 69

ఏను ముసలిని యీపని,బూనంగానోప వాయు ♦ పుత్రుడు కడిమిం
బూనగలడింత యటు కా, దేని యిదు నెముద్రనితని♦కిసకులవిభుడుర్ 70

అననెల్లరు పవమానజు, గనివినుతియొనర్చి వేడు♦కం బ్రార్థింపన్
గనియతడు వారికందఱ,కునునిట్ల నెధృతమహోత్సు♦కుండగు చున్నాగిన్

ఓకపులు! వినుడు నే నీ,తాకాంత కృపావిశేష ♦ దత్తజవమునన్
ఈకడలి దాటి లంకల,గాంచుట్క్న సతీమతల్లి ♦ గనివత్తు వెసన్ 72

సందియము వీడు డేజని. యెందున్నను వెదకి సీత ♦ నీక్షించియె రా
చందురులకు తత్క్షేమపు,సందేశముగొంచువత్తు ♦ సరగున ననుచున్ 73

వ. ముహూర్తమాత్రంబు నిమీలిత నేత్రుండగుచు, నిజపితరుండగు మరుద్దేవుందలంచి, రాముని ధ్యానించి వెండియు, 74

శ్రీరామ! రఘువరాన్వయ, వారాన్నిధిసోమ! జగద♦వనగుణధామా!
వారిధిసమచిరకరుణా, సార!సతతభక్తకామ! ♦ జగదభిరామా! 75

వ. అనిభజించుచు తోడివానరులంగూడి తీరస్థంబగు నొక యున్నతాద్రి నారోహించి, 76

కుప్పించియెగ సెమారుతి,యుప్పరము దెసన్ ముఖంబు♦నునిచి పదహతిన్
కప్పు చెడి యద్రిగదలగ,నుప్పొంగుచు వాలమెత్తి♦యూచుచు బాహుల్

అటులంఘించిన వానరు, లిటునటు గలవారలెల్ల♦రిలబడిరి తరుల్
పటుభీకర భూకంపం,బటులూడిపడెన్ మృగంబు♦లటమటపడియెన్ 78

తదనంతరంబ పావని,పొదలు జవంబునను జనియె ♦ భువివానరులున్
ముదితహృదయులయిరామాభ్యుదయపతాకంబటనుచుబోగడగనింగిన్

వ. మఱియునట్లు చనునయ్యవసరంబున, 80

ఒక్కప్పు డూర్ధ్వముఖుఁడగు, నొక్కప్పు డధోముఖుంబు♦నొందును మఱి వే
ఱొక్క యెడ వాలు దేలును, నక్కపివరుఁ డసమశక్తి♦ నబ్ధిఁ గడచుచో

వ. మఱియు నవ్వానరోత్తముండు, 82

కనుచూపు మేర మీఱిన, గని యచటి వనాటు లెల్ల♦ గ్రక్కున తమ శ
క్తి నిఁజూపి యెగిరి గనిర, య్యనిలాత్మజు నట్లు కనగ♦ నయ్యేడుదనుకన్

వ. తదనంతరం బవ్వానర ప్రవరుండును, 84

అటుచని చని కనె నెదుటను, పటుడక్కా కాహళాది♦ భాంకృతి కలితో
త్కట వికట భీషణాకృతి, చటుల నిశాటప్రభూత♦ శంకన్ లంకన్ 85

వ. కనిడగ్గరంజనుచు నందలి రక్కసులం గని మనంబున, 86

వీరు లుదగ్రసుతేజులు, వారణశతబలులు కరమ♦ వార్యవిహారుల్
వీరికనుఁ బ్రామి యెట్లకొ, దూఱుట యీపురమునందు♦ తోఁచదు మదికిన్

అని యించుక యోచించియు, దనకుంగల కామరూప♦ ధారణశక్తిన్
దనువుఁ గుదియించి హనుమయు, జనుచుండెను లంకఁ గనగ♦ జవగతి నంతన్

కొండఁ జదె డేగ యనగను, కొండఁ పారావతంబొ♦ కో యన తూనీ
గం దనరె నిదియనం దన, చందంబు నిశాటులెఱుఁగ♦ జాలని యటులన్ 89

చనుచు మర్మముల మఱువుల, వినుచు కనుచు దిరుగుచెందు♦ విసువక కేళీ
వనుల భవనముల మిద్దెల, గని కేళాకూళులందు♦ గనుగొంచు వెసన్ 90

పిల్లి వలె వంటశాలల, బల్లి వలెన్ పడక టిండ్లఁ♦ బరికింపుచును
ద్యల్లీల విఫణివీధుల, నెల్లెడలన్ మందిరముల♦ నెంతో వెదకుచున్ 91

తోటల బాటలఁ గోటల, పాటవమున జనుచు గనుచు♦ పరిపరి కేళీ
కూటముల నతుల ఘనశృంగాటములం బందియిడ్ల♦ కనుగొంచు నొగిన్

లంక నెల్లెడల వెదకుచు, శంక విడిచి రాక్షసేంద్రు♦ సదన మరయగా
నుంకించి చనియె హనుమని, రంకుశుడై కామరూప♦ రాజితశక్తిన్

ఇచ్చోటచ్చోటనకను, విచ్చలవిడిఁ దిరిగి సీత♦ వీక్షింపగలే
క వచ్చె మారుని గనియెవి, యచ్చరరిపు రాక్షసేశు♦ హర్మ్యాగ్రమునన్

వ. మఱియు నయ్యెడ నక్కుఱునలి గోమఱుండు. 97

ఒకచోకుబేరపుష్పక, మొకచో బంధీకృతామ♦రౌఘము మఱివే
ఱొకచోట నవనిధులు నిం, కొకచో కల్పంబుసురభి♦యుం గనరాగన్

తన మనమునందునిట్టు చింతన మొనరించె న్నిశాట♦నాథుడు భళిరే!
యనుపమ మేతద్విభవం, బునురామునితోడివైర♦మునఁబోరిపుచ్చున్

వ. అని తలంచుచు నెందును సీతం దర్శింపనైతినని గుందుచు సంది
యంబందుచు దవ్వుగ నొక్కవనంబుం గని యందుండునేమోయని
చని యందు వెదకుచుం జనుచు నొక్కయెడ, 98

ఓ కాకుత్థ్సకులేశ్వర! యో కారుణ్యాబ్ధి♦నుతమ♦హోన్నత! సుగుణా
నాకౌకఃప్రమదావహ! లోకేశ్వర! లోకవంద్య! లోకస్తుత్యా! 99

ఓకమనీయ సుగాత్రా! యోకమల సమాననేత్ర! యోసుచరిత్రా!
యోకోమలపదయుగళా! యోకాంతాహృదభిరామ! యోరఘురామా

అని భక్త్యాలాపంబుల, నినవంశజు పేరుగ్రుచ్చి♦యీరెలుగునఁ దా
ననవరతముబల్కెడు నొక,మనుజ సతీమణినిఁగాంచె♦మారుతియంతన్

కని యీమె సీతగాబో, లునొ యంచుకరంబుముదము♦లోఁగొనిసరగన్
జనియొయ్యననొకభూమిజమునయందునడాగియామె♦మోముంగనినన్

వడలునెలమావిచిగురులవడువునగనన య్యెమోము♦వాతెఱబొమలున్
కడుబడలిధూళిగప్పిన, యొడలు సడలపుడమిచూలి♦యున్నెడనంతన్

వ. ఇట్లున్నంగని యాత్మగతంబున నప్పవనజుండును, 104

పతిరాముడౌర! మిథిలా, పతి జనకుండరయ మామ ♦ పంక్తిరథుండీ
గతి వెతలబడెడిసతి విధి,కృతమరయ నలంఘ్యమెట్టి♦కృతమతులకిలన్

వ. అని తలంచు నయ్యవసరంబున, 106

తీవిచెలగ సంపెగపూ, తావియగరు పరిమళింప♦ ధౌతాంబరుడై
తూవెడవిల్తునకోర్వక, రావణుడును వచ్చెనటకు♦రాణదలిర్పన్ 107

వచ్చి రఘురాము దేవిం, జెచ్చెరఁగని చెలువయేల♦చింతిలగ నిటుల్
మచ్చిక ననుకృప సేయుమ, విచ్చలవిడి నింద్రభోగ♦విభవముగొమ్మా

వ. అని మఱియు, 109

వాసవుని గెల్చి నడికై, లాసశిఖరినెత్తి దివ్య♦లం జెఱగొంటిన్
నాసరి జూడగలాడకె♦ యీసకల జగంబులందు♦నెవ్వండేనిన్ 110

మునుఘోరతపంబొనరిచి, వనజాక్షిరో బ్రహ్మవలన♦వరముల నెన్నే
గొనియుంటి నాకు నొకరుం, డెనయే ననబోడి కరుణ♦నేలవె నన్నున్

వ. అని వెండియు, 112

రాముదలంచెదు మాటికి, రామామణి రాము డెట్లు♦రాగల డిటకున్
భీమమహోదధివేష్టిత, సీమగదటె లంకయిందుఁ♦జేరగ వశమే 113

వ. అని యిత్తెఱంగున మైమఱచి ప్రేలు నా రావణు నుడులాలించి
సీతయు విముఖయై యిట్లనియె. 114

ఛీ! పొమ్మిక పోగాలము, దాపయ్యెను గాననెగ్గు♦దలపవు నుడులన్
నీపొగడిక లవియేటికి, పాపాత్మక నీవుమీది♦పాటెఱుగవొకో 115

వ. అని వెండియు, 116

రాము నెఱుంగవె? రిపుహృ, ద్భీమున్ నిర్భిన్నభీమ♦భీకరచాపున్
శ్రీమహితు విజితభృగుకుల, రామున్ కళ్యాణధాము♦రమ్యస్థేమున్

వ. అని మఱియు, 118

ఆమహనీయుని రాకకుఁ బామద్దునె యబ్ధి గిబ్ధి♦దనుజులు గినుజుల్
యీముల్లోకంబుల నీ, వేమెయిడాగినను విడువ♦డిది నిజముసుమా

వ. మఱియు కడమాట సెప్పెద. 120

వినునీవు వేయిసెప్పిన, విననొల్లను, రామవినుతి ♦ విడనొల్ల మఱిన్
మనగోఱు దేని యిపుడై, నను వేచని రామచంద్రు♦నకు శరణనుమా

వ. నావిని రావణుండు క్రోధారుణిత లోచనుండై యార్చుచు. 122

ఔరయిటుల ప్రతిసెప్పెడి, నారీమణి దీని నేమ♦నగవచ్చునహో!
యోరిమి వలదిక తెమ్మసి, ఘోరంద్రుంగింతు దీని♦దర్పంబడగన్ 123

అనుడు నచటగలరక్కసి, వనితలు రావణునిబట్టి ♦ వారించి ప్రభూ!
విను దీని బోటి జంపన్, జనునే నినుబోటి వీర♦చంద్రునకెందున్ 124

నరవరులో సురలో యక్షులో, సురనాథుడో జముడో నీవు♦ఛురికన్ బట్టన్
కరవాలదేమి మానవ, తరలాక్షియ దేమియిట్లు ♦ తగునే నీకున్ 125

వ. అనివారించు నయ్యవసరంబున వృక్షంబునంగల మరుత్తనయుండు క్రుద్ధుండై తన మనంబున, 126

ఔరౌర! యెంతదుర్మదు! డీరీతిని కాఱులాడు ♦ నీసతితోడన్
ఊరకవిడువం దగదీ, క్రూరుంగడతేర్పదగును♦గొబ్బున ననుచున్

ఉఱుకుదునో నెత్తిపై బడ, గొఱుకుదునో గొంతుబట్టి గురుభుజతతులన్
విఱుతునో కఱతునో చఱతునో, పఱవగనొక శాఖమోది♦పసదీర్తునొకో

వ. అని మఱియు లంఘనోద్యుక్తుండగుచు, 129

ఆరాముడు రానేలా? పోరదిగానేల! నేడె ♦ పొరిపుచ్చెద నీ
క్రూరాత్ము దుష్టు ఖలు నో, రారాయని సిద్ధపడుచు♦నంతట మగుడన్

వ. ఇంచుక విచారించి జయాపజయంబులు దైవాధీనంబులగుటనెంచి తావచ్చిన కార్యంబుందలంచి తనకుంబ్రస్తుత కర్తవ్యంబు నూహించుచు నుండునంత రావణుండును మాసద్వయంబు గడువొసంగితి నంతకునోడంబడకున్న దీనింబరిమార్చెద నిది నిశ్చయంబని చనియె, నయ్యవసరంబున భానుండును నిజాన్వయ ప్రదీపకుండగు రాముని భార్యకు దైత్యులవలనంగలిగిన సిలుగుల కలిగి వెలుంగు నిజప్రచండ కిరణకాండంబున నద్దనుజ పురంబును దహించుటకో యన నభోమధ్యస్థుండగుటయు, 131

హాలాపానవివశలై, నేలంబడియుండ్రి యామి♦నీచర వనితల్
చాలగనిద్రింపుచు న్మై, చేలలెఱుగకట్లియుదను♦జెచ్చెరగనుచున్ 132

మారుతి జనితానోయ్యన, భూరిమనోహర్ష మెసగ ♦ భూసుతదరికిన్
జేరి ప్రణమిల్లి యాసతి, కీరితిగ తనదుచరిత ♦ మింపుగ జెప్పెన్ 133

ఓయమ్మ! నమ్ముమింతయు, నీయడుగులయానయాంజ ♦ నేయాఖ్యుడ నా
వాయువరసంభవుడ కపి,నాయకుడౌ సూర్యసూను ♦ నకుప్రియభటుడన్

అగ్రజునకోడిమాపతి, సుగ్రీవుడు రాముశరణు ♦ జొచ్చుటయును నా
యుగ్రశరాసనధారి య,నుగ్రహపూర్ణుండునై వి ♦ నూత్న ప్రేమన్ 135

మాజేనియన్న వాలిని, ఘోరాస్త్రం జేసికూల్చి ♦ గురుతుగ కిష్కిం
ధారాజ్యమినజునకునిడి, ధారుణి నినువెదుక మమ్ము ♦ దటుకున బంపన్

సంపాతినుడుల నినువిని, తెంపున నిటుఘోర వారి ♦ధినిదాటి యిటన్
బెంపగుముదమున నిను డిరి,సింపంగలిగితిని నీదు ♦ సేమము గంటిన్

138

వ. మఱియు,

నినుగాంచగానె యిమ్మనె,జననిరో యుంగరము రామ ♦ చంద్రుండిదిగో
కనుగొమ్మటంచునిడినను,గొని ప్రముదితచిత్తయగుచు ♦ కోమలియంతన్

ఓరాము ముద్దుటుంగర,మా! రయమున నన్ను జూడ! నరుదెంచితివే
మారామునకును సేమమె,ధీరుడు సౌమిత్రిసుఖమె ♦ తెలుపుమమఱియున్

నినుగనిన లేచివచ్చెనె! మునుపోయినయట్టి ప్రాణ ♦ ములు ముద్రికయిం
కనునన్ను గూర్చియేమే,నినవంశవరుండు తెల్పె ♦ నే చెప్పగదే! 141

వ. అనివాయుజుందిలకించి, 142

ఓయన్న కంటివేకద, యీాయసురులనలని బాధ ♦ లింతయు జెపుమ
య్యాయనఘు రామునకునుసు,ధీయుతు సౌమిత్రితోడ ♦ దెల్లముగ మఱిన్

తననుడులువినక నిష్ఠుర, తనునాడిననాటియఘము ♦ తగిలెననుమమా
వినయగుణుదులత్మ్మన్నకు,హనుమాదిన మొక్కయేడి ♦ టనుమాపతికిన్

వ. మఱియు మన్నాథునకు నామనవిగా నుడువు మెట్లనిన, 145

తననామ మెయాహారము, తనచింత యెపానముగను ♦ తనపై యాశల్
ఘనభావిభద్రచయములు,గనునింతకుతనువునిలుప ♦ గలిగితిననుమా 146

వ. అని మఱియు, 147

నతులనుమ రామవిభునకు, నతులిత సౌజన్యుడతని♦యనుజునకును మ
త్కృతములు దీవెనలనుమ స,తతసజ్జన కార్యదక్ష♦దళిత విపక్షా 148

వ. అనినం జిత్తంబట్లనయని ప్లవంగమోత్తముండగు హనుమంతుం
డును తననిజరూపంబుంగనంజేసి తల్లీ! నేనూరక చనరాదు తావక
చూడారత్నం బిమ్మా! కొనిచని రఘూత్తమునికి సమర్పింతు
నావుడు వల్లెయని యద్దానినిచ్చిన హనుమయు, 149

అద్దాని భద్రగతిగొని, యద్దేవికి ప్రణతులొసగి ♦ యతిభక్తిమెయిన్
గ్రద్దనజనియెన్ పురిజోర,నుద్దండగతిన్ కలంచు♦చుఱుకుచఱచుచున్

వ. మఱియునట్లు దిరుగుచో, 151

అదెవానర మిదెమర్కట, మదిరే! యదెగండుకోతి♦యద్దిరె! యిండ్లన్
కదలించెనదలిచెనఱచే!యదిమెచదిపెననుచుకలగి♦రసురులుమఱియున్

చఱచెనిటనన్నువాలము, పఱపివిసరెదన్నగఱచె♦పైబడెననుచున్
వెఱచియఱచి బెగ్గిలివే, పఱతెంచిరి దనుజులెల్ల ♦ పవనజు గనుచున్

వ. ఇత్తెఱంగున నిఖిలభయదుండై రక్కసులం జెండాడుచు, వనం
బులం బెఱికి, భవనంబుల కుఱికి వనపాలురంజంపి భూమికంపింప
మఱియు నానాప్రకార ఘోరవిహారంబులు సలుపుచు, 154

తన్నెదురురక్కసులగని, యున్నత తరుశాఖగొంచు♦నుగ్రత చదుపన్
క్రన్ననచనికొందఱుతమ,గన్న తెఱగుగూర్చిచెప్ప♦గని రావణుడున్

అక్షయుడనియెడుదనసుతు,దక్షిణమునబిలిచిప్లవగు ♦ దండింపుము నా
నాక్షణమ సబలుడై చని, యక్షీణోత్సాహి యతడు♦ననిలజు దాకెన్

దాకుటయునుమారుతిబల్,పీకన్ లంఘించియార్చి♦వృక్షముగొనుచున్
భీకరతనొ... తనుజా,నీకము నడియించి యక్షు♦నింగనుగొంచున్

వాలమున జుట్టి కడునా, ఖీలగతిఁ ముష్టిఁ బొడిచి ♦ పేరలుకం దా
గూలిచె నక్షయు నయ్యెడ, లీలన్ వాయుజుఁడు గని ని♦లింపులు వొగడన్

వ. తదనంతరంబా వృత్తాంతంబుఁ దెలిసి రావణుండును గొమరుండు వాలియుటకు గడుం గడు వగచి నిజమంత్రులం గని, 159

కోతియనుచు నిర్లక్ష్యము, సేతయకేట యెంతవట్టు ♦ సేసెక నుడి మీ
రీతతి నక్కపినిటకు స, చేతనుని గట్టి తెండు♦ చేవదలిర్పన్ 160

అనవిని రావణుప్రియ నం, దనుడంతట లేచి, మేఘ♦నాదుండనగా
మును బేరువడ్డవాఁ డి, ట్లనియెన్, వినువారు మెచ్చ♦ నసురాధిపుతోన్ 161

దనుజాధినాథ! యేనా, వనచరుఁగొనిపత్తు నిపు డ♦వారణజని నీ
తనయునకిది యొక లెక్కయె గనుమా యనుమానముడిగి గ్రక్కున వత్తున్

వ. అని యేగి,

తలపడియె వాయుసుతుతో, నలఘుపరాక్రముడు రావ♦ణాసురసుతుడున్
పలలాశఁ బోరుబలు బె, బ్బులుల తెగువ దోపకడిది ♦ పోరు చెలంగన్
వడివడియిట్టుగ దెగబడి, కడిదికడిమి పుడమియడగఁ♦ గడు బెడిదముగా
బడిబడి పిడుగుల సవ్వడి, వడుపిడికిటిపోట్ల బెగడు ♦ వడుచుండు నెడన్
శరవిదుడు మేఘనాదుడు, పరువపువడి నేసె ననుమ♦బ్రహ్మాస్త్రమునన్
అరుదుగ నయ్యెడ నక్కపి, వరుఁడుంబంధీకృతుండు♦వలె గనుపట్టెన్

వ. ఇత్తెఱంగున నప్పవనచరవరుండును కొండొకవడి యుంటయు నాతని గొని చని యయ్యింద్రజిత్తు రావణసమ్ముఖంబునం బెట్టినం గని రావణుండును క్రోధాతిరేకంబున, 167

ఓరి! వనేచర! యెవ్వడవోరా!, యిటు వనధి దాటి♦యరుదెంచు టెకా
కీరక్కసుల నెదిర్చితి, వేరుగలరు నీకు ప్రాప♦దెలిగింపుమురా! 168

వ. అనిన హనుమంతుండును, 169

ఓ రాక్షసేంద్ర! విను నీ, తారమణుని బంట వాయు♦తనయుడ కిష్కిం
ధారాజగు సుగ్రీవుం, డా రాముని దేవి నరయ♦నంపెన్నన్నున్ 170

ఆ రాముకృపా బలమున, వారిధి లంఘించివచ్చి ♦ వనమునఁగల మా
శ్రీరాము దేవిఁగాంచితి, నా రాముని సెప్పు బలికి♦ననియున్ వింటిఁ 171

నాపిని మహోగ్రుఁడౌచును, రావణుఁడనె నోరి వాన♦రా! నిక్కితిఁ
నాపిటి యసుర వీరుల, నైపుణి చంపితివ దేల ♦ బాగుగ జెపుమా 172

అనునా యసురకు మారుతి, యనియెను నినుగనెడి వాంఛ♦నటు చేసితిదూ
తను మేలునుడి వెదను విను. మనఘుఁడు శ్రీరామచంద్రు♦డనమానవుఁడే

ఒంటిదగు కోలఁగూల్చెను, వింటి వీరాధివీర♦విశ్రుతువాలిన్
వింటివొ కాని నిలువ నరికి మ, గంటిమి మైనిలువరాదు♦కనరాదతనిఁ 174

వ. కావున, 175

కాలాహి కాలదండ్రములఁ బోలిన రఘురాముతోడి♦పోరది సీకున్
మేలా? యేలాసెలా, వాలో చింపంగజాల ♦ వసురాభీలా 176

వ. అది గావున, 177

పరబలమ దెంతగలిగిన, గురు భుజశక్తియునుగల్గ♦కోట్లాదిగ నా
సురబలగ మెంత యున్నను, బొరిపుచ్చక మానడింక♦భూసుతకై నిఁ

కావున వేచని సీతా, దేవి నొసగి కావుమనుమ♦దివ్యాత్ముని నా
దేవేశు రామచంద్రుని, రావణ! శరణాగతార్థి♦రక్షకు ననినన్ 179

నమరు బెదరు నెఱుగక పలు, వదరుచు నున్నాఁడు వీని♦వానరుఁ జంపన్
గదరె యనెను రావణుఁగని, తదనుజుఁడు విభీషణుండు ♦ దగనిట్లనియెన్

ఓయన్న సర్వవిదుఁడవు, యేయెడలం దూత జంపు♦టిదియుచితమె భూ
నాయకులకట్లుగావున, నీయగచరు జంపకుంట ♦ యెంతయు లెస్సా 181

అనుడు సెబాసని సభవా, రనుటయు నటులైన శిక్ష♦నరయుడికపికిఁ
అనవుడునొక మాఖ్యాంగం, బునుగాల్చుటయుచితమనిరి♦పౌరిబౌరివారల్

వ. అట్లు నిశ్చయించి వానరంబులకు వాలంబు ప్రియతరాంగంబ
గావున నద్దానిం గాల్పనెంచి కోకలుచుట్టి తైలంబునకాముం
యగ్నిముట్టించి పురోపకంఠంబునన్విరచుచుటయు, 18

అతరి నసురులు రాముని, దూతకు గావించినట్టి ♦ దుష్కృతివిని భు
జాతయ్యుమ్రొక్కినుతించిన, పూతాత్ముడువాయుసఖుడు♦బోడగట్టె నటక

వ. అట్లు ప్రత్యక్షంబై సీతంగని తల్లి! త్రైలోక్యవంద్యుండగు భవత్ప
రామచంద్రుకార్యంబుఁబూనివచ్చిన మారుతికిదుస్సహుండనగుద
నే! మఱియు మదాప్తుండగు వాయుదేవ్రతనయుండగుటం జేసియ
నట్లొనరింపంజాల భయంబుడుగుమనిన, నమస్కరించి సీత యా
నికి సెలవొసంగి యథాపూర్వంబుగ రామతారకనామంబు జ
యించుచుండె. నిటపవ మానజుండును,

తనుఁదాకియు శీతలమై, ఘనగతినాయగ్ని వెలుఁగ♦గా నతులితుచున్
అనుపమహర్షోత్సాహము, లనుజవమినుమడిగ నెగిరె♦లంకాపురిపై 18

ఇటులెగిరి యగ్నిజొనిపెను, యిటనట నననేల యెల్ల♦యెడలఁ పురికిఁ
చిటపటశబ్దము లెసగం, గటకటపడిదనుజులొడలు♦కాలగదూలఁ 187

స్తంభములు కాలెమేడలు, కుంభినిపై వ్రాలెనెట్టి♦గోపురతతులుఁ
దంభోళి హతాచలసం, రంభగతిఁ గూలెనంత ♦ రావణుపురిలోఁ

దావాగ్నికిశుష్కాటవి, దావెలిగెడుభంగినాడు ♦ దగ్ధంబయ్యెఁ
రావణునిపురం బయ్యెడ, నావసుధాతనయయున్న ♦ నయ్యెడదక్కఁ

వ. ఇట్లశోకవనంబును, విభీషణుని సౌధంబునుందక్కఁ తక్కిన యెల్ల
యెడలం దహనుండు దరికొనునయ్యవసరంబున పౌరరక్షోనారీజ
నంబులొండొరులంగని, 190

ఎఱుఁగరొకో క్రొత్తియంచును, ఎఱిగియునిక్లేలతో♦క నిడియొకరగ్నిన్
వెఱవరులక్కట!గడితపు, బిఱుసుమగలునొర!దనుజ♦వీరులువీటఁ 191

ఒకకోతిగానికింతటి, తెకమక తారెరా! యిట్టి ♦ ధీరులు కేపిం
కొకవేయికోతులరు దే,నిక నెట్టుల పట్టగలరో! ♦ యెయ్యదిగతియో!

హా! యొకకోతెయింతటి, దారుణమొనరించె నన్న ♦ దన్నాయకులా
శిరయుగ మెట్టిదోకద! వారివనిత దెచ్చె నేల ♦ వసి రావణుడున్ 193

అనిలంకాపౌరులు దను, గని కడుభయమంద లంక ♦ గాలిచియంతన్
జనియె ననిలజుడు సంద్రం,బున వాలమునార్చి సీత ♦ బొడగనవంతన్ 194

వ. ఇట్లుచని భువనమాతయగు సీతంగని ప్రదక్షిణపూర్వక సాష్టాంగ నమస్కారంబొనర్చి రాముపై శమ కొనితెత్తు గుందకు మమ్మ యనుచు ప్రయాణోద్యుక్తుండైయున్నంత, 195

ఆ రాము దేవికూరిమి, మీరన్ దీవించికరము ♦ మెచ్చుచుబంచెన్
శ్రీరామచంద్రునొద్దకు, సారభుజాహితవిదారి ♦ సామీరినొగిన్ 196

వ. అట్లుపంపిన, 197

ఒకమాఱు మారుతియు దా,నకలంకతమింటికెగసి ♦ యాపురిగనె నిం
కొకమాఱువచ్చి లంకన్, సకలాసుర నాశనంబు ♦ సలిపెదననగన్ 198

తదుపరి పావనిచనె వడి, చదలు తెఱవు ననుగమించి ♦ జవమెసగంగా
నెదనెపుడెపుడా రాముని,గదియుటశుభవార్తజెప్పగలుగుటయనుచున్

ఇటుచనిచని పావని తా,దటుకునగనె నబ్ధి ♦ దాటి తత్తీరమునన్
కటుసంరంభంబునద,న్నటుగాంచుచుబొబ్బలిడెడి ♦ యగచరచయమున్

వ. కనియచ్చోప్రవాలుచు, 201

జయమురఘురామమూర్తికి,జయమగచరులార! మనకు ♦ సౌమిత్రికినిన్
జయమధిపునకును నిక్కము,జయమరసితిసీతభూమి ♦ జాతంగంటిన్ 202

వ. అనవిని పెల్లుబ్బి బొబ్బలిడుచు, నబ్బలిముఖులొండొరుల నొఱసి కొనుచు, నిబ్బరంపుబెడందలనబ్బురంపడుచు, తెఱవుదరి గుబ్బలుల గొబ్బుగొబ్బున దాటుచు, పెల్లుబ్బునందబ్బిబ్బగుచుంజని రాముని సమీపించునయ్యెడ నన్నృపశేఖరుండును, 203

చనుదెంచుచుండ బోలును, కనుగొమ్మదెయనుజకపులు♦కారేవారల్
కనుమీావును సుగ్రీవా!మునువచ్చునతండు వాయు♦పుత్రుడుగాడే!204

వ. అని తహతహపడుచు డెందంబు సందడింపంగనుచున్న, 205

ఆలోజనె నాసత్కపి,జాలము మారుతియుమున్న ♦ జనగా నాసీ
తాలోలు రాము నెదుటకు, చాలగనుప్పొంగుచధిక♦సాహసమొప్పన్

చని రామ! సీతఁగంటిని, వినుమంచునుజెప్పె నెల్ల♦వృత్తాంతంబున్
జనవరుడు సోదరుడుదా, రనుపమసంతోషమంద♦హనుమముదమునన్

రామ! భవదాజ్ఞగొని సీ, తామాతను వెదుకబూని ♦ దక్షిణదిశకై
భీమగతి గములుగట్టుక, మేమఱిగి వెదకితి మెల్ల♦ మేదినియందున్ 208

ఎందెందు వెదకియును భూ, నందనఁగనలేకగడు మ♦నమ్ములుగుందన్
అందఱమయ్యెడచనితిమి,సందియమంచుచుమహేంద్ర♦శైలము కడకున్

అయ్యెడకు చనెడునప్పుడు,చయ్యనమముగాంచివచ్చి♦ సంపాతియనన్
ఇయ్యవని నెసగుఖగవరు, డొయ్యనచనుదెంచిసీత♦యున్నెడ దెలుపన్

వ. అప్పక్షివర్యుని చెప్పు తెఱంగు చొప్పునం జని, 210

కడు వెసఁజని యాజము దెస, కడ కడలింగంటి మద్ది♦కడు బెట్టిదమై
కడునడలిచె కపులను నే, కడపటఁ దడబడ క దాటి♦కంటిన్ లంకన్ 212

వ. అట్లు గని, 213

ఇక్కడ నక్కడననకయ,రక్కసుల పురంబు వెదకి ♦ రహిఁనచ్చోటన్
నొక్క యశోకవనంబున, చక్కగ జానకినిగంటి♦సంతస మెసగన్ 214

వ. మఱియు నట్లుగని, 215

ఆయమకుభవత్ క్షేమము,ఖా యతగతు లొప్పజెప్పి♦ హర్షింపగ న
న్నాయమ్మ కెఱింగించి, తదీయశిరోరత్నమిటకుఁ ♦ దెచ్చితినిదిగో!215

వ. అని యద్దాని నిడినంగొని, రఘువరుండును, పరమానందాశ్చర్య
మగ్నాంతరంగుండై, యువ్వెత్తుగ బొంగి పొరలు విరహానలంబు
నార్చు నానంద రసంబునం దొప్పదోగుచు, 217

కన్నులం నద్దికొనునుమఱి, క్రన్న నముద్రికనుమఱియుగరములనిముఱ్ఱ
మన్నారిసుఖంబే!యను,చిన్నికలికిమానికంబ ♦ చెప్పవెయనుచున్ 218

అంతట రామునిగని హను,మంతుండనె రామచంద్ర♦మత్కథవినుమీ
యంతట జోవకనే బలు,వింతల నొనరించి లంక♦విడిచి తెటులనన్ 219

సీతమ్మనుగనివచ్చెదు, నాతఱిలంకేశు బలము ♦ నరయ దలంచివే
ఖీతిడగతెం దిరిగితి పురి,రాతిరి ద్రిమ్మరులు నడలి♦రయగతి బారన్ 220

వ. ఇట్లుతిరిగి పెక్కండ్రు రక్కసుల నుక్కడంచి యక్షయుండను
రావణ కుమారుంజంపి, మేఘనాథుండనువాని బ్రహ్మాస్త్రంబున
కించుగ గట్టువడి రావణుసభ నిర్భయంబుగజొచ్చి యా చెనటి
కనేక తెఱంగుల దగవెఱింగించిన వినక యతండు కుపితుండై
నాతోకం గాల్పునట్లాజ్ఞచేసిన, 221

తోకన్నిప్పనుగొంచును, భీకరగతి లంకగాల్చి ♦ భీభత్సముగా
రాకాసులడలిపఱవగ, జోకగొనుచు సీతకడకు ♦ సొరిదిన్ జనితిన్ 222

అంత ననుగాంచి సీతా,కాంతయు దీవించి లోన♦గడునలరియనెన్
పంతముమీఱగ నస్మ,త్కాంతుని లక్ష్మణునియిటకు♦గడు వెసదెమ్మా

మఱియనుము లక్ష్మణునితో, నెఱుగక యలనాడుపలికి♦ తెగ్గులనెన్నే
మఱువగ వేడితిననుమా,మఱదింగొని తెమ్మహనుమ♦మసలకనీవున్ 224

వ. అనిచెప్పి పుత్తెంచె మఱియు నాయమ దుస్థితి తెఱంగెఱింగించెద
వినుమని పావమానియు, 385

సింగముల నడుమనున్న కు,రంగివలెన్ దనరె సీత ♦ రాత్రించర దు
ష్టాంగనలమధ్య మీఁదా,నుంగర మొప్పారె కంక♦ణోన్నతి నతికిన్ 226

భవదీయనామమన్నము, భవదీయంబైనచింత ♦ పానంబుంగా
భవదీయాగమనాశయె, యవిరళ మభ్యుదయమనుచు♦నతివ బ్రతికెడిఁ

అన వెచ్చనూర్చుచున్నని, యినవంశజుఁడనుమ గాఁగ♦లించియనియె నో
ఘన! మనిచితి మదితాపం, బునునార్చితి నిన్నుఁబోటి♦పుణ్యులుగలరే! 228

అనిమెచ్చి యనంతర మా, యినకులశేఖరుడు రాము డినసుతు సుగ్రీ
వునిగని వానరసేనల, గొని చనుదముతడయ నేల♦గొబ్బున ననఁగ 229

చిత్తంబని సుగ్రీవుం, డత్తరి కపిసేనలకును♦ ననుమతి నిడె నా
యత్తపడుడి చనిలంకా, పత్తనమునదాడిసలుప♦వలెనిపుడనుచున్ 230

వ. అనంతరం బవ్వానరానీకంబు లరణ్యంబులఁదూఱుచు తరుశాఖలం బాఱుచు, తెఱవుదరిగుబ్బలులం దూకుచు తచ్ఛిఖరంబుల కెగ బ్రాకుచు శాఖాచరనామం బన్వర్థంబుగ నేలవిడిచి చాలదవ్వు చెట్లపైననేగుచు, రామసౌమిత్రులు హనుమదంగదాంసతలంబుల నధిష్టించి సేనామధ్యంబునంజనుదేర, నతిరయంబున ననతికాలంబున దక్షిణసముద్ర వేలాతలంబుందఱిసి రయ్యెడ రామసౌమిత్రులొక్కయెడ సుఖాసీనులౌటయు, 231

ఆశీస్సు

ఈరామచరిత మిల నె, వ్వారలుపఠియింత్రుభక్తి ♦ వారల కగు సీ
తారామకరుణ ననవర, తారోగ్యాయుర్యశంబు ♦ లభ్యుదయంబున్

కాండాంతము

యోధాగ్రేసర! భాసుర, బోధాంచితగమ్య! పుణ్య♦పూరుషచయర
మ్యాధార! మౌనివర్యారాధిత! కరుణాప్రసన్న!♦రాఘవరామా! 232

లోకావన సత్వగుణా! లోకాశ్రయ! లోకవంద్య! ♦ లోకాతీతా!
లోకాలోకితకరుణా! లోకేశ్వరపూజ్య! దివ్య♦లోలుపచరితా! 233

గురుమాన్యపదాంబోరుహా, వరసేవాసక్తసుజన • వశ్యా! మహాత్మా!
పరిపూర్ణ! నిత్య! నిర్మల! విరత! చిదానంద! సత్యనిశ్చల! రామా! 234

## గద్య

ఇది శ్రీమత్సీతారామచంద్ర సాంద్రకృపావిశేషప్రసాదిత
కవితావిశేష, సాధుజనసేవాపరాయణ, వినయ
ధురీణ, సేవితరామభద్రభక్త, వీరభద్రోక్త
శ్రీమత్కాండరామాయణంబునందు
సుందరకాండము
సమాప్తము



ఓం శ్రీ సద్గురుస్వామినేనమః

శ్రీ శ్రీ రాధాగోవింద భగవతేనమః

# శ్రీమత్కందరామాయణము



## యుద్ధకాండము

శ్రీ జానకీమనోజ! వి
రాజిత సంగ్రామధామ! ♦ రవిశత సమసత్
తేజోవిశేష! జితరిపు
రాజ ప్రణుతపాదసీమ! రాఘవరామా! 1

వ. ఆకర్ణింపు మట్లు రామలక్ష్మణులు ససైన్యులైన సుగ్రీవుండు
గొలువ పారావార తీరంబుం జేరి, 2

ఎదుటం గని రావీరులు, చదలం బడి తుంగభంగ ♦ సమితి భయదమౌ
నుదధి నపారముదం బెడ,గదియగ కపులెల్లగూడి ♦ కళవళ పడగన్ 3

అట్టియెడ కపులు కొందఱు, యెట్టులొకో దాటనేర్తు ♦ రియ్యబ్ధిని రా
పట్టులనుచు దమమనముల,బిట్టుగ యోచించుచుండ్రి ♦ పెలుచననంతన్

రాము విభుడని యెగంటివె, సౌమిత్రీ మనలఁగాంచి ♦ సాగరు డుబ్బెన్
ఈమహానీయుని వేడెద, నీ మెయి లంకకును ద్రోవ ♦ నిచ్చుటకును నై

వ. అని బహుతెఱంగుల నాతనిం బ్రార్థించియు బ్రసన్నతఁ బడయం
జాలక, 6

రోషించి రాఘవుడు కడు,శోషిల్లగఁ జేతునబ్ధిఁ ♦ జూడుమటంచున్
రోషారుణేక్షణముల వి,శేషాగ్రహ మెసగ వింటిఁ ♦ జేకొని నిలువన్ 7

వడవడవడకుచు నయ్యెడ, జడతవిడిచి జడధి రాచ ♦ జడదారియెడన్
గడుజడిసి యడుగు దమ్ముల,బడి కడువడి వినుతిసేసె ♦ భక్తియుతుండై

ఓరామ! రఘుకులేశ్వర! సారామలకీర్తిసాంద్ర! ♦ సాధుశరణ్యా!
చారుస్వరూప! జగదాధార! త్రిమూర్త్యాత్మ! నీకు ♦ దండంబనఘా

అగణిత సాత్త్వికమూర్తీ!, త్రిగుణాతీతాత్మ! దేవ♦దేవేశ! హరీ!
నిగమాంతవిదితసుచరిత!, జగదీశ్వర! కావుమయ్య♦శరణము రామా!

వ. అనివేఁడికొని శరణుజొచ్చిన దీనజనత్రాణుండగు రామదేవుండతనికి
ప్రసన్నుండై లంకాపురంబునకుంబథంబు నిశాసించుడా జలధీశుం
డును, భయవినయవినమ్రుండై దోయిలించి రామునకిట్లనియె. 11

బలవదరి గర్వభంజన! కలఁడొక్కఁడు నలుఁడనంగ ♦ కపిముఖ్యుఁడు నీ
బలగంబుల నతఁడోపును, జలధికి సేతువునుగట్ట ♦ సరగున గానన్ 12

కట్టింపుము సేతువుదద,ముట్టింపుముదనుజకులము♦మునులకు మగుడన్
బుట్టింపు మాత్మమోదము, గట్టిగరఘురామ! నీకు♦కళ్యాణమగున్ 13

వ. అనిన లెస్సయని యతనిపలనంబూజితుండై రఘుకుల సార్వభౌ
ముండు సముద్రుం బోననుజ్ఞయిడి సేతునిర్మాణోద్యుక్తుండై సుగ్రీ
వునకుఁ దదావశ్యకతం దెలిపిన, 14

ఆకపి నాథుండంతట, నాకపి సైన్యాధిపతుల ♦ కందఱికనె మీ
రీ కడలిగట్టగావలె, వే కొనిరండిటకు నలుని ♦ విశ్రుతశీలున్ 15

అన నలుపురస్కృతుంగా, నొనరించుక వానరోత్త♦మాఘము చని స
ద్ఘన సత్త్వజవము లెసగం, గొనితేఁజనిరంత పెద్ద♦కొండల శిలలన్ 16

వ. మఱియు, 17

కపులు శిలలు వెకలింపుచు, విపుల బలోద్రిక్తులగుచు♦వెసగొని తేఁజన్
అపుడుగనన య్యో సురలకు, విపరీతపు పక్కిగములు♦వెలువడెననగా

వ. మఱియు, 19

ఉన్న మెడననుండుచుదా,రన్నగములనొదలువిసర♦నందుచొఁ వలకున్
గ్రన్ననవిసరుచునందుచు,తిన్నగనలునకును చేఁజ♦దిగుచుచు మఱియున్

గంతులువైచుచు నద్రుల, బంతుల క్రియపట్టి విడిచి♦బలగతి దిరుగన్
దంతిహరిశరభ ముఖమృగ,సంతతులాహాతులనలిగి♦చలగతిబారెన్ 21

వ. ఇట్లు శతయోజనాయతంబగు సముద్రంబునకు నవలీలఁ గట్టగట్టి
కేరుచు,నలాగ్రేసరులై వానరులురామచంద్రుని దర్శించిరట్టియెడ,

ఆవార్తగాంచు సభలో, రావణునకు దనుజులెల్ల ♦ రయగతిజెప్పన్
దావిని విభీషణుండను, రావణుసోదరుడు లేచి ♦ రహి నిట్లనియెన్ 23

నాడాంజనేయు డగ్రజ! యాడడె నీహితముఘాంకెు♦నతి నయగతిమై
చూడవె నీవు నతెపునీ,వీడెల్లను గాల్చి సీత♦వీక్షించుటయున్ 24

ఒకకోతె యంతకోపిన, నికవెక్కులుకోట్ల కోతు ♦ లేతెంచెడి నో
డక నింకనేమి చేటగు,నాకో! లంకకు నీవు దీని ♦ నూహింపగదే! 25

ఆరామచంద్రు నరుడని, యూరక కయ్యమ్ముఁదేఱ♦నూనెద వకటా!
ఘోరారి గర్వభంజను, డారయ విష్ణుండురాము♦డమరులుకోతుల్ 26

వ. మఱియు నా రామచంద్రుండు స్వభావంబునం బొడగట్టు విధ
మెఱుంగు మెట్లనిన, 27

శరణాగతావనరతుం,డరయ కృపామేయుడెన్న ♦ నంచిత శీలుం
డురు బాహుబలగరిష్ఠుం,డరిగణహృద్భయముడెంచ♦నార్తాప్తుండున్ 28

వ. మఱియు, 29

సీతయుగనుగొన త్రిభువన,మాతగదే! యనుపమాన♦మానితసుగుణో
పేతయు పూతాత్మయు గా,దే! తత్సతిఁదెచ్చి చేటు ♦ దెచ్చితి●తగునే !

ఇపుడైనఁగలదు తరుణము, కపటమువిడి, సీతనిచ్చి♦ కావుమటన్నన్
కృపగాచు నతడు నెత్తిని, విపులగతిం గొఱవిగోకు♦వెట్టులుగలరే!31

అని వెఱపుమఱపు నెఱుగక,యనుజన్మిండాడుమాట♦లన్నియువిని రా
వణుఁడుగ్రతగద్దించుచు,ననియెం దనమంత్రులంద♦ఱౌనని పొగడన్

ఇమ్మెయినెంతయునరికి భ,యమ్మందెద వస్మదీయ♦మౌ భుజబలమున్
తమ్ముడ!వినవోకనవో,కొమ్మ మెకము లేమిసేయు♦గుఱుతుగమనలన్

చెండెద కపులఁ గిపులను, భండనమునగూల్తునరుల ♦ భయమందెదవే
నండగొనుము చనివారల,నుండదగ పురిపులబోగడి ♦ యులుకుచునిచటన్

ఆ వానరాళితోడన, నీ వాలమునందు బడక ♦ నిలిచెదవేనిన్
రావచ్చు నవలనైశము, పోవలయును లంకవిడిచి ♦ పోపొమ్మింకన్ 35

వ. అనిన యన్నంగని దైత్యేంద్రానుజుండును, 36

ననుభీరువుగా దలచితె! యినవంశజు శక్తి నీకొ ♦ కించుక దెలుపన్,
ఘనమగు నీక్షేమమ్మున, కనువుదెలిసి పలుకుటింత ♦ యాజడియానే!

వ. ఇంతకు, 38

రోగికినోగింబథ్యంబు వి,రాగికి భోగంబు భోగ ♦ రతునకు శాంతం
బీగికి నాసయు కాంతా, రాగికి సద్ధితము మెచ్చ ♦ రాదెవ్వేడలన్ 39

కావున నేనిప్పుడ యో,రావణ! చనుచుంటి నిదిగొ ♦ రామునికడకే
యావల నీవుంగనెదా, భూవిభుగడు వెక్కసముగ ♦ భూరిరణమునన్ 40

వ. అనిచివ్వునలేచి తనయనుంగు ప్రెగ్గడలంగూడి యాకాశవీధింజను
దెంచు నయ్యెడ, 41

వినువీధింగనుంగొనె న,య్యినకులశేఖరుని సైన్య ♦ మెంతయుభీతిన్
దనుజాధినాథు సోదరు, ననఘాత్ము విభీషణాఖ్యు ♦ నయ్యెడమఱియున్ 42

అట్లుగనిప్లవగవీరులు, గట్టులచెట్టులను శిలలఁ ♦ గడువెసగొంచున్
బిట్టేసిదనుజుఁగూల్పగ, గట్టిగ సంరంభమొప్ప ♦ గను పట్టుటయున్ 43

మారుతియు వారినందఱ, వారించియతండు దనుజ ♦ వరుడని తెలుపన్
ఆరఘుకులమణి యాతని, ధీరతఁదనయొద్దకపుడ ♦ తేనాజ్ఞయిడెన్ 44

వ. అట్లు గొనితేబడి యతండును, 45

శరణాగతుండ నసురుడ, నరివర్గమువాడ రామ! ♦ యభయంబీవే!
గురుబలుడు రావణుడు సో,దరుడని నేహితము జెప్పఁ ♦ దఱిమెన్నన్నున్

అను దనుజాధిపుసోదరు,గని రాముడు కూర్మిజూపి ♦ కడువెసననియెన్
విను మాకుసఖుడవై తివి, గొనుమిచ్చెద లంకనీకు ♦ గోరికననుచున్

మన్నించుకంతయేని ప్రభ, సన్నుంగావించి యెవడు♦ శరణాగతుఁడై
నన్నరునకిత్తు నభయము. గ్రన్ననిదె మద్వ్రతంబు♦ గనుమెపుడనఘా 48

వ. అనియొక్క సుముహూర్తంబున, సేతుప్రయాణంబు సాగించి యనతికాలంబున లంకాపురోత్తర తీరస్థంబగు సువేలాద్రిపై సర్వసైన్య సమేతంబుగ విడిసిన, 49

ఆవార్తదెలిసి రావణుఁడావేళన వేగఁబనిచె ♦ నరిసైన్యంబుఁ
వేవేగ ణించి తెలుపగ, ఠీవిగ శుకసారణులగ ♦ డెందిగణకులన్ 50

పంపినవారును జని కడు, తెంపరులై వానరాకృ♦తిం గొంచుగడుఁ
బొంపిరివోయెడు జనగతి, సొంపెసగంబ్లవగ సేనఁ♦జొచ్చి వెదకుచోన్

అక్కుహనాకపులంగని, గ్రక్కునదాఁబట్టి రాము♦కడబెట్టె వెసఁ
రక్కసితేనియనుజుఁడా, తెక్కలిరక్కసులులోన ♦ దిటమఱికుండఁ 52

వ. అనంతరంబా రాముండా దనుజుల శిక్షింపక వానరసేన నెల్లెడం ద్రిప్పించి లెక్కించుటకనువుగ వీక్షింపంజేసి సకరుణంబుగ మన్నించి పుత్తెంచినంజని, 53

వారును రావణుఁగని విను, మో రాక్షసరాజ! మేము♦నుత్సాహమునన్
ఆరాము సేన జొచ్చితి, మారసి వచ్చితిమి వాన♦రావళి నెల్లఁ 54

సింహాభాయుత బలు లరి, సంహారులు ననుపమోగ్ర♦సాహసులును స
ద్రంహులు బహుళోగ్రాయుధ, సంహితులగు కపుల నెన్న♦శక్యమె మాకుఁ

కొండలు పిండిగఁ జేతురు, భండన మనదనుజు లనిన♦పడివత్తురొగిఁ
గండుమిగిలియున్నారలు, నిండుబలిమిఁగలిమి కపులు♦నిండిసవేడ్కఁ

వ. మఱియు, 57

ఆ రఘువీరునిఁ దెలిపెద, మో రావణ! వినుమతండు♦నున్నతభుజుఁడుఁ
ఘోరశరాసనుఁడును బహుక్రూరాస్త్రుఁడుగ్రమూర్తిగురుబలుఁడు మఱిఁ

ఆరాము ననుజుఁడాయత, దోరంతరుఁ డురుబలుండు♦దుర్దమ తేజుం
డౌర! త్రిపురహరునంతటి, శూరుండవ్వానిఁ దేఱి♦జూడం దరమే? 59

వ. అని వెండియు, 60

మే మెంతగ యోచించిన, నీమహితుల నెదురువార ♦ లీల్గుట నిక్కం
బౌ మానదింత గావున, భూమిజనిడి శరణుపొంద ♦ బోలును వారిన్ 61

అనినన్ వారలఁగనలుచు, దనుజేశుడు మూర్ఖులార! ♦ తలగుడు చెడుగుల్
వినవొల్ల మీదువాక్కుల, మనుజులు కపులనిన నెం ♦ తమాత్రము భయమే!

వ. అని వారల ధిక్కరించి నిజసదనంబునకుం బోయె నటరామచం
ద్రుండును, 63

పనసుఁదగనుత్తరపుగవ, నున పడమట జాంబవంతు ♦ నుం దక్షిణమం
దునగవయుతూర్పుగవనునహనుమంతున్బలములిచ్చియయ్యెడనుంపం

ప్రాకారములకు నెక్కియు, రాకాసులఁబట్టి కొట్టి ♦ రహిఁబురుజులకుం
బ్రాకియు పడగొట్టియు పె, న్వీకనునాకపులుకడిది ♦ వీరంబొప్పన్ 65

మేడలఁగూల్చుచుకోటల, గోడలవాల్చుచునుకోట్ల ♦ కొలది యసురులన్
వాడలచదుపుచుబెడిదపు, జాడల చరియించుప్లవగ ♦ జాలముఁగనుచున్

భయమందిరక్కసులు జని, రయగతి నావార్తఁజెప్ప ♦ రావణుడలుకన్
మెయికంపమొందమంత్రుల, కయివేగమవార్తఁబంపె ♦ కడు వెసరాగన్

ఆవార్తంగనివేచని, రావణునకు మంత్రు లనిరి ♦ రక్షోధీశా!
ఈవానరులును నరులును, దేవర కొకలెక్కయౌనె ♦ తెలియుడిగానన్

దేవాంతకుని నరాంతకు, దేవ! మహోదరునిత్రిశిరు ♦ ధీరతఁబంపన్
వావిరిజని యావీరులు, నావానరనరుల నణతు ♦ రతిశీఘ్రముగన్ 69

వ. అన నద్దనుజాధీశుండును వారలం బంచిన, 71

ఎదిరి నెఱుంగని రభసము, గదురగ సింగములదాకు ♦ కలభంబులు నా
మదిచెడి దనుజులు రాముని, నెదిరించిరి వారిగనుచు ♦ నినకులవిభుడున్

ఘోర శరాసనమునబల్, నారాచంబులనుగూర్చి ♦ నాల్గిట నేసెన్
వీరోద్రేకుల దుష్టా, చారుల క్రూరులను భయద ♦ సారుల నంతన్ 73

తక్కిన రక్కసిమూకలు, నక్కిపిచయధాటి కోర్వక నివడనుసురుల్
దక్కిన కొందఱుఁజని యా, రక్కసిఱేనికిని నని తెలంగఁ జెప్పన్ 73

ఉలికిపడె వారిపలుకులు, ములుకులుగాఁదగిలి కర్ణములు సిందరవో
నలఘుతరబలులు త్రిశిరా, దులు వోయిరి నరులతోడి దురమున ననగా

వ. ఊరకున్న మించివచ్చునని యెంచి రాత్రించరకులవల్లభుండు
కుంభకర్ణునిం బిలువంబంచినంజని, 76

రక్కసులుకరులచేతం ద్రొక్కించుచువాద్యతతుల మ్రోయించుచునుఁ
బెక్కగతుల శ్రమపడియా, రక్కసిమేల్కొలిపిరంత రయగతిననతఁడుఁ

రావణునొద్దకుఁబోయిన, వేవేగమ దనుజపతియు వీక్షించియనెఁ
నీవేగి మనుజవీరుల, నావానరవరులఁ జంపుమా వెసననినఁ 78

వ. కుంభకర్ణుండును పూర్వజ్ఞాన వశంబున నన్నంగని, 79

రాముఁడు మనుజాతీతుఁడు, శ్రీమహిళాకాముఁడెల్ల శిష్టావనుఁడుఁ
ఈమహిధర్మస్థాపన, కై మనుజాకృతి ధరించి నట్టిడుగానన్ 80

ఆభువన పావనునితో, నాభండన మండనునితో నాహారితోడఁ
ఈభంగివైరమెందుల, కా భూమిజ నిచ్చి శరణమందఁగరాదే 81

వ. అనిన వినక మండిపడు నన్నమాట త్రోసిపుచ్చక రాముచేతం
దెగుట మోక్షప్రదంబని యెంచి యనిసేయ నిశ్చయించి, 82

ఆకుంభకర్ణుఁడేగె భ, యాకంపిత భూమి భాగుఁడగుచు మహాభీ
లాకృతిచకితారాతి మ, హా కపిజాలుండునగుచు నయ్యెడ నంతఁ

ఇటులేగుచు కుటిల భ్రూ, కుటిదనుకగ పటపటంచు గొఱుకుచు పండ్లా
ర్భటి సెలగఁ గపులకు బా, లిటి జముఁడోనాగ దివిని లింపులు బెగడన్

పోనీక మూకలుగదా, వానరులంబట్టికొనుచు వడి మ్రింగుచునుఁ
నానాగతులుగ హింసను, బూనియొనర్చుచును దిరిగె భుజబలమెసగన్

వ. మఱియు నట్లు ప్రళయ కాలరుద్రుంబోలి భయోత్పాతుండగుచు

దిరుగుచు కపులెల్లరుం భయంపడి చిందరవందరలై యెదుట
నిలువనోడిపఱచుచుఁ దమలోన నిట్లని తల్లడిల్లదొడఁగిరి, 86

వెక్కసపుభూతమఱజే! యెక్కడిదోకోకట్ట!యిట్టి ♦ వెన్నిటగలవో!
చక్కడచెడి మనలంగను,నిక్కంబికకపులమృత్యు♦నిలయంబౌరా! 87

అనికపులు భీతిఁబఱచుట, వనచరబలగంబు పలుచ♦నవుటయు నెల్లన్
గనిరాముడు బ్రహ్మాస్త్రం,బున గూల్చెను కుంభకర్ణ♦భూరిగభీరున్ 88

వ. అట్లు ఱెక్కలుదెగిన కుంభినీధరంబు భంగి కుంభకర్ణుండు కుంభినిం
గూలుటయు నావార్త విని ఘూర్జిల్లి కొంతవడికి తెలివొంది,

అతికాయుబంపె నంతట, దితివంశవిభుండు నధిక ♦ తేజోయుతమా
గతినాతండును నాగా,యుతసత్వుడు రాముతమ్ము♦నుద్ధతిదాకన్ 90

నానాస్త్రంబుల శరసం,ధాన మెసగబోరిరంత ♦ దనుజుఁడు నరుఁడున్
వానరదనుజులు గనితమ,వానిన్ గడుమెచ్చిజయము♦వాంఛింపంగాన్

వ. తదవసరంబున, 92

వరుణాస్త్రమేసె నలరఘు,వరుతమ్ముడునదియుఁదాకె♦వృక్షమ్మున నా
సురవైరి దానఁగూలెను, గరులు దెగినబడెడునద్రి♦కైవడినంతన్ 93

ఆవృత్తాంతము దెలియుచుఁ,దావనటంగుందిపిదప ♦ దైత్యాధిపుడున్
వేవార్తనంపెఁ దనసుతు,డా వాసవజేతబిలువ♦ నత్తఱిమఱియున్ 94

ఇంద్రజిత్తంతనచ్చె మ,హేంద్ర విభవమెసగనధిక ♦ హేలాగతి రా
జేంద్రులఁగెలిచెదనంచును, సాంద్రసుతేజంబెసంగ ♦ చయ్యననంతన్

సురనాయక కంటకుడిటు, బిరబిరచనియేసెన చల♦బిట్టదరంగా
వరలెడిబ్రహ్మాస్త్రమువా,నర నరులిలఁబడుచుకడువ♦నటమ్మోఁగుందన్ 96

వ. అట్లు లోకభీకరంబగు బ్రహ్మాస్త్రంబేసిన నద్దానివలన హనుమ
ద్విభీషణులు తక్క తక్కిన యెల్లరును నొచ్చియో సచ్చియో
భువింబడి యుండుటయు, 97

అసురాధినాథసుతుడును, కసిమసగిరి శత్రులింక♦శదనావనిపై
ను సురులను బాసివడిరిక, వెసబోయెద తండ్రి కడకు♦వేఱుంబుడిగెన్ 98

అనిచనుటయు నొయ్యనఁ గని, యనిలజుఁడును నసురనాథు♦ననుజుఁడు వీకన్
జనితనుకు కొఱవులంగొని, గనుచుండిరి ప్రాణమున్న♦కపివీరులకై 99

వ. అట్లు కనుచు సజీవుండై యున్న జాంబవంతు నుపదేశానుసారం
బుగ హనుమంతుండును కలనిం బొలిసినవారలం గ్రమ్మఱ బ్రతి
కింపనోపు నౌషధంబులం దేఱ నిశ్చయించి ద్రోణాచలంబునకు
నతివేగ మఱిగి తచ్ఛిఖరాంత స్థంబగు నౌషధాళిం గొనివచ్చి
యామృతులం బ్రతికించినం గని రాఘవుండును నపరిమిత ప్రమో
దంబునొంది మరున్నందనుం గౌఁగలించి, 100

అనఘాత్మ! మిత్రుఁడొకరుఁడు, నినుబోటి మహాత్ముఁడరిది♦నిక్కంబెందున్
విను నీఋణంబు దీర్పం, గను నాకు తరమ్మె విమల♦నయగుణచరితా
వ. అని మెచ్చు నయ్యవసరంబున, 102

రావణు కొమరునిచేతను, నావానరవీరులెల్ల♦రనిబడిరంచున్
దావీక్షింపగ నరిగిరి, వేవేగమ యసురులెల్ల♦వింతగ నంతన్ 103

ఆరాము సేనలన్నియు, భూరితరానందమెసగఁ♦బొంగుచు నుండన్
వారాశిబోలు వారల, తీరుంగని రావణునకు♦దెలిపిరి వారల్ 104

అటు తెలుపన దరియసురుఁడు, కటములదర పండ్లుకొఱికి♦కలగుచు కుంభున్
కుటిలుని కుంభప్రజంఘుం, తటుకు ననలశోణితాక్షు♦తగ బంచుటయున్
బిరబిర చనియయ్యసురలు, శరములనడిదములగొంచు♦జడిగొను కడిమిన్
పరిఘలముసలంబుల ము, ద్గరములఁగొని కపులునడల♦కదనము సేయన్
అంగదుఁడు శోణితాక్షుఁ గ, నుంగొని యవ్వానిరథము♦నుగ్గుగ చదుపన్
చంగున నతఁడుం బొడుచుట, యుంగని తాదన్ని చంపె♦నుగ్రతకపియున్
అంతప్రజంఘాఖ్యాసురు, డెంతయు సమ్మెందుముష్టి♦నేయుటయును బల్
పంతంబె సంగమైందుఁడు, వింతగ నయ్యసుర శిరము♦వేద్రుంచె నసిన్
వ. అంత. 109

గిరిగొంచు నేసె నంగదు, డురుముగ కుంభుని శతాంగ ♦ మడఁగఁగ దానిన్
పరగతి దాటుచు నసురుం, డురుముసలంబూని వేసె♦నుగ్రత నంతన్ 110

గిరియొండు గిరిని ఢీకొను, కరణిం దనుజుండు కపియు♦ కరకరిఁబోరన్
అరుదయ్యె బవరమయ్యెడ, సురరిపు డేడమ్ము లేసె♦స్రుక్కఁగ కపిపై 111

అద్దాన నంగదుండును, తద్దయు మూర్ఛిల్లి వఁకుట♦దాఁగని రాముం
డద్దనుజుఁ జంపఁబంపెను, గ్రద్దన సుగ్రీవు హనుమఁ♦గడు వెసనంతన్

వడివడి వారునునటజని, కడుకోపంబొప్పఁదనుజుఁ♦ గడిదిశిలలచే
సుడివడగ మోదుటయు నా, గడుసరి రక్కసియు వాని♦ఖండించి వెసన్

రవిజుని దాకిన నతడును, వివిధగతులఁ బోరుసలిపి♦ వీరంబొప్పన్
తవిలిఘనముష్టి బొడిచిన, దివిజారి యురంబువగిలి♦దిగ్గనఁ గూలెన్ 114

తదనంతరంబ కుంభుఁడు, కదనంబునఁ గూలగనుచు♦ఘనుఁడు నికుంభుం
డెదఁగడిదికినుక నాకపు, లదరి పఱవ వచ్చెనంత♦నర్కజుదాకన్ 115

వచ్చినవాయుజుడునుదా, నెచ్చగు ధైర్యంబుతోడ♦నెదిరియసురునిన్
జెచ్చెరఁదోకంజుట్టి వి,యచ్చరులలరంగ నేల♦నణచిన నంతన్ 116

వారణశత సమబలు లా,ఘోరాసురవీరు లవనిఁ♦ గూలుటగని ర
క్షోరాజవర్యు డంతట, చీరెన్ మకరాక్షు వీర♦శేఖరు నంతన్ 117

ఆమకరాక్షుడు జని సం,గ్రామ మహాభయదుడగుచుఁ♦గడుకపులడలన్
భీమగతి రణమొనర్చుచు, నేమెయిఁదన కెదిరిగాన♦కెలమిదిరుగుచోన్

ఆరామచంద్రు డప్పుడు, భూరిపరాక్రమమెసంగఁ♦బొంగుచునోహో
హోరాక్షసాధమా! యిఁక, శారాత్రుంగింతునిన్ను♦రయగతి ననినన్

ఆయసురుండును నార్చుచు, మాయయ్యనుజంపితంట♦మానకనినునే
నీయాహవమునఁ బొరిగొని, వేయముపాలికిని బంప♦ విచ్చేసితిరా 120

అనిఘోరసాయకంబుల, ఘనతరచాపమునఁగూర్చి♦కడువెసనేయన్
ఇనవంశవర్ధనుడుఁదా, ననుపమగతి ద్రుంచెవాని♦నన్నిటిని వెసన్ 121

ఒకశరమున సారథి నిం,కొక బాణంబునను రథము♦నొక్కటవింటిన్
శకలములు చేసినం భూ,మికినుఱికియతండుకడిమి♦మెయిగదగొనుచున్

వగలుపు దోపగదనుజుడు, దగరు మహీంధ్రంబుదాకు ♦ దండడితోపన్
నగధీరురాము గదగొని, పగగొనివై చుటయు రామ♦పార్థివుడలుకన్

చిచ్చులకోలంగొనుచు వి, యచ్చరరిపుఁగూల నేసె♦నంబరవీధిన్
రిచ్చవడిసురలు చూడగ, నచ్చెరువడి కపులురిపు ల♦హాయననంతన్

వ. ఇట్లు మకరధ్వజుండును గూల నవ్వార్త చెవులకు శూలంబులీలం
దగిలిన రాక్షసేశ్వరుండును వార్ధక్యంబున కాలము వృధాపోయెనే
యని విచారించు కర్మబద్ధుండగు మూఢాత్మునివలె చింతించుచు
యుద్ధాదింగొలె యంతవరకు నాహవనిహతులగు దేవాంతకనరాం
తక మహోదర త్రిశిరులను, కుంభకర్ణాతికాయులను, కుంభ
నికుంభ ప్రజంఘ శోణితాక్షులను. ఖరనందనుండై న మకరాక్షునిం
దలంచి పెల్లుబ్బునంబొంగి పొరలివచ్చుచున్న దుఃఖంబుం బట్ట
జాలక నిజసుతుండగు మేఘనాదుంగని, 125

ఔర! మనబలగమంతయు, నీరీతిగ దెగియె నొక్క♦డేనింబడెనే!
యీ రఘువరుసేనల నా,హా! రాముని నరుడటంచు ♦ ననగాఁదగునే

వ. మఱియు, 127

నాగాస్త్రముబ్రహ్మాస్త్రము,బాగుగనాటియునుభూమి♦బడిచచ్చియు నే
లాగునమగుడంబ్రతికిరో,యీగతిరిపుచయము నెచ్చ♦లేఁగంటి మొకో

అని దైన్యాలాపంబుల, జనకుడు రక్షోవిభుండు ♦ చపలత బలుకన్
గని మేఘనాదుడనియెం,ఘననిస్వన మొప్పనతుల ♦ గాంభీర్యంబై 129

ఏ నేగియొక్క మెయి నా,వానరులను నరులబట్టి ♦ వడిమడియింతున్
మానుముభయమీ వెదనిక, దానవలోకేశ! యనుచు♦దద్దయుఁజనుచున్

చండవరదత్తబలుడై, గండుమిగిలి యింద్రజిత్తు ♦ గగనంబున కు
ద్దండగతినెగసి బాణం, బొండువిడిచె నిరులుగ్రమ్మ ♦ నుర్వీస్థలిపై 131

ఆయంధకారమందున, నాయగచరులరినిగాన ♦ కటునిటుఁ జనుచున్
ఆయవనినెల్ల దిరిగిరి,పాయక నాయను వెఱింగి♦పావని నృపుతోన్ 132

ఓయధిప!యంధకారము, వాయువ్యాస్త్రమ్ముతోడఁ ♦ బాయునుదాని
న్నే యుమయనినను న్నారఘునాయకుడును దానిగొబ్బ నన్విడుచుటయున్

తమము విడిచెగ గనముదు, ర్ధముడై యసురేశసుతుడు ♦ ధరణికిఁ జనివే
గమె సగ గములగుకపులకు, జముడై భుజశక్తి మోద ♦ సాగిన నంతన్

మారుతియు విభీషణుం డరి, వీరులపై దాకి భయద ♦ విహారణు లగుచున్
వైరులదఱుముచు దునుముచు, దారుణమారణ మొనర్పదలకొనిర పుడున్

ఆ మేఘనాదు నెదురుగ, భీమగతిం జనియె నరికి ♦ భీప్రదుఁడగుచున్
సౌమిత్రిఁ యార్చుచునుసు, స్థేముండై దైత్యులెల్ల ♦ చెదరుచుఁ బాఱన్ 136

ఆరీతిగ జనుదెంచెడి, యారాముని తమ్ముఁగాంచి ♦ యమరారియుదా
ఘోరాస్త్రవితతి నేసిన, వీరాగ్రణి లక్ష్మణుండు ♦ వెఱువక వానిన్ 137

కడునిశితాస్త్రంబులగొని, వడివడిదానేసి తునిమి ♦ వాసవరిపునిన్
కడిదికడిమి నొకశరమున, పుడమిం బడనేసె విపుల ♦ మూర్ఛాగతుగన్

అంతట నసురుడు దానుం, గొంతవడికి దెలిసియ మిత ♦ కోపోద్రేకం
బెంతయుని నుమడి కాభూ, కాంతుని బాణముల మూట ♦ గడు వెస నేయన్

నరవరుడు క్రుద్ధుడై ఘన, శరమున నాదైత్యు నేసె ♦ చాపము ద్రుంగన్
అరదంబు నేసె నొకటన్, దిరముగ మఱియొకట సారథిని గూల్చెనటన్ 140

వ. మఱియు పరస్పర రోషములినుమడింప జయకాంక్షలు మీఱ ప్రాణాశ
లవిడి బోరునయ్యవసరమ్మున మేఘనాదుండును, 141

నాగాస్త్రమేయ నరుడును, తాగరుడాస్త్రమున ద్రుంచె ♦ దద్దయు దానిన్
వేగకుబేరశరంబును, తాగురుతుగ విడిచెనంత ♦ దైత్యాగ్రణియున్

ఇంద్రాస్త్రమేసె గనిరా, జేంద్రుడు తద్బాణమడగ ♦ నెంతయుఁ గనియా
యింద్రారివారుణాస్త్రము, సాంద్ర పరాక్రమము వెలయ ♦ చయ్యన నేసెన్

వరుణాస్త్రమడగ నేసెను, అరుదారగ రాముతమ్ముఁ ♦ డైంద్రాస్త్రంబున్
సురరిపుడంతట నరుపై, వరగంధర్వాస్త్రమేసె ♦ వడిలక్ష్మ డున్ 144

శశిఖండ బాణముంగొని, విశద గతిందనుజసుతుడు ♦ విడిచిన గంధ
ర్వశరమ్ము ద్రుంచిబల్విడి, నిశితభుజగశరముబూన్చి ♦ నేర్పొప్పంగా 145

వ. మఱియు నశ్లేయంబూని రాముండు సత్యసంధుండయేని వేదంబులు లోకప్రమాణంబులయేని యేను రాఘవేశ్వరు నెల్లకాలంబుల త్రికరణశుద్ధిగ సేవింతునేని దానవుండు దీననిశ్చయంబుగ దెగుంగాక యని తలంచి గుఱిసేసి యేసిన, 146

అసురాధినాథసుతు శిర,మసమగతిఁ ద్రుంచెనంత ♦ నయ్యస్త్రము సం
తసపడి దేవతలుంగడు,కుసుమమ్ములవృష్టి వేగ ♦ గురియించిరొగిన్ 147

వ. ఇట్లు రెండవరావణుండనంజాలు మేఘనాదుం గూల్చి, సౌమిత్రి యన్నదెసకుం జనుదెంచిన నావీరాగ్రేసరులిద్దరు పరమానందంబునం గడుంగడు సంతసించి యొండొరులం గౌగలించుకొని మీఁది రావణవధయు సులభసాధ్యంబగునని రెట్టించిన యుత్సాహంబునఁ జెలంగుచుండిరంత, 148

సుతుడట్లు తెగియెననునా, శ్రుతికంటకవార్తవినుచు ♦ శోభఁదొలగి తా
నతికలగి రావణుండును, నతిరోదనముంబొనర్చె ♦ నయ్యెడ నిటులన్ 149

ననుబాసిపోతివాకట! నినుఁజూచుక నీదులావు ♦ నిండుంగనుచున్
అనివానరనరులను గై, కొనకుంటివి నేటితోడ ♦ గ్రుంగెడినాశల్ 150

అమరులఁదోలితిఁగొంటివి, యమరావతి నాకుగూర్చి ♦ తమరాంగనలన్
కొమరొప్ప ద్రిజగముల నీ,సము డేడీ కొమర! నీవు ♦ సమయుట భ్రమరా

భ్రమియించిరొయొరునిన్నని, సమసెదవే నరులకోడి ♦ సామాన్యునిలా
గమరసుమనోభయంకర, సమరా! గారాపుకొమర! ♦ చయ్యనరారా!

అనిమతిచెడి పలికెడిరా,వణుగని చారులును బిట్టు ♦ వచియించిరి యో
దనుజాధిప! నిక్కము నీ,తనుజాతుడుగూలెక దన ♦ తలమున నరికిన్ 153

వ. అనిన యదార్థంబు గ్రహించి దండతాడితోగ్రోరగంబు చందంబెసంగ దిక్కులు పిక్కటిల్ల నార్చుచు, 154

ఎవ్వాఁడునాఁడు సుతుసని, ద్రెవ్వంగను సేసెవ్వాని ♦ దీవ్రతగనినా
క్రొవ్వాఁడిశరము లేయుచు, నివ్వసుధం గూల్తునిక్క ♦ మింతయుననుచున్
ఉగ్రాకారుండగుచు ద, శగ్రీవుండంత జనియె ♦ సమరేచ్ఛందా
నగ్రేసరుఁడగుచు మ, హోగ్రావసమానసాము ♦ జావళితోడన్

వ. మఱియు

157

బిరబిర చనిమెడి రక్కసు, లరదంబులు చిత్రకేత ♦ నాళిచెలంగన్
తురగంబులు పటువాద్యము, లరుదైదై వాత్రెనసురు ♦ డనికేగెడిచోన్
ఘీంకృతుల కరులు భేరీ, భాంకృతుల స్వీరవరులు ♦ భయదధనుర్జ్యా
టంకృతుల రథికవరులు న, హంకృతులలమంగనాల ♦ మంత చెలంగన్
గిరులతరుల శిలలఁ రఘు, వరు సేనాపతులు కడిఁ ♦ వానరశూరుల్
దురమున రావణు సేనల, కరమరుదుగ నెదిరి చెదర ♦ గాఁ జేయుటయున్
మండిపడి రావణుండు ప్ర, చండగతిన్ బోయి రాము ♦ సైన్యంబెల్లన్
గండఱిపాఱగ చటులో, ద్దండగతిన్ మోహరించె ♦ దద్దయుమఱియున్
ఆ రావణుడుగ్రుండై, యా రాముని డాసియేసె ♦ నతిభయదముగా
ఘోరమహానాగాస్త్రము, నారసియది లెక్కగొనక ♦ యా రఘువరుడున్
కినుకమెయి తీవ్రబాణము, లను నేసిన తిమిరశరము ♦ లంగొనియసురుం
డును మనుజుసేన నేసిన, ఘనుడానరుడగ్ని శరము ♦ గ్రక్కన నేసెన్ 163
అరుదుగ నయ్యస్త్రమ్మును, నిరులందొలగింప రాము ♦ డీశర్వ బాణం
బురువడి నేయగ నసురుడు, వర రౌద్రాస్త్రంబు నేసె ♦ బాయానికినుకన్ 164
రెండుంజనిదివి నసురుల, గుండెలవియబిట్టు పెనగి ♦ కూలె భువి. మహో
ద్దండ విలయకాలాశని, చండిమ నిరువాగువారుఁ ♦ జకితులుగాఁగన్ 165

వ. మఱియు నయ్యవసరంబున రామరావణులు లోకభయంకరంబులై పిరుతివియని బీరంబుల నొండొరుల మీఱుచు శరంబులఁ దూఱ నేయుచు శత్రుబాణంబుల దూరంబునన భగ్నమొందించుచు ననుపమాన తేజోవిరాజితులై యాజి సేయుచుండు నెడ, 166

ననచిన మోదుగునాగడు, గనన య్యెను రాముశరని♦కాయమునాటన్
దనుజేశుతనువు రాముం, డును పూర్వగిరీంద్రభాను♦డోయననొప్పెన్

వ. మఱియు, 168

కదనపదమంత గనబడె, విదళితభుజ పతితసుభట ♦ వికలాంగా సృ
క్ప్రదమైదళిత మహాగజ, రదమైయరిఘోషకడుద♦రదమై పిదపన్. 169

ఆయెడ రామునకించుక, సాయంబొనరింపజనిరి♦సౌమిత్రియు రో
షాయతుడు విభీషణుడును, వాయుజుడును దనుజులోన ♦ వారిగబోరన్

అవ్వారిరాక గనుగొని, యవ్వారిగ రావణుండు♦నరదముగడపెన్
నివ్వటిలు నాగ్రహంబున, చివ్వకు నాహనుమబిలువ♦చెచ్చెర నంతన్

అదిగనుచు హనుమవెసజని, గదిసియనెన్ వినరయోరి ♦కట్టడి! నీకుం
దుదిదఱిసెనట్లు కాదే, మదిబెట్టవెనాదుమాట♦మానక నాడే 172

పోనిమ్ము గతము చూడం,గానిమ్మిక నీదుశక్తి♦కదనము నేర్పన్
నానమ్మనుజాశనపతి, దానమ్మారుతినిబొడిచె♦దద్దయుముష్టిన్ 173

బొడుచుడును వాయుజుండును కడిమి చెడక మగుడ పుడమిగడువడ కనరిన్
బిడికిటబొడిచిన నసురుడు, వడెనడిమికిదెగిన మ్రాని♦వడువునమూర్ఛన్

అటు రావణుండుపడన, చ్చొటువాయుచు రాముబంటు♦ సూటిగజనెనం
తటయసుర దెప్పిరిలి తా,నటగాంచె విభీషణుని♦నిజానుజు నంతన్ 175

వ. అట్లు గనుంగొని యతనిండాసి, 176

ఓరి! కులద్రోహి! మహా, ధీరుని చందాన నేగు♦దెంచితివే నీ
శూరత ధీరత లగపడు, పారకనిలు మొక్కట్రుటినె♦పరిమార్తునినున్

అనుటయుకొండొకబెగడియు, వెనుకొనులక్ష్మణునియండవీక్షించి వెసన్
దనుజాధీశ్వరునరదం, బును మావులతోడ గూల♦మోదెనతండున్ 178

వ. అట్లు కూల్చిన నపరిమితక్రోధాతిరేకంబున విభీషణుని బొలియింప
నిశ్చయించి రావణుండును, 179

విసరెవిధిదత్తశక్తిని, కసిదీరఁగ దమ్ముపైన♦క్రన్ననవిడచున్
విసవిసకీలలఁ గ్రక్కుచుఁ, బసిగొని చనుదెంచెఁ ద్రాచ♦భంగినినంతన్

అద్దాని తీవ్రతంగని, దద్దయుభయమందు దనుజు♦తమ్మునిగావన్
గ్రద్దనలక్ష్మణుఁడరిగె మ,హోద్దామకృపాళుఁడగుచు♦ననాని కినుకన్

వ. అంత, 182

కాలానలసన్నిభమై, జ్వాలల గ్రక్కుచును శక్తి♦సౌమిత్రియెదన్
చాలఁగనాటిన నసురా, భీలుఁడు లక్ష్మణుఁడుగూలె♦పెద్దయుమూర్ఛన్

అటుపడినలక్ష్మణునిఁ దాఁ, దటుకునఁ గొనిపోవనెత్తె♦దనుజాధిపునిన్
గటమదరఁదన్ని హనుమయు, పటుగతిఁదాదెచ్చెనతని♦పార్థివుకడకున్

వ. అంత, 185

కట్టెదుట నసురుడనుజున, కట్టియవస్థంబొనర్చె♦నని బెట్టిదుఁడై
కట్టలుక బ్రొద్దుకోలపుం, బట్టియుఁ జేబట్టె కడిది♦కార్ముకమంతన్ 186

విలుబూని రాముఁడేగె న,నిలజాంసతలంబునందు♦నెలకొనియంతన్
బలురథము నెక్కి దనుజుం, డలఘుగతిన్ దానువచ్చె♦ననిసేయుటకున్

వ. ఇట్లుసని యొండొరులు డగ్గఱి నయ్యవసరంబున, 188

భానుకులదీపకుండనె దా,నవ శ్రుతిమించె నీదు♦ దర్పంబారా!
మాననిక నిన్నుదునుమక, దానుగనాశంభుఁడడ్డు♦దగిలిన నేఁడున్ 189

అని క్రూరమహాస్త్రంబుల, నినవంశజుఁడేయ వాని♦నెదురఁగలేకా
దనుజుఁడు బెగడుచువసరుచు, వెనుకకు వీఁగుచును కడల♦వీక్షించునెడన్

ఒకదిట్టకోల రక్కసు,ని కరస్థశరాసనంబు ♦ నెఱి నింకొకటన్
మకుటంబు నొకటనరదము, శకలములుగఁ జేసె రామ♦జనవిభుఁడంతన్

తేరుచెడి పాదచారత,నారావణుఁడపుడు గనఁగ♦నయ్యెన్ శాఖా
భారవిహీనమహోన్నత, భూరుహరాజంబొనాగఁ♦బొలికలనినటన్

వ. మఱియు నయ్యెడ దుర్వార ప్రతాపుండగు రాఘవునమోఘాస్త్రా
నలంబుల తీక్ష్ణతకు నోడి కాందిశీకుండైన రావణుంగని వానరులు
పెక్కండ్రు వెక్కిరించువారును దూఱువారునునై దారికడ్డంబైన
యసురేశుండును ప్రాణభీతింబఱచి పురింజొచ్చెనంత 193

ఆలోలక్ష్మణు దేర్పగ, నాలోలగతిన్ సుషేణు♦డటఁజని హనుమజ్
జాలవెసబంపె నౌషధ,జాలము గొనితేర ద్రోణ♦శైలముకడకున్ 194

వ. తదనంతరంబ, 195

విల్లెక్కుడించిరఘుకుల, వల్లభుడుంజనియె కరము♦వనరుచు ననుజుం
డల్లన బడియున్నెడకును, నుల్లంబువిషాదవహ్ని♦నుడుకగనంతన్ 196

చని హా! సౌమిత్రీ! నను,చనునే వీడంగ నిట్లు♦చననే నీతో
నినుబాసినిలువగలనే, యనుజా నినుబోల నొరుల♦కగునేయెందున్ 197

తమ్ముడ! యింకెవ్వరికై,యిమ్మహిబ్రాణములునిలుప♦నెంతునునకటా!
యిమ్మెయినీవేగిన నిక, నెమ్మెయి నిలుపంగనోపు♦దిమ్మెయిననుచున్

తాపంబునొందు శోషిలు, భూపుత్రీ! నాథునాశ♦బోవిడుము కపుల్
మీపనిజూడుండను,రఘుభూపాలుండనుజుడట్లు♦పొలిసెడిననుచున్ 199

వ. ఇట్లు శోకిల్లు నయ్యవసరంబున, 200

ద్రోణాద్రిసమూలంబుగ, పోణిమిమైదెచ్చె ననిల♦పుత్రుండంతన్
రాణదలిర్పగగనుచు సు,షేణుండును నౌషధముల♦చెచ్చెరగొనుచున్

సౌమిత్రి సజీవుంగా, నామెయినొనరించిగూర్చె♦నతుల ముదంబా
భూమీశునకాతండును, నామారుతి గౌగిలించి♦యనె దయనంతన్

నినుబోటిసఖుని నొక్కని,గననేర్తుమె యొండుచోట♦ఘనపుణ్యుననున్
మనిచితి వనుజునిఁ బ్రోచితి, మనుమాయాకల్పమిలను♦మామకభక్తిన్

వ. అని దీవించి సుగ్రీవాంగద సుషేణ ప్రముఖ కపివీరుల నోలినాలిం
గనంబొనర్చికొని రఘుప్రవరుండు తమ్మునింగూడి సుఖంబుం
డుటయు, 204

ఆవార్త కర్ణశూలం, బై వెసనాటుంగ రావణాసురుడంతన్
వేవేగ తనదు మంత్రుల, రావించుచు వారితోడ రహింబల్కెనిటుల్

చూచితిరె! లక్ష్మణుండును, లేచినగిడి బ్రదికెనంట! లీలాగతిమై
చూచితిరె తాదృశాదుల, యోచింపు డికేది కార్యమోసచివులికన్

వ. నావుడువారును. 207

పనిలేదువగవ రక్షో,జననాయక! నీకు నీ యసమసమరమునన్
వనచరులు నదులు లెక్కయె, త్రినేత్రునగమెత్తినట్టి శీదనకవనిన్

రప్పింపుమూలబలముల,నొప్పింపుముశత్రుచయము నుంగడిమిమెయిన్
మెప్పొందు మఖిలజగముల, నిప్పగిదిని వెఱవ నీకు నేటికిదేవా! 209

వ. అని ధైర్యంబుసెప్పిన వెండియు రామచంద్రునితోడ రణంబు
సేయ నుత్సహించి, 210

మణిఖచిత కనకరథమున, రణమొనరింపంగఁజనియె రావణుఁడును వా
రణతురగసుభటగణ భీ,షణనిస్వనమెసగ చటులసాహసమొప్పన్ 211

భేరీనినాదపూరిత, భూరిమహారభస మొప్పఁబొంగుచు ననికిన్
ఆరావణురాణువజనె, ఘోరమహాస్త్రములగొనుచుగుఱుతుగనంతన్

సురకంటక సైన్యంబుకు, లరుదేరగగాంచి కపిఘవ్యూహంబుల్
స్థిరగతినిలిచిరి దనుజుల, దురమున నెదిరించువేడ్కనుద్ధమగరిమన్ 213

వ. మఱియు నత్తఱి నింద్రుని సారథియగు మాతలిచే దేబడిన
దివ్యరథంబును రామచంద్రుం డధిష్టించెనంత. 214

ఆరామరావణుల రణ, మారయగన్ వ్యోమయానులై వినువీధిన్
జేరి నిఖిలసురగణములు, సారెకుగనుగొంచుపొగడసాగిననంతన్ 215

భీమపరాక్రముడగు నా, రాముం డవ్వేళ నేసె రావణు నొగి నా
నామహనీయాస్త్రంబుల, వేమఱుతచ్ఛిరము లెగిరి వెసబడనంతన్ 216

తెగశిరములెల్ల నహహాయగుడ మొలిచె తెగియె మొలిచెమఱలందె గడా
బగబూనె రాముడింకను,జగమున రావణునిమన్కి♦సంశయమహహా

అని ప్రేక్షకులచ్చెరువడ, దనుజుండును రామునకును♦ దానోడక భం
డన మొనరించె న్నానా,స్త్రనికాయ స్ఫురణచెలగ♦సాహసమొప్పన్

వ. అంత, 219

అసురుడు దోడిగెడి యమ్ముల, వెసవెస రాముండుద్రుంప♦వేసరిదనుజుం
డుసురుసురనుచును రాముని,యసమాననితాంత తేజ♦మరసి బెగడుచున్

మతిచెడియమ్మోడగనుగొన, ధృతకార్ముకదివ్యబాణ♦ తేజోయుతుడా
యతదీర్ఘ బాహుమధ్యుడు, ధృతిమంతుండైన రాము♦తేజమె కనరాన్

వ. కొంతవడికి నయ్యమానుషరాఘవ తేజోవీచీ పరంపరల సమ్మో
హితుండై రాముండు నరమాత్రుండు గాడని నిశ్చయించి దనకు
మరణంబ నిశ్చయంబని యెంచు నయ్యవసరంబున, 222

రాముని సమ్మోహన తే,జోమాయారహితుడగుచు♦సుమనోరియు సం
గ్రామోన్ముఖుడై వెండియు, భీమగతిందురమొనర్చె♦బిఱుతివక మఱిన్

కపిచయముపై కినుఱుకుచు,విపులభుజాదండములను♦విసరిచదుపుచున్
అప్పుడుదశవదనుడగపడె, నపరవిలయరుద్రుడొక్కొ♦యని కపులడలన్

వ. అట్టియెడ నా రావణ శిరంబుల బౌనఃపునోద్భవంబునకు నచ్చెరు
వొందుచు రాజచందురుండా రావణనాభిస్థాన స్థితామృతకలశంబ
యట్లగుటకుం గారణంబని విభీషణునివలన నెఱింగి, 225

నారాయణాస్త్రముంగొని, నారాయణమూర్తి రామ ♦ నరపాలుడువే
యా రావణు నుదరము గుఱి,యారసి,వైచినను డగులు♦నబ్రేటువడిన్

గర్భస్థ మమృత కలశము, నిర్భిన్నముగాగ నరులు ♦ నివ్వెఱపడ నా
విర్భావమొందమానెను, దుర్భరగతి దానవేంద్రుం ♦ దోరపుశిరముల్

అటు లోకతల డుగచేతులు, పటువఱిమిగులంగ దనుజ♦పతిదనుగనిసం
కటపడి తనతొల్లిటిబహు, కుటిలకృతంబులనుతలచె♦గురుతుగనిక్కులన్

అనిఁబడిరి బందుగులుసుతు, లెనలేని బలంబడెల్ల♦నిలపై గూలెన్
కననీనా యొక్కటితన, మునకుంగతమెదినొపూర్వ పుందుష్కృతమా

తాపసులగురక్కసులకుభూమింబతినగుచుబుణ్యా♦ మునిజనములతో
నేమచ్చరించిచేసితి, భీమగతినిజెట్టలెపుడు ♦ పృథుగర్వమునన్ 230

చదువుల మిన్ననటంచును, పదితలలుగలాడననుచుబహువరబలమున్
గదిరెననుచు యుబ్బుననే, మది దలపగనై తిదైవ♦భావంబెపుడున్ 231

హతమతినై జేసితిదు, ష్కృతముల నెన్నేనిసాధు♦గీర్వాణులకున్
సతముదత్సతుల బెక్కుఱ, మతిగొంచక చెఱలనిడితి♦మదగతి నేనున్

కారించితి తాపసుల వి, దారించితి, భూపవరుల♦దర్పము పేర్మిన్
బూరించితి నిఖిలావని, భూరితరవ్యథల నెపుడు♦భుజగర్వమునన్ 233

వ. అనిచింతించుచు, రణంబున వీరోచిత మరణంబ తనకప్పుట్టునయు
చితంబని యెంచుచు మఱల నుద్యమించు నవ్వానింగని 234

భీకరబ్రహ్మాస్త్రంబున, కాకుత్స్థకులాధికుండు ♦ గడువడినేయన్
నాకారియుదరమయ్యది, దాకె మహాశనియునద్రి♦దాకినభంగిన్ 235

వ. అనంతరంబ రా మధనుర్నిర్ముక్త బ్రహ్మాస్త్రంబున రావణుండును,

దిరదిరఁదిరుగుచు మూలము, దఱిగినఁబడుకడిదిద్రుమాని♦దర్పంబొప్పన్
దురమున బడగని సురలును, గురిసిరి విరివాన రాజ♦కుంజరుపైనన్ 237

అత్తరిసంతసముబ్బవి, యత్తలముననున్న హరుడు♦నజుడును హరియున్
మొత్తములుగననిమిషులును, దత్తరమునజనిరి రాము♦దర్శింపంగన్ 238

చనియా దేవగణంబులు, కనిరాయతబాహుమధ్యు ♦ కదనాసాధ్యున్
ఘనపుణ్యారాధ్యున్ యతి, జనగణసంవేద్యు నిఖిల♦సజ్జనహృద్యున్ .

ఆదైత్యనాథు మృతివిని, రోదన మొనరించి కెల్ల♦రుం బేరెడదల్
మోదికొనుచు నార్తింజని, రాదైత్యాధీశుభార్య ♦ లత్తె వెలుచన్

దనుజేశుడత్తెఱంగున, ననివడగని కడిదిదుఃఖ ♦ మందెను వెస నా
తని తమ్ముడగు విభీషణు, డెనలేని తదీయశౌర్య♦మెన్నుచు సంతన్

సతినాదరించి మించెను, మతిమంతుడు రాఘవుండు ♦ మానితగతినా
యతబాహు సమాలింగన, యుతసాదరణ ప్రసక్తి♦యుక్తక్రియలన్

తదుపరి రామాజ్ఞంగొని, కదన నిహతకపిగణంబుఁ గ్రమ్మఱమనిచెన్
సదయతహనుమంతుండును,పొదలెడిద్రోణాద్రిదెచ్చి♦పూర్ణజవమునన్

అంతటకౌబేరంబగు, వింతవిమానంబుదెచ్చి ♦ వెసనిచ్చెను భూ
కాంతునకు రామవిభునకు, సంతసమొప్పార యసుర♦జనపతియంతన్

ఆరామజన విభుండును, దారయుతుండగుచు నెక్కె♦దమ్ముఁడునినజుం
డారక్షోవిభుడును కపి,వారంబును తోడరాగ♦వాయుజుతోడన్ 270

వ. అట్లధిష్టించి పయనంబు సాగించుడు నద్దివ్య విమానంబు రివ్వున నాకసంబున కెగసిన లోనంగల కపివార మొక్కపెట్టున నాసీతారామ లక్ష్మణులంగూర్చి జయజయధ్వానంబుల జేయ నెల్లరు రామచంద్రుని సేవించుచు నమితానందంబున నొప్పియుంటయు బ్రహ్మేంద్రాది మరుద్గణంబు నిజవాహనంబుల నెక్కి కొంతదవ్వు రాముతోడ నేతెంచి యతనియొద్దముదలంగొని నిజధామంబులకు చనుటయు, 271

అద్దివ్యవిమానముదా, గ్రద్దనచనుచుండె చిఱుత♦గంటలు మొరయన్
పెద్దగ కపిగణఘోషలు, ముద్దుగులుకుజయపతాక♦ములురాజిల్లన్

అంతరఘురాముడును నిజ,కాంతామణి సీతగాంచి♦కడుకూర్మిమెయిన్
అంతంత మార్గమునగల, వింతవిశేషముల జూప♦వేడుకపడుచున్ 273

వ. మున్ముందుగ, 274

తరలాక్షి! చూడుమిదె ఘన,తరమౌ లంకాపురంబు♦తన్మధ్యనె యా
సురవైరి మందిరం బో, విరిబోడీ! చూడుమాసు♦వేలాద్రి యిదే 275

ఈయద్రిశిఖరమున నే,తోయలివినువిడిసె మాదు♦తోయము తొలుతన్
ఈయబ్ధి బంధనముగను,మోయుగ్మలి! దాటనయ్యె♦నుదధియు దీనన్

ఇదె కనుము విశాలార్ణవ, మిది దాటియె హనుమ లంక♦కే తెంచెనినున్
సుదతీ! కనుగొని వచ్చుట, కదె దక్షిణవార్ధితీర మయ్యది కంటే! 277

కనుమా దక్షిణతీరము, కనుమల్లదె హనుమ యబ్ధి ♦ గమియించెడిచో
మును నెక్కిన యున్నతగిరి, వనితరో! దర్భల శయించి♦వరరితినిచటన్

అని చెప్పుచు రఘుపతిసతి, ననుపమహర్షాబ్ధి దేల్చి♦యతివిముదమందన్
వనచరులును దారలరిరి, యని తలత త్తత్కృతంబు♦లగ్గించుచోగిన్

ఆరాము నాజ్ఞచొప్పున నారక్షఃపతివి మాన ♦ మయ్యోఢడించెన్
భూరివిభవమున వానర, వారము నచ్చోటడిగిరి♦వడివడినంతన్. 280

కపులంత దిరుగజొచ్చిరి, యపుడు పుడమి కపులసీనె♦నాయనిదోపన్
విపినములదూరికలచుచు, విపరీతపుగతుల నెల్ల♦విహరించుచోగిన్. 281

వ. అంత. 282

ఆరావణు శివపూజా, పారీణుని వధకుదోష♦పరిహారముగా
నారాముడు నిర్మించెను, యారామేశ్వరుని నచట ♦ నర్థినుమేశున్
వారాణసీశ్వరునివలె, సీరామేశ్వరుడు నలరు♦హేలాగతి లో
కారాధ్యుడు మోక్షదుడై, యారఘువరుకరుణ సేవ♦కావలి కెల్లన్

తదుపరి సీతారాములు, కదలిరి పుష్పకము నెక్కి♦కపిసైన్యముతో
మొదటి తెఅవునన యెల్లఋముద మొందగ కపులు స్తోత్రములు సేయంగన్

అంతరఘురాముడనె నో, యింతీ! కనుగొమ్మిదే మ♦హేంద్రాదియు నీ
పొంతన సంపాతియుమును, సంతసమున దెలిపె లంక♦జాడ కపులకున్.

వ. అని వెండియు 287

సరసిజనయనరో! యల్లదె, ధరయుము కిష్కింధ యనగ♦నతిరమ్యంబౌ
పురవరము కపులనిలయము, తరుణీయిదె మధువనంబు♦దద్దయు గనుమీ

ఇదె మాల్యవంతనగమి, య్యదియే నేవాలి నేసి ♦ నట్టితలం బి
య్యదెయి నజుతోడి సంఖ్యం, బొదవిన యాఋష్యమూక♦ముత్పలనయనా

ఆ రాముడతులకరుణా, పారీణుండరిగి దైత్య ♦ బంధువులందా
నూరార్చి విభీషణుండగ, నా రావణునంత్యకర్మ ♦ కై వెసబంపెన్ 242

వ. అనంతర మా విభీషణుండును, రావణునకు దహన సంస్కారంబులు
గావించి చనుదెంచిన రాముండతనికి లంకారాజ్య పట్టాభిషేకం
బొనర్ప లక్ష్మణు నియోగించుటయు, 243

అసమానవైభవంబున, నసురాధిపు ననుజులంక ♦ కధిపతిజేసెన్
అసురాళిమెచ్చకడు సం,తసమున లక్ష్మణుడు రామ♦ధరణిపునాజ్ఞన్

తదనంతరమ విభీషణు, డెదబొంగుచు కాన్కలెన్ని♦యేఁగొని ప్రేమా
స్పదు రామచంద్రు గొలువను, కదలెను సౌమిత్రితోడ♦గడు శీఘ్రగతిన్

అయ్యెడనాసుర గణములు, నయ్యినకులచంద్రుపావ♦నాంఘ్రిద్వయికిన్
నెయ్యంపుభక్తినతులిడి, చయ్యన నా రాముబొగడ ♦ సాగిరినెమ్మిన్

ఓ రామ! సజ్జనావనపారీణ! కృపాబ్ధి! నిఖిల ♦ పాపవినాశా!
సారశుభనామ! ధరణీ, భారనివారక! రమేశ! ♦ పరమేశ! హరీ!247

భువి ధర్మస్థాపనకై, భవమొందినయట్టి భక్త♦బాంధవుడవు దా
నవులం దునిమితి గూర్చితి, వవిరళమా శాంతి త్రిజగ♦మా హాయనగన్?

వ. అందు బ్రహ్మదేవుండిట్లని నుతియించె, 249

కరుణార్ద్ర దృష్టిజూడుము, వరదా! భవహరణ! దీన♦వాంఛితఫలదా!
పరమాత్మ! ప్రసాదింపుము, నిరతము నీచింతమదిని♦నిలచెడు నటులన్

వ. అనంతరంబ శివుండిట్లని స్తుతియించె, 251

నీనామమఘహరంబును నీనామమె యమృతసేవ ♦ నిత్యార్థదమున్
నీనామమాత్మజీవన, మా నామనమందునిల్పు ♦ మా యద్దానిన్ 252

వ. ఇంద్రుండిట్లనియె, 253

ఓ రామ! లోకకంటకు, నా రావణు జంపి మనిచి♦తమరులను ననున్
ఛాఘభవత్పద సేవయె, యారం దయసేయుమయ్య♦యనవరతంబున్

వ. నారదుండిట్లనియె, 255

రామ! రఘురామ! సీతా,రామ! లసన్నామ! యంచు♦రమ్యభవచ్ఛి
న్నామమెపుడు బాడుదువే, నీమెయిపులకింపభక్తి♦నెంతయు రామా!

అటులాసుపర్వులెల్లరు, పటుతరసద్భక్తియుక్తి ♦ పలుకుచురాముం
గుటిలారిమర్దనుని సం,స్ఫుటగతి ప్రార్థనలు సేయు ♦ చుండగనంతన్

రామాజ్ఞఁగొంచుచనఁదా, రాముని దేవేరి దెచ్చె ♦ రాజితశిబికన్
ఆమెయి విభీషణుడు సీ,తామానిని మొ్రక్కె భక్తి ♦ దద్దయుపతికిన్

వ. అట్లు మొ్రక్క నిజభార్యంగని రామచంద్రుండును, 259

తనయాలి దొంగిలినయా, దనుజుని బొలియింపడెర ♦ దాశరథియటం
చను భూజనాపవాదం,బును బాపితి, కాదునిన్ను ♦ బొందుటకిదియున్

అనిపల్క రాముభావం, బును లోననెఱింగి సీత ♦ బొందుగ సౌమి
త్రినిబిల్చి 'నాకునొకచితి,ననువొప్పగ బేర్చుమన్న'♦యనినుడువుటయున్

ఆరామునను జూడప్పుడు, మారాడక జెప్పె కీశ ♦ మాన్యుల కపుడున్
వారును రగిల్చిరగ్నిన్, భూరితరజ్వాలలపుడు ♦ ముట్టగ నింగిన్ 262

ఆజాతవేదునకు నా,భూజాత నమస్కరించి ♦ పూతాత్మనినున్
వేజొచ్చెద నఘముండిన,నో జనుదహియించి శుద్ధి♦నొందింపుననున్ 263

వ. అనుచు సకలజనంబులు నచ్చెరువొంద నాచితి నధిష్టించుటయు,

గొబ్బున శిఖియును నెల్లరు, నబ్బురపడ చల్లనయ్యె ♦ నవనిజకంతన్
ఉబ్బునగంతులువైచిరి, యబ్బలగమువారలెల్ల♦రహాహా యనుచున్

వ. అనంతరంబాకాశంబునుండియు ''సీతామహాదేవి–పరమపతివ్రత–పరమపతివ్రత– సంశయంబువీడిపరిగ్రహింపు'' మను నశరీరవాక్కులను సీతామహాదేవిని యథాపూర్వంబుగ పరిగ్రహించి తమకు పూర్ణప్రమోదంబుఁ గల్గింపుమనెడి బ్రహ్మాది నిఖిల దేవతా ప్రార్థనంబును, నంగీకరించి, 266

అనిమఱియుబల్కెరమణీ వినుమియ్యదెమాల్యవత్ప♦విత్రనగంబీ
ఘనశైలమ్మున మునుగడ, చెను వర్షయునాకునీదు♦ చింతాకులతన్
వినుమింతిఋష్యమూకం,బునకుంగొనిచనియెవాయుపుత్రుడుమమ్మున్
దనపతి సుగ్రీవునితో, ననువొప్పగ నూకు సఖ్య♦మనుసంధింపన్ 291

292

వ. అనివెండియు

పంపాసరోవరముగను, నింపుగనోతలిరుబోడి!♦యిట శబరియనన్
బెంపొందు నెలతమముగని,సొంపుగనాతిథ్యమిడియె♦సురుచిరభక్తిన్

ఇటగంటె మతివ! యేమా,పటుకాయు జటాయుదళిత♦పక్షున్ స్వక్షున్
తటుకుననుడివె నతడునిన్. గుటిలాత్ముడు రావణుండు♦కొనిచను బెల్లన్

ముదిత! కను నిదియెగౌతమి,సుదతీ! కను పర్ణశాల♦సుమ్మిదియిదియే
పొదలు ఘనదండకాటవి,యిదెకను ఖరదూషణాదు♦లీల్గిన తావున్

అనుచుంజూపుచుజనుచో, నినకులశేఖరు విమాన♦మేగెను వడిమై
ఘనచిత్రకూటపర్వత,మును డాయగ దాని రాజ♦ముఖ్యుడుగనుచున్

సతిగాంచి యనియెరాముం,డతివరొగనుచిత్రకూట♦మనునగమిదియే
వెతగొన్న భరతునింగూ,డితి నిచట నెకాదె కలగు♦డెందంబులతోన్

298

వ. అనుచు నాయూతావులం జూపుచుం జనుచు,

ఆరాము డంతగనుగొనె, భారద్వాజాశ్రమంబు♦పావనధామం
బారసియటడిగిజనె నిజ,నారీ సోదరులు కపులు♦నడువంబ్రేమన్ 229

300

వ. అంత

ఆరాముసపరివారుని, నారసియాతిథ్యమొసగి♦యర్చించెగడున్
గారాముసముని నిజహృద,యారాధ్యనిధానమట్టు♦లబ్బెడిననుచున్

వ. అనంతరంబ రాఘవుండును తనరాక భరతునకు మున్నగనెఱిం
గింప హనుమంతుంబంచిన నతండును మనోవేగంబునం జని నంది
గ్రామంబున బ్రాయోపవేశాయత్తుండైన భరతునకు రామాగమన
శుభవార్తం దెలుప నమితసంతోషభరితుండయి, 302

భరతుండును 'శత్రుఘ్నా, బిరబిర సాకేతమేగి ♦ ప్రియముగ ప్రజకున్
ధరణిపు రాకం దెలిపి న,గరముం గై సేయు'మంచుఁ ♦ గడు వెసబంపన్

ఆ రాజచంద్రునాజ్ఞయ, పారముదంబడఁగ నెల్లఁ ♦ బౌరుల యోధ్యన్
భూరిగతి వెలయఁ జేసిరి, తోరణశుభవాద్యతతుల ♦ తోఁపుతమటియున్

పన్నీటమార్జనల పలు, వెన్నెలముత్తియపుమ్రుగ్గు ♦ వరుసల నాపై
క్రొన్ననల నగరుగంధపుఁ, జెన్నులగై సేసిరిండ్లఁ ♦ జెలగుచు పౌరుల్

వ. అనంతరంబ శత్రుఘ్నుండును నిజాగ్రజునానతి సకలదిగ్దేశాధీశులకును రామాగమనంబు దెలియంజాటంబంచి వారినెల్లర నయోధ్యకురా శాసించుచు, మాతృబంధుమిత్ర పురోహిత మంత్రిగణ సహితుండై భూసురవందిగాయక వారవిలాసినీ సమేతంబుగ జయభేరీతూర్యాదిక నానావాద్యసముదయంబు లెసంగ, నపరిమిత చతుర్విధసేనాసమేతుండై కదలిచని భరతునకు మ్రొక్కి నిలుచుటయు నట, 306

భారద్వాజమునీంద్రుని, యారందనియించి రాముఁ ♦ డంతట గంగా
తీరనివాసి గుహార్చిత, భూరిపదాబ్జాతుఁడగుచు ♦ బొంగిచనెడుచో

హనుమయుగ నెనా రామునిఘనతర పుష్పకము రాక గనుగొని భరతుం
గని చూడుమనఘ యల్లదె, చనుదెంచెడి పుష్పకంబు ♦ జనవిభుతోడన్

అనిచూపుటయును భరతుండనుపమసంతోషమందియత్యాతురతన్
దనవారికెల్లరకు ననె, కనుఁడీ మన రాము పుష్ప ♦ కంబదె వచ్చెన్ 309

అని చెప్ప నెల్లరుంది,గ్గన నిలిచి విమానమున్న ♦ సయ్యోడఁగనుచున్
మనమున హర్షము పెనుపడఁగనుగొని నతులిడిరి కేలు ♦ గవ మొగిచియటన్

వీతెంచె విమానముఁ రఘు,భూతలపతిఁ గొంచు ననుజ ♦ భూమిజయుతుఁ గా
నాతఁడె నయ్యోడనున్న ప్ర,జాతతి కడు మ్రొక్కఁగడిది ♦ సంతసమందన్

వ. అనంతరం బాభరతశత్రుఘ్ను లన్నయడుగులంబడి మ్రొక్కనం దిగిచి రామచంద్రుండును సోదరులం గౌగిలించియూరడించి యాద రంబునందనిపి మాతృవర్గంబునకు మ్రొక్కి పరమానందంబొన గూర్చి యెల్లబుధామాత్యవర్గంబునకు నపరిమితానందం బాపా దించెనంత భరతశత్రుఘ్నులును సీతాదేవికింబ్రణమిల్లిరనంతరంబ భరతుండును శ్రీరామపాదుకాద్వయంబును మోచితెచ్చి రామున కర్పించి పృథ్వీభారంబుఁబూనఁ బ్రార్థించుడు, రామచంద్రుండును నంగీకరించి, సీతాసౌమిత్రులతోడం గూడి వల్కలాజినవిసర్జనం బొనర్చి నూతనవస్త్రధారియై, 312

కదలిచనియెరఘురాముడు, ముదమునదమ్ములునుమంత్రిముఖ్యులుతల్లుల్
ముదితహృదయులుగనయ్యెడ, బొదలెడిసాకేతపురికిఁబొంగుచునంతన్

ధరణిజతోరఘురాముడు, పరివారము వెంబడింపభద్రగజముపై
వరగతిజొచ్చెనయోధ్యా,పురముంబౌరులునునృపులుఁబొరిపొరిమ్రొక్కన్

వ. మఱియునత్తఱి. 315

పురవీధులజనుచో రఘు,వరునిందత్సతినిపౌర ♦ వనితామణులున్
వరభక్తిఁబూజచేసిరి, యరుదుగసుమమాలలిడుచు ♦ నతిహర్షమునన్

ఆపౌరు లెల్లరయ్యెడ, భూపుత్రిం బొగడిరెంతో ♦ పూతాత్మ యహా!
యీపెమహాత్మ్యంబే రఘు, భూపాలుని విజయుజేసె♦భూరిరణములన్

అనిమఱియు ప్రజలు సౌమి,త్రినిగని మహితాత్ముడితని♦దివ్యసహాయం
బునరెఘురాముడోపెను, వనవాసక్లేశములను ♦ వడి దరియింపన్

వ. అనుచు వెంటనున్న హనుమంతుంగని 319

పురవాసు లబ్రపడిరొయొం,డొరులంగని యితడెవానరోత్తము డనఘుం
డురుబలుడువాయుపుత్రుం, డరయుడిశ్రీరామసేవ ♦ కాగ్రణియనుచున్

పెక్కు తెఱంగుల పురజనులక్కువలయనాథు సతని♦యనుచరవరులన్
మక్కువఁగనుఁగొనినతులిడి, రక్కజమానందమతిశ♦యంబై వెలుఁగన్

వ. ఇట్లు సర్వజనసంతోషకరంబుగ పురప్రవేశంబు సేసి, రాజనగరుం ప్రవేశించి, యొక్కశుభముహూర్తంబున భరతప్రార్థితుండై వసిష్ఠాది మహర్ష్యనుమతంబుగ, సకలమహీచక్రసామ్రాజ్య భారం బూన నంగీకరించిన రామచంద్రు సమస్తపుణ్యనదీనద సముద్రోదకంబుల సతీయుక్తునిగఁ బూతస్నాతునిం దివ్యాంబరాభరణభూషితుంగా నొనర్చి వశిష్ఠాది పురోహిత సహాయంబున భరతుండు సకల ప్రజాప్రమోదకరంబుగ శ్రీరామ చంద్రునకు నిఖిలావనీ సామ్రాజ్య పట్టాభిషేక మహోత్సవం బొనరించుటయు, 322

సురలెల్ల సంతసంపడి, గురియించిరి పుష్పవృష్టి♦గురుతుగ నంతన్
ధరణీసుపర్వులలరిరి, ధరణిని రాముండు రాజ♦ధర్మముఁ బూనన్ 323

ఆ దాశరథి, నిజప్రజ, మోదంబునుఁబొంద జన్న♦ములుఁ దా జేసెన్
వేదవిహితమార్గంబున, భూదేవతలలర సాటి♦భూపులు మెచ్చన్ 324

వ. మఱియు నట్లు 325

మానితగతిఁ గడుదీక్షం, బూని యనేకాధ్వరములఁ♦బొనరిచి ప్రజకున్
మానుగ శాంతింగూర్చెను, భూనాథుఁడు వేల్పులెల్లఁ♦బొంగి చెలంగన్

వ. ఇట్లు వేల్పులందనియించి ప్రజలకు శాంతి సౌఖ్యంబులు నెలకొల్పి నిజానుచరవరులగు సుగ్రీవాంగద జాంబవద్విభీషణాది ప్రముఖులెల్లఱకు సంతోషసూచకంబుగ బహురత్న చీనిచీనాంబరంబులనేకంబుగఁ బారితోషికంబులొసంగి, యన్నిటికన్న మిన్నయగు స్వప్రసాదభాసురంబులగు వీక్షణభాషణంబులనాదరించి దనియించి తత్తత్కృత సేవావిశేషంబులం బ్రశంసించి తనిపి వారివారి నిజ నివాసంబులకుం బోననుజ్ఞయిడిన వారును సీతారామచంద్రులకు

పదేపదే ప్రదక్షిణ నమస్కారంబు లాచరించుచు, తన్నామంబుం
గొనియాడుచు, తమకురఘుపతి యొనర్చిన బహుమానసమ్మానం
బులందలచికొనుచు, యుబ్బి స్వస్థానంబులకుం జని రంత హనుమం
తుండు మాత్రము, 327

తిన్నని భక్తి నెడదగొని, పెన్నిధిగని పీడలేని ♦ పేదవడువునన్
అన్నరనాధ పరాత్పరు,సన్నిధిఁదచ్చరణ సేవ♦సలుపుచునుండెన్

వ. అంత, 329

నష్టధనముఁగనుగొనగా, హృష్టులైన పేదలట్టు♦లెంతయుఁబౌరుల్
తుష్టింగొని చెలగిరి తమ,యిష్టనిధానంబు రాము♦డే తేరంగన్

ధరనేలె రామచంద్రుడు, వరుసగపదునొకడు వేల♦వత్సరములు దా
గరుణయు ధర్మము నెఱపుచు,వరగతిప్రజ నెల్లదండ్రి♦వలెబ్రోచు చొగిన్

ఆరాముడేలుధరగన,గా రావొక యింతయును న♦కాలమరణ రో
గారిష్ట చోరదుర్భి,క్షారూపానర్థములు ప్ర♦జావళికెందున్ 332

వ. మఱియు 333

ప్రజలెల్ల ధర్మపరులును, నిజకాంతాసంగసత్య♦నిష్ఠులు భగవ
ద్భజనాసక్తులునుంగడు, విజితేంద్రియులనఘులౌచు♦వెలసిరనిశమున్

తరుణులు పాతివ్రత్య,స్ఫురణన్ వైధవ్య పుత్ర ♦ శోకాదిక దు
ర్భరపీడలెఱుగ రెంతొవి,తరణాఢ్యలువిహితసుగుణ♦ధన్యలునగుచున్

చెలగెరఘురాముడేలగ, నిలసస్యసమృద్ధయగుచు♦నెంతయు బ్రజలున్
చెలగిరి స్వధర్మనిష్ఠా,కలితమహాతేజులగుచుఁ♦గడుబలవృద్ధిన్ 336

వ. మఱియు, 337

రతులైరి పతులకున్నిజ,సతులే పుష్పాస్త్రులైరి♦సతులకుపతులున్
వితతగుణాంచితుడగురఘుపతిభూతలమేల బ్రజలుబ్రిముదముబొర్ధయున్

కలుగవుతగవులుప్రజవా,దులువాడనువుదుష్టచింత♦దొరయదుజగతిఁ
జెలకొనుప్రశాంతహర్షం,బులు నిర్మలగుణుడు రామ♦భూవిభుడేలన్

వ. ఇట్లఖండమోదంబెసంగ రామచంద్రుండు భూమండలంబేలి భరతు
నకు యౌవ్వరాజ్య పట్టాభిషేకంబొనర్చి కొంతకాలంబు సుఖం
బుండి మఱియు, 340

కనెరాముడు జనకజయం, దినకులవర్ధనుల సుతుల ♦ నిద్దరఁ బేర్మిన్
ఘనులకుశలవుల దనకు,న్ననుమానసుమానసద్గు♦ణాంచితబలులన్

వెండియు నాకుశలవులకు, దండిగ వాల్మీకిమౌని♦దద్దయు గఱపెఁ
జండధనుర్వేదాగము, పాండిత్యము మధురగాన ♦ ఫణితియు నెమ్మిన్

వ. ఇట్లద్వితీయవిద్యావయోరూప భాసురులగు నాకుశలవులు తమబా
ల్యంబును, మౌనివర్యుండగు వాల్మీకియాశ్రమంబునం గడపి యను
పమ గాంధర్వవిద్యావిభూషితులై తన్మునిప్రోక్త శ్రీరామచారిత్రం
బును బాడుచు, రామచంద్ర సభాస్థ మహాజనంబుల వీనులవిందొ
నర్చి పితృకృతసమాలింగనులై, తమ్ముంగన్నవారి కపరిమితానం
దంబిడి రంత కొంతకాలంబునకు, 343

బాలకులసుగుణగణసం, శీలకళాఘనులచారు ♦ శీతాంశుముఖ
శ్రీలలితులనవయోధ్యా, పాలకులుగ జేసెరామ ♦ భద్రుండంతన్

ధరణి నసజ్జనపరి,హరణార్థము మనుజుడైన ♦ హరిరాముండున్
ధరణిజయుఁదమ్ములునుఁ దో,నరుగ విమానమున నేగె♦ నాత్మస్థలికిన్

ఆశీస్సు

ఈరామచరిత మిల నె, వ్వారలుపఠియింత్రుభక్తి ♦ వారల కగు సీ
తారాముకరుణ ననవర,తారోగ్యాయుర్యశంబు ♦ లభ్యుదయంబుల్

పాపధ్వంసకమీరఘు. భూపచరిత్రంబువిన్న ♦ పుణ్యులకెపుడున్
తాపత్రయంబులడగును, దాపగుకైవల్యలక్ష్మి♦తగయశమొదవున్

అనుదినమునుపఠియించెడి, మనుజులకీ రామచరిత ♦ మానుకవచనం
బుననిడునుపుత్రపౌత్రా,ద్యనవరతాభ్యుదయసిద్ధ ♦ లంచితసుఖముల్

## కాండాంతము

ఆజానుబాహువిక్రమ! భూజాతాహృదయపద్మ ♦ భూరిసదన! ర
క్షోజాతగోత్రభిదుర!వి, రాజనుదారప్రసాద! ♦ రాఘవరామా!

దేవేశ! దివ్యరూపా!, దేవమహాదేవవినుత!♦దీనార్తిహరా!
భావాతిత! దయాంబుధి!, సేవాప్రియ! దివ్యచరిత! ♦ చిరశుభదాతా!

అజ్ఞానతిమిరపతంగా!, సుజ్ఞాననిధాన! దివ్యసుందర ♦ చరితా!
ప్రజ్ఞావిధానదుర్లభ! విజ్ఞానవిశేషమూల! ♦ విశ్వస్తుత్యా! 350

### గద్య

ఇది శ్రీమత్సీతారామచంద్ర సాంద్రకృపావిశేషప్రసాదిత
కవితావిశేష, సాధుజనసేవాపరాయణ, వినయ
ధురీణ, సేవితరామభద్రభక్త, వీరభద్రోక్త
శ్రీమత్కందరామాయణంబునందు
యుద్ధకాండము సర్వము
సమాప్తము



సుజనరంజనీ ముద్రాశాల - రాజమండ్రి